# శ్రీ స్తవరాజపంచశతి

(ఐదు శతకముల సంపుటి)





డా॥ వానమామలై వరదాచార్యులు
చెన్నూరు.

# SRI STAVARAJA PANCHA SHATI

Group of 5 Shatakas.

by Dr. Vanamamalai Varadacharyulu
Chennur, Dist. Adilabad.

# శ్రీ స్తవరాజ పంచశతి.

(ఐదు శతకముల సంపుటి)

డా॥ వానమామలై వరదాచార్యులు

ప్రథమ ముద్రణ : జూలై, 1994



వెల : రూ. 45/-

ప్రతులకు :
శ్రీమతి వానమామలై వైదేహి
C/o శ్రీ వానమామలై రవీంద్రాచార్యులు
అసిస్టెంట్ ఇంజనియర్
వాటర్ వర్క్సు పంప్ హౌజు,
పంజగుట్ట ఆఫీసర్స్ కాలనీ,
హైదరాబాదు-500 482.

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

ముఖచిత్ర ముద్రణ :
బాలాజి ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు-500 380.
ఫోన్లు : 611413, 600547.

తెలుగు విశ్వవిద్యాలయంవారి ద్రవ్య సహాయంచేత ముద్రితం.



కృతికర్త

డా॥ వానమామలై వరదాచార్యుల వారు

ధర్మపత్ని శ్రీమతి వైదేహి గారు

# సుమనోంజలి

మహాకవి శిరోమణులు, అభినవ పోతన, అస్మద్గురుదేవులు శ్రీమాన్ డా॥ వానమామలై వరదాచార్యులవారు పోతన చరిత్రము మహాకావ్యం, వైశాలిని మహానాటకం వంటి అనేక సత్కృతులు సంతరించి మహాప్రశస్తి గాంచినవారు. వారి దివ్యకావ్యాలలో భక్తిరసామృతభాగీరథిని ప్రవహింపజేసినది ఈ స్తవరాజ పంచశతి. ఆచార్యులవారు జగ మెరిగిన బ్రాహ్మణులు. ఐనా సందర్భోచితంగా సంగ్రహంగా వారి గురించి మనవి చేస్తాను.

ఓరుగల్లు ప్రాంతంలో కవి పండిత ప్రకాండులకు నిలయమైన మడికొండలో శ్రీమతి సీతాంబ శ్రీమాన్ బక్కయ్యశాస్త్రి గారలనే పుణ్యదంపతులకు శ్రీ పరీధావి శ్రావణ బహుళ ఏకాదశి (క్రీ.శ. 16-8-1912) నాడు వరదాచార్యులవారు జన్మించిరి. వీరిది ప్రసిద్ధ విద్వద్వంశం. వీరి వంశంలో ఏడు తరాల వరకు వీరి ఇంటిలో నివాసం చేస్తానని సరస్వతీదేవి సెలవిచ్చినట్లు జనశ్రుతి గలదు. వీరి జనకులు బక్కయ్యశాస్త్రి గారు జ్యోతిర్వేదాంతాది శాస్త్రాలలో ప్రాజ్ఞులై మహా పౌరాణికులై 'బ్రతికి బక్కయ్య శాస్త్రి పురాణం వినవలె' నన్న ప్రశస్తి వహించినవారు. నలుగురు సోదరులలో వరదాచార్యులవారు కనిష్ఠులు. వీరి పెద్దన్న శ్రీ వేంకటాచార్యులవారు. రెండవ అన్న శ్రీ లక్ష్మణాచార్యులవారు. ఇద్దరూ మహా పండితులు, రచయితలు. వీరి మూడవ అన్న శ్రీ జగన్నాథాచార్యులవారు సుప్రసిద్ధ విద్వత్కవులు. వారి రైతు రామాయణము ప్రశస్త మహాకావ్యం. వరదాచార్యులవారి ఆత్మీయులు ప్రముఖ కవి పండితులు శ్రీయుతులు డా॥ పల్లా దుర్గయ్య, ఆచార్య బి. రామరాజు, కాళోజి నారాయణరావు, డా॥ దాశరథి, ఆచార్య సి. నారాయణరెడ్డి గారలు మున్నగువారు 'వరదన్నా' అని ఆప్యాయంగా పిలిచేవారు.

వరదాచార్యులవారు తమ 13వ ఏట శ్రీ వాగీశ్వరీ మహామంత్రం ఉపాసించి ఆ దేవి సాక్షాత్కార భాగ్యమంది విద్వత్కవులై విరాజిల్లినారు. వారు శ్రీరామతారక మంత్రోపాసన చేసి శ్రీరామచంద్రుని అనుగ్రహానికి పాత్రు

లైనారు. తొలుత 'మణిమాల', 'ఆహ్వానం' ఖండ కావ్య సంపుటులు రచించి ప్రచురించిరి. తరువాత వారి 'జయధ్వజం' జాతీయ యుగాని కెత్తిన జయ ధ్వజంగా పండిత వినుతి గాంచిన ఉత్తమ జాతీయకావ్యం. వారి 'పోతన చరిత్రము' జీవితకృతియై మహోత్కృష్ట మహాకావ్యమై వారికి అజరామర కీర్తిని ఆర్జించి పెట్టినది. గేయ కథా కావ్యమైన వారి 'విప్రలబ్ధ' గ్రామీణ జీవన చిత్రణకు మత సామరస్యానికి మానవతా వాదానికి మహిత పతాకగా విలసిల్లినది. వారి 'వైశాలిని' సలక్షణమైన విశిష్టమైన మహానాటకంగా విరాజిల్లినది. 'కూలిపోయే కొమ్మ' అనేది బడుగు జీవుల కష్ట నిష్ఠురాలను వర్ణించిన వచన కవితా సంపుటి. 'సూక్తి వైజయంతి' సుభాషిత సప్తశతి. 'స్తోత్రరత్నావళి' సంస్కృతం నుండి 'గీత రామాయణము' మరాఠీ నుండి ఆంధ్రీకరించబడిన భవ్య గ్రంథాలు. ఈ విధంగా ద్వాదశకృతులు ప్రచురించబడి ప్రశస్తి గాంచినవి.

ఇప్పటికి ఆచార్యులవారి అముద్రిత గ్రంథాలు ఇరువదివరకున్నవి. వాటిలో అనేకంగా ఖండకావ్యాలు, నాటికలు, గేయ నాటికలు, నృత్య నాటికలు, ఆకాశవాణి నాటికలు, బుఱ్ఱకథలు, హరికథలు, సాహిత్య వ్యాసాలు, భాగవత వ్యాసాలు, గీతోపన్యాసాలు, పాటలు, అలంకార శాస్త్రం (పద్యకృతి), ఏకపాత్రలు, ప్రహసనాలు, మానవులంతా మనవాళ్ళే (నవల) మున్నగునవి ఉన్నవి. వారి రచనలు పద్య గేయ వచనాలలో కావ్యం నాటకం వ్యాసం నవల మున్నగు అనేక ప్రక్రియలలో శోభిల్లుతున్నవి.

ఆచార్యుల వారికి కవివతంస, మధురకవికోకిల, ఉత్ప్రేక్షాచక్రవర్తి, మహాకవి శిరోమణి, అభినవ పోతన, అభినవ కాళిదాస, విద్యా వాచస్పతి - అనే అన్వర్థబిరుదాలు సమర్పించబడినవి. ఆచార్యులవారి ఉత్కృష్ట కావ్యసృష్టికి సాహిత్యలోకంలో సముచితమైన సమున్నతమైన గౌరవసత్కారాలు లభించినవి. వందల కొలది కావ్యగానాలు సాహిత్యోపన్యాసాలు కావించిన ఆచార్యులవారికి అసంఖ్యాకంగా గొప్ప సన్మానాలు జరిగినవి. వారి పోతన చరిత్రమునకు 1968లో రాష్ట్ర సాహిత్య అకాడమి బహుమతి ప్రదానం చేయబడినది. 1971 లో సాహిత్య అకాడమి విశిష్ట సభ్యత్వం ప్రసాదించబడినది. 1972 నుండి ఆరేండ్లు విధానపరిషత్సభ్యులుగా పదవి సలంకరించిరి. 1973 లో వారి షష్టిపూర్తి సన్మాన మహోత్సవాలు కోరుట్లలో మా భారతీ సాహిత్య సమితి రాష్ట్రస్థాయిలో

ఘనంగా జరిపి సువర్ణఘంటా కంకణ సత్కారం, రత్నాభిషేకం మొదలగు అనేక సన్మానాలు చేయించి అప్పటి ముఖ్యమంత్రి ప్రస్తుతం గౌ॥ ప్రధానమంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారి చేత గండపెండేరం అలంకరింపజేసినది. 'అభినవ పోతన' అనే షష్టిపూర్తి సన్మాన సంచిక ప్రచురించబడినది. **1976** లో కాశీ విశ్వవిద్యాలయం వారు డి.లిట్. వాచస్పతి గౌరవపట్టం ప్రదానం చేసినారు.

సాహిత్యంలో ఆచార్యుల వారిది సమన్వయవాదం, సమతావేదం. వారి రచనలలో సాంప్రదాయికత, నవ్యత సమ్యక్ సమ్మేళనం పొందినవి. కవితా సిద్ధాంతాల వాదభేదాల కతీతంగా సమస్త పురాతనాధునాతన సత్కావ్యాల మేలిమిని సహృదయతతో స్వీకరించినా రాచార్యులవారు. వారి కృతులలో దైవ భక్తి, జాతీయత, ధార్మికభావన, నైతికత, సామాజిక స్పృహ, మానవతావాదం, మతసామరస్యం మహనీయంగా గోచరించే ఉత్తమ లక్షణాలు.

భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నులైన ఆచార్యులవారు పరమసాత్త్విక జీవనులు. పరమ సహృదయులు. లోకోత్తర సాహిత్యస్రష్టలైన వారి జీవితం మాత్రం సుఖంగా సాగినది కాదు. ఆర్థికదుస్థితి అనారోగ్యం వంటి బాధలకు తరచుగా గురియైనారు. ఎన్ని ఇబ్బంది లెదురైనా చలించక నిబ్బరంగా నిస్తులంగా నిరంతరం కావ్యరచనలో మహానదివలె సాగిపోయిన మహనీయులు, చరితార్థులు.

పోతన చరిత్ర రచన కాలంలో ఘోర క్షయవ్యాధి సోకి మైసూరు ఆరోగ్య కేంద్రంలో చికిత్స పొంది నరకయాతన లనుభవించి ఒక ఊపిరితిత్తి కోల్పోయి బ్రతికి బయటపడినారు. తర్వాత కొంతకాలానికి రక్తపుపోటు వచ్చి జీవితాంతం అవస్థ పడినారు. చివరికి **1982** లో తీవ్రంగా పక్షవాతం వచ్చి మాట మతి కోల్పోయి రెండు సంవత్సరాలకు పైగా వ్యాధిశయ్యపై బాధలుపడి తేది : **31-10-1984** నాడు పరమపదించినారు. మా భారతీ సాహిత్య సమితి దివంగత వరదాచార్యులవారి వర్ధంతి సభ ప్రతి సంవత్సరం నిర్వహిస్తూ సుకవులకు వారి స్మారక బహుమతి సమర్పిస్తున్నది.

ఆచార్యులవారి ధర్మపత్ని శ్రీమతి పూజ్యురాలగు వైదేహి అమ్మగారు. పరమ సాధ్వి, పతివ్రతాతిలకం ఐన ఆ యమ్మగారు ఆచార్యులవారి సాంసారిక

సాహిత్య జీవితానికి సర్వవిధాల అనుకూలంగా తోడునీడగా నిలిచి సేవలొనర్చి 'అపర సావిత్రి' అని వినుతి గాంచిన ఆదర్శ గృహిణి. ఆచార్య దంపతులు సంతతి కలుగనందున అన్న జగన్నాథాచార్యులవారి కుమారుడు శ్రీ రవీంద్రాచార్యులను దత్తత తీసుకొన్నారు. రవీంద్రాచార్యులుగారు హైదరాబాదులో ఇంజనియర్‌గా ఉన్నారు. వారి సతీమణి శ్రీమతి నందకుమారిగారు. వారికి కొడుకు శ్రీ సత్యప్రసాద్, కూతురు శ్రీమతి సత్యప్రసాదిని సత్యప్రసాదిని భర్త శ్రీ వేంకటరాజాజీగారు. వారు సింగరేణి కాలరీస్‌లో ఇంజనియర్‌గా ఉన్నారు. వారి కూతురు చి॥ భార్గవి. సత్యప్రసాద్ హైదరాబాదులోనే ఇంజనియర్‌గా ఉద్యోగంలో ఉన్నాడు. ఈ విధంగా ఆచార్యులవారి కుటుంబ సభ్యులు దైవభక్తి, సదాచారం కలిగి సరసోదారహృదయులై అలరారుతున్నారు.

ప్రస్తుతకృతి 'శ్రీ స్తవరాజ పంచశతి' ఐదు శతకాల సంపుటి. ఆంధ్ర దేశంలో ఐదు సుప్రసిద్ధ క్షేత్రాలలో వెలసియున్న దేవతలపై చెప్పిన శ్రీ శారదా స్తవరాజము, శ్రీ రామ స్తవరాజము, శ్రీ రంగ స్తవరాజము, శ్రీ వేంకటేశ్వర స్తవ రాజము, శ్రీ నృసింహ స్తవరాజము - అన్నవి ఐదు శతకాలు.

తెలుగులో శతక వాఙ్మయం చాలా విశిష్టమైనది. తెలుగులో వెలసినన్ని శతకాలు మరొక భాషలో లేవని చెబుతారు. కావ్య భేదాలలో నూరు పద్యాల కృతిని శతకం అనడం పరిపాటి. ఐనా నూటఒకటి లేదా నూటఎనిమిది పద్యాలు రచించడమే ఆచారమైనది. శతకం ముక్తక జాతిలోనిది. అనుస్యూతంగా పద్యాలలో ఒక కథను - వస్తువును వర్ణించడం కాకుండా విడివిడిగా ఏ పద్యానికా పద్యమే ఒక పూర్ణభావంతో శోభిల్లుతుంది. శతకం ఆత్మాశ్రయ కవితకు చెందినదై కవి స్వీయానుభూతులను స్వేచ్ఛగా వెల్లడించడానికి వీలైనట్టిది.

తెలుగు శతకాలకు మకుట నియమం, సంఖ్యా నియమం, ఛందో నియమం, ప్రత్యేకభావం అనే లక్షణాలుంటవి. సంస్కృత శతకాలలో ఈ నియమాలన్నీ కానరావు. సంఖ్యానియమం, ప్రత్యేకభావం అనేవి రెండు మాత్రం వాటిలో గోచరిస్తాయి. ఉదాహరణకు భర్తృహరి సుభాషితాలలో మూడు శతకాలు త్రిశతి - మూడు వందల శ్లోకాలుండి సంఖ్యానియమం, నీతి శృంగారం వైరాగ్యం అనే ప్రత్యేక భావం మాత్రమే ఉన్నవి. శ్రీ వరదాచార్యులవారి ఈ

పంచశతిలో సంస్కృత శతక లక్షణాలే ఎక్కువగా పాటించబడినవి. ఐదు శతకాలలో ప్రతిది అష్టోత్తరశతసంఖ్య కలది. ప్రత్యేక భావం భక్తి విలసిల్లినది. మకుట నియమం చాలావరకున్నది. శ్రీ శారదా స్తవ రాజములో అక్కడక్కడ 'శారదా! శ్రీ సరస్వతీ!' అని ఉన్నా దాదాపు పద్యాలన్నిటా 'భారతీ!' అన్న మకుటమే ఉండి 'భారతీ శతకము' అనదగి యున్నది. అట్లే శ్రీరామ స్తవ రాజములో 'రఘూత్తమా!' అని నాలుగైదు పద్యాలలో ఉన్నా అంతటా రాఘవా! అనే మకుటమే ఉండి 'రాఘవ శతకము'గా ఉన్నది. శ్రీరంగ స్తవరాజములో మకుట నియమం సర్వత్ర లేదు. రంగనాయకా! రంగనాథప్రభో! రంగరాడ్వల్లభా! రంగేశ్వరా! రంగరాడ్వరా! అని బహువిధ సంబోధనలు కలవు. ఎక్కువగా రంగరాట్ అని ప్రయుక్తమయినది. 'చక్షుశ్శ్రోత్ర విభుండు' అన్న 29వ పద్యానికి మకుటమే లేదు. ఇక శ్రీ వేంకటేశ్వర స్తవరాజములో వేంకటాద్రిప్రభూ!, శ్రీపతీ!, శేషాద్రిపా! ఇత్యాదిగా కొన్ని పద్యాలలో ఉన్నా శ్రీ వేంకటేశ్వరా! అన్న మకుటం తరచై 'వేంకటేశ్వర శతకము'గా భాసిల్లుతున్నది. చివరి శ్రీ నృసింహ స్తవరాజములో నృసింహప్రభూ! నారసింహప్రభూ! అన్న సంబోధనలు కొన్ని పద్యాలలో ఉన్నా నృకేసరీ! శ్రీహరీ! హరీ! అన్నవి అధికంగా ఉన్నవి. ఈ రకంగా వివిధ సంబోధనలతో కూర్చిన మకుట పద్ధతి తెలుగులో తొలి శతకమైన మల్లికార్జున పండితారాధ్యుని 'శివతత్త్వసారము'లో కానబడును. దానిలో శివా! రుద్రా! హరా! అనే సంబోధన లున్నవి.

ఇక ఛందోనియమం. తెలుగు శతకాలలో ఛందోనియమం సర్వత్ర ఉన్నది. కందం (సుమతి శతకం), ఆటవెలది (వేమన), ఉత్పల చంపకమాలలు (దాశరథి, భాస్కర శతకాలు), శార్దూల మత్తేభాలు (శ్రీ కాళహస్తీశ్వర, నారాయణ శతకాలు), సీసం (నరసింహ శతకం) ఇట్లా ప్రత్యేక ఛందస్సులతో శతకాల రచన సాగినది. కాగా ఈ పంచశతిలో ఛందోనియమం పాటించబడ లేదు. ఉత్పలమాల, చంపకమాల, శార్దూలం తరచుగాను, మత్తేభం అరుదుగాను ప్రయోగించబడినవి. శతక వాఙ్మయానికి చెందిన సూక్తి వైజయంతిలోను ఆచార్యులవారు సంస్కృత లక్షణానుసారంగా సంఖ్యానియమం, ప్రత్యేక భావం మాత్రం పాటించి మకుటచ్ఛందోనియమాలను వదలిన విషయం గమనార్హం.

విషయ విభాగాన్ని అనుసరించి భక్తి జ్ఞాన శృంగార వైరాగ్య నీతి ప్రభృతి శతకాలలో ఇవి ప్రధానంగా భక్తికి చెందినవి. అందందు జ్ఞాన వైరాగ్య విషయాలు లౌకిక నీతులు ప్రబోధించబడినవి. భక్తితత్త్వసంపద్విలసితులైన వరదాచార్యులవారి రచనలలో భక్తిరసం అధికంగా జాలువారినది. పోతన చరిత్రంలో శాంతరసాంతర్భూతమైన భక్తియే ప్రధానమైనది. వారాంధ్రీకరించిన స్తోత్రరత్నావళి, శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము, గీత రామాయణము భక్తిరస నిధానాలు. వారి ఇతర కృతులలోను, ఖండకావ్యాలలోను కొంత భక్తిరస పోషణ కావించబడినది. ఈ సర్వరచనలలోను స్తవరాజ పంచశతిలో భక్తిరసం నిండి నిబిడీకృతమైనది.

పంచశతిలో ఆచార్యులవారు ఈ దేవతలనే స్తవం చేయడానికి కారణ మున్నది. శారదాదేవి, రాముడు ఆచార్యులవారికి సాక్షాత్తు ఉపాస్యదైవాలు. శ్రీరంగేశ్వరుడు, తిరుపతి వేంకటేశ్వరుడు, సింహాచల నృసింహస్వామి ఇష్ట దైవాలు. పంచశతిలో ఆయా దేవతల స్తుతిప్రార్థనోపాసనలు, రూపగుణ వర్ణ నలు, దేవతా మహిమలు, తాత్త్విక పారమార్థిక విషయాలు, ఐహిక భోగాల నిరసన, దైవసాక్షాత్కార వాంఛ, భక్తిప్రపత్తులు, దాసభావన, ధర్మచింత, లౌకిక నీతులు బహువిధాల రమణీయంగా వర్ణించబడినవి. ఈ పంచశతి విష్ణు పారమ్యతత్త్వాన్ని విశిష్టాద్వైత విశిష్టతను ప్రబోధిస్తున్నది. పోతన చరిత్రంలోని కొన్ని పద్యాలు యథాతథంగా శ్రీ శారదా స్తవరాజములో శ్రీ రామ స్తవరాజ ములో గ్రహించబడినవి. ఇతర స్తవరాజములలోను పోతన చరిత్రములోని పద్యాలు కొన్ని చేర్చబడినవి.

మొదటిదగు శ్రీ శారదా స్తవరాజములో వాగ్దేవి దివ్యగుణ రూప మహత్తు లను వర్ణించి ఆ దేవి అనుగ్రహానికి ప్రార్థించినారు. ఉత్తమ కవితా లక్షణాలు, సుకవుల ప్రశస్తి అనేక విధాల సరసంగా సాలంకారంగా మనోజ్ఞంగా మహి తంగా ప్రవచించినారు.

కృతి ప్రారంభంలో 'శ్రీ పద్మాసనురాణి' కరుణ నర్థించి 'తల్లీ! అజ్ఞాడ నీదె భారమని నేదైర్యంబుతో' నుంటి ననీ దయతో సుకవిత్వ సంపదలు ప్రసా దించుమనీ మూర్ఖుడననీ వాగ్దేవిని ప్రార్థించినారు. ఆచార్యులవారి సహజనమ్రత్వం

సద్వాంఛ వ్యక్తమైనవి. లక్ష్మి ఇచ్చే ధనధాన్యాలు, దుర్గాదేవి ప్రసాదించే శక్తి నశిస్తాయి కాని వాణి ఇచ్చే జ్ఞానధనం అక్షరమై అనంతమై శాంతిప్రదమై యొప్పు నన్నారు (3). శ్రీ వాగీశ్వరీమహామంత్రోపాసన చేత తమకు ధ్యానావస్థలో ఆ దేవి సాక్షాత్కరించిన దివ్యానుభూతిని దిగువ పద్యంలో హృద్యంగా వర్ణించి నారు.

"మిన్నుల నుండి నీవు దిగి మేదిని వచ్చుట వీణఁబూని బల్
సున్నితమైన గానమును చోద్యముగా వినిపించుచుండుటల్
తిన్నగ నా విమానమది దీధితులన్ వెలుఁగొందు చుండుటల్
కన్నులఁ గాంచి ధన్యతను గంటి ముదమ్మున నుంటి భారతీ!" (4)

పోతనవలెనే అభినవ పోతనగారు ధన్యులు.

'అరువది నాలుగు కళలు చతుర్దశ విద్యలు అన్నీ నీ రూపమయి గౌర వించబడును. కళలలో మేటియైన సాహిత్య కళవు, శాస్త్రాలలో శ్రేష్ఠమైన వేదాంత శాస్త్రమవు నీవే' యని వర్ణించినారు (6). ఆ దేవియే జ్ఞానమిచ్చే వాక్కు, గానానికి రసధ్వనులు ప్రసాదించే తల్లి, కావ్యఫల కల్పవృక్షం అని వినుతించినారు (8). కవిత్వమే ఆ దేవి మనస్సు, గానమే వాక్కు. శిల్పమే శరీరం. విన్యాస విలాసాల అవయవాలే నాట్యం అని ఆ దేవి దివ్యరూపం కొని యాడబడినది (9).

సరస్వతి చతుర్విధ పురుషార్థ ప్రదాయిని అని దిగువ పద్యంలో ఉదాత్తంగా భావించడమైనది.

"కరమున నున్న గ్రంథమది కాంచఁగనౌ నొక ధర్మరూపమై
ఇరవగునర్థరూప మది యేర్పడునేమొ కరస్థపద్మమై
వరశుక మద్ది కామమయి వర్ధిల మోక్షమె యక్షమాలయో
నరపురుషార్థరూపిణివి నాతిరో! నీవె కదమ్మ భారతీ!" (12)

ఇది పోతనగారి 'క్షోణితలమ్మునన్ నుదురు సోకగ మ్రొక్కి నుతింతు ....అక్షదామశుకవారిజ పుస్తకరమ్యపాణికిన్' అన్న పద్యానికి చక్కని వివ రణగా ఉన్నది.

'వాగ్దేవివల్లనే బ్రహ్మకు జ్ఞానం, హరికి సామగానం, పార్వతీ పరమేశ్వరులకు లాస్యతాండవాలు శోభిల్లి త్రిమూర్తులు ఆమెను మన్నన చేస్తున్నారు' అని 48 వ పద్యంలో వివరించినారు. ఈ స్తవరాజము చివరి పద్యాలలో వాగీశ్వరి చేతి చిలుక భాషించే శక్తిగల విషయం, ఆ దేవి చేతిలోని కమలం, జపమాల చక్కగా వర్ణించబడినవి.

"చదువున ధర్మ మర్థమును సాధన జేయఁగవచ్చు నర్థమో
ముదమిడు కామవాంఛితము పూర్తి యొనర్చును కామపూర్తిచే
నొదవు విరాగ మావిరతి నొప్పగు మోక్షము పూరుషార్థముల్
చదువుల తల్లి! నీవిడఁగఁ జాలనివెయ్యవి? శ్రీ సరస్వతీ!" (108)

అని చివరి పద్యంలో వాగ్దేవి సకల పురుషార్థదాయిని యని వినుతించ బడినది.

ఇక ఈ స్తవరాజములో శారదాదేవీస్తుతిప్రార్థనలతోపాటు కవితాలక్షణాలు సిద్ధాంతాలు కవిపండిత ప్రశస్తి చాలా పద్యాలలో వర్ణించినా రాచార్యుల వారు. 108 పద్యాలలో 75 వరకు కవితా సాహిత్య విషయాలే స్పృశించబడిన వంటే వాటి ప్రాముఖ్యం వాటి యెడ ఆచార్యుల వారికి గల ప్రగాఢానురాగం విశదం కాగలవు. ఈ పద్యాలలో ముప్పాతిక పోతన చరిత్రము నుండి గ్రహించినవే. ఇవన్నీ వివరిస్తే మరొక గ్రంథ మవుతుంది. కనుక సంగ్రహంగా వారి అభిప్రాయాశయాల సారాంశం మనవి చేస్తాను.

"ఆశుకవిత కంటె భావమననాత్మక కవిత - విస్తర కవిత - మనోహరం శ్రేష్ఠం. సముద్రములోని రత్నరాశులు పరుగెత్తే నదిలో లభించవు. పదాల గారడితో రచించిన చిత్రబంధాది కవితలే గొప్ప కవితలని రసభావోదంచిత కవితలను త్రోసిపుచ్చడం మూర్ఖత్వం. కవితా కన్య హృదయ భావాలు దొంగిలించక పదాలు (శబ్దాలు, పాదాలు) పట్టుకొని బతిమాలితే చెంతకు వస్తుందా? ప్రతిభ ఏమాత్రం లేకుండా పాండిత్యం యతి ప్రాసలు కూర్చితే కవిత్వం కాదు. సరసత్వం లేని కవిత చప్పని చొప్ప. కొందరు ప్రాచీన సంప్రదాయ కవితలే భాగుండు నంటారు. మరి కొందరు ఆధునిక వచన కవితలే గొప్పవని సంతోష

పడుతారు. ఈ రెండు అభిప్రాయాలూ దండుగ. స్వచ్ఛమైన బంగారం పాత దైనా కొత్తదైనా బంగారమే కదా! సాహిత్యం సత్యం శివం సుందరం అయి యుండవలెను. అప్పుడే అది బ్రహ్మానంద సహోదరమై భాసిల్లుతుంది. కాంతా సమ్మితమై మనోహరమై ధ్వనిగర్భితమై రమణీయార్థ ప్రతిపాదక శబ్దశోభితమై విశ్వ శ్రేయమై విలసిల్లేదే సత్కావ్యం. దోషరహితమై గుణసహితమై ఉదాత్తమై లోకాదర్శ విజ్ఞానదాయకమై దివ్యకథా కలితమై పాత్రోచిత సంభాషణా చతురమై రసవంతమై పండితామోదకరమైన కావ్యాన్ని సుకవీంద్రుడే రచించగలుగుతాడు. సత్కావ్యకళాకాశమే మందిరంగా కలవాడు సరసుల హృదయ కమలాలను సూర్యుని వలె రంజింపజేసే మహా కవీశ్వరుడు కావడం ఎన్ని జన్మల తపః ఫలమో. కవి శుచియై యుండవలెను. మల్లెతీగకు పూలలో వట్టి గడ్డికి వేరులో మరువానికి ఆకులలో చందన వృక్షానికి చెక్కలో మాత్రమే సువాసనలు ఉంటవి కాని మహా కవిత్వంలో సర్వాంగాలలో పరిమళం గుబాళిస్తుంది. కవి ఋషియే.'' ఈ విధంగా కవి గురించి కావ్యం గురించి అమూల్యాభిప్రాయాలు సెలవిచ్చినారు. ఇంకా కావ్య భేదాలు, కవితా లక్షణాలు సిద్ధాంతాల గురించి అనేకాభిప్రాయాలు వ్యక్తం చేసినారు.

ఖండకావ్య మహాకావ్యాల తారతమ్యం తెలుపుతూ ఖండకావ్యాలు మిణుగురులవలె తమంత తామే క్షణకాలం వెలిగి మలగిపోతాయే గాని పరిసరాలను మెరపించి చూపించజాలవనీ, మహా కావ్యాలు దీప జ్యోతుల వలె చాలా కాలం ప్రకాశిస్తూ పరిసరాలను మెరపించి చూపించగలవనీ ఉపమానపూర్వకంగా వివరించారు. గురుజన శిక్షణ లభిస్తే మందబుద్ధి శాస్త్రవేత్త కావచ్చు గాని కవీంద్రుడు కాజాలడు. పుష్టికర భోజనం చేత ఒళ్ళు బలియవచ్చును గాని సహజ సౌందర్యం సమకూడదు. కవిత్వానికి వక్రోక్తి, ఔచిత్యం, ప్రసాద మాదుర్యాది గుణాలు, అర్థ గౌరవం, రీతి, రసధ్వని, ఛందస్సు, వ్యుత్పన్నత, అలంకారాలు, శయ్యాపాకాలు మొదలగునవన్నీ ఉండవలెనని ఆలంకారికులై ప్రబోధిస్తారు. ఇక కావ్యాత్మ గురించి చెబుతూ నలుగురు గ్రుడ్డివా రేనుగు అవయవాలను వేర్వేరుగా తడవి చూసి తమ కర్థమైనట్లు వర్ణించినట్లుగా ఆలంకారిక పండితులు వేర్వేరుగా కావ్యాత్మను నిర్దేశించి చెప్పినారనీ, అన్నీ సముచితంగా విరాజిల్లేదే ఉత్తమ కావ్యమనీ కొనియాడినారు. కవిని శాసనకర్తగా అభివర్ణిస్తారు. కాగా రాజుకుండే సైన్యంగాని ఆయుధాలుగాని కవికి లేవు. అతని

కావ్యగంగయే అడ్డం వచ్చే అధర్మపు గట్లను చెట్లను కూల్చివేయ గలదని అంటారు. కవి ఈశ్వరుడేయన్న దానిని శ్లేషానుప్రాణితరూపకాలంకారంతో దిగువ పద్యంలో రమణీయంగా నిరూపించినారు.

"మూఁడవ కన్ను గల్గుటయు మూర్ధమునన్ రసగంగ లుండుటల్
వేడుకతోఁ గళానిధుల పీడక నౌదలఁ దాల్చుచుండుటల్
కూడును గూడు లేక సతిఁ గూడి దరిద్రత నాశ్రయించుటల్
గాఢసమాధి నుండుటలుగాఁ గవి యీశ్వరుఁడయ్యె భారతీ!"(54)

సమాజంలో విషమ పరిస్థితి - అంటే కొందరు సుఖపడటం మరికొందరు దుఃఖపడటం అనే అసమానస్థితిని గాంచి బాధితుల దుస్థితికి చింతించడంలో కరుణరసం, బాధితుల నేడిపించే బలవంతులపై ఆగ్రహించడంలో వీర రసం కవినుండి జోడుగంగలై ప్రవహిస్తాయని అంటారు (58). అట్లే కవిత శాంతి కాలంలో శృంగార హాస్యరసాలై క్రాంతికాలంలో కరుణ వీర రసాలై ప్రవహిస్తుంది అని వివరిస్తారు (59). సమకాలంలో కవితాఝరి శాంతంగా ఛందోబద్ధమై అసమ (విప్లవ) కాలంలో ఉద్రేకంగా స్వేచ్ఛగా (ఛందో రహితంగా) జాలువారునని వివరిస్తారు (60). ఇంకా ధర్మోపదేశం ఆనందం ప్రసాదించేదే సత్కావ్యం. అశ్లీల శృంగారం నింద్యం. పదవీధనాదు లాశించి కృతులను అమ్ముకోగూడదు. కృతి కృతికర్తకు కృతిభర్తకు మిక్కిలి కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చుతుంది. విషయానందం కంటె కళానందం గొప్పది. రాజుల సహవాసం ప్రమాదకరం. కవులకు రాజాశ్రయం శ్రేయస్కరం కాదు. పురాణ ప్రసిద్ధ కథలు శుద్ధక్షీరాలవలె రుచిగా ఉంటవి. మిశ్రకథలు శర్కర చార పలుకులు ద్రాక్షలు జీడిపప్పు చేర్చి చిక్కని పాలతో చేసిన పాయసం వలె చాలా కమ్మగా ఉంటవి. కృత్రిమకథలు కొన్ని ధాన్యాలనుండి తీసిన కృత్రిమ క్షీరం వలె ఉంటవి." అని ఈ విధంగా కవులను గురించి కావ్యాలను గురించి ప్రశస్తాశయాలను వాగ్దేవికి నివేదనగా వ్యక్తం చేసి సకల సాహితీ జగతికి మార్గదర్శకులైనారు.

పంచశతిలో రెండవది శ్రీరామస్తవరాజము పోతనకు వలెనే అభినవ పోతనకు శ్రీరాము డారాధ్యదైవం. ఆ దేవుని బహుబంగుల భక్తి ప్రపత్తులతో

కొనియాడినారు. అతని రూపగుణాదులు, మహిమలు, ఆర్త త్రాణపరాయణత్వం, దివ్యప్రశస్తి పరమరమణీయంగా వర్ణించినారు. జ్ఞాన వైరాగ్య విషయాలు, ఉత్తమ మానవీయ లక్షణాలు, లౌకిక నీతులు కొన్ని నివేదించబడినవి.

బంధుమిత్రులు స్వార్థులు, అవకాశవాదులు. రాముడొక్కడే అవ్యాజ కరుణామయుడు, ఆపదుద్ధారకుడని దిగువ పద్యంలో వివరించినారు.

"తరుణిమ గాంచి స్త్రీలు, ధనధాన్యములంగని బంధువర్గమున్,
దొరతనమెంచి లోకులును దోయిళులంగొని భృత్యపాళి, య
క్కరణి నిజార్జన మ్మొకటి కల్గిన మేరకె పుత్రవర్గ మా
దరణ మొనర్చు నార్తిఁగని దాపిడి ప్రోతువు నీవ రాఘవా!" (4)

మానవుడు ఘోర తపస్సుల చేత ఇంద్రియాలను నిగ్రహించగలడు కాని ఆ నిగ్రహాన్ని భంగపరచే నీచ మనస్సును జయించడనీ, పుట్టను కొట్టితే పాము చస్తుందా? అని మనోబుద్ధుల నడుమలో పెట్టడాన్ని నొక్కి చెప్పడం జరిగినది(10). నీ యర్చనవల్ల సత్యవాక్యపరిపాలన, ఏకసతీవ్రతం, శరణాగత రక్షణ మున్నగు సద్గుణాలు నా కబ్బవా?(13) అని అనడంలో శ్రీరామారాధన చేసేవారు రామునివంటి గుణశీలాలు అలవరచుకోవలెననే హితోపదేశం లభిస్తుంది. రామతారక మంత్ర మహిమ వివరిస్తూ ఆ మంత్రోపాసనవల్ల శివుడు యముని పారద్రోలి మన్మథుని భస్మంచేసి చావుపుట్టుకలను జయించెననీ, మమత్వాన్ని అడచి మృత్యుంజయుడు అభవుడూ అయినాడనీ, సంసార సాగర విషాన్ని హరించినాడనీ ప్రశస్తంగా చెప్పినారు (19). రామునికి జాతి భేదం లేదు. గిరిజన స్త్రీయైన శబరి భుక్తశేషాన్ని సాదరంగా ఆరగించినాడు. హరిజనుడైన గుహుని ప్రేమతో కౌగిలించుకొన్నాడు (20). రామశబ్ద మహిమ తెలుపుతూ 'రామ' అన్నంత మాత్రాన రాళ్లు నీళ్ళలో తేలినవి. రామపాద ధూళి సోకి రాయి మహిళ యైనది. రామబాణం చూడగానే సముద్రజలా లింకిపోయినవి. 'రామ అన్నంత పాప భయాలు రామనును' అని వివరించినారు (26) 'పరస్త్రీలపై పరుల సంపద లపై కన్నువేసి బలహీనులను హింసించి అధర్మమైన కామలోభాలచేత రాజస తామసభోగాలకు మరగిన రాక్షసత్వాన్ని నశింపజేయుటకే నీ యవతారాలు అని అవతారాల పరమార్థాన్ని విశదీకరించినారు (33). 'నీ దయ కలిగితే ఒక గడ్డి

పరక బ్రహ్మాస్త్రమై జయంతుసంతతివానిని పాదాక్రాంతుని చేసింది. నీ దయ తప్పితే పలుమారులు రాజులను వధించిన పరశురాముఁడు శక్తిహీనుడైనాడు' అని రాముని దయామహిమను ఉగ్గడించినారు (37).

మబ్బులలో నీళ్ళవలె నింగిలో గాలివలె సముద్రజలాలలో ఉప్పువలె అద్దంలో కనబడే వివిధ రూపాలవలె శబ్దంలోని అర్థంవలె సర్వంలో నీవు నిండి యున్నావని రాముని సర్వోపగత లక్షణం ప్రవచించినారు (43). నిద్రావస్థలోనే భార్యా పుత్రులు బంధుమిత్రులు సిరిసంపదలు అబద్ధమౌతవి. ఇక చనిపోయిన పిదప భవసాగరం ఆవలి ఒడ్డున ఏమి ప్రాప్తమగునో ఊహించలేను. జ్ఞానుల హితం విని నిన్ను స్మరించి తరింతు'నంటారు (47). 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అన్న మహా వాక్యంతోపాటు భవతారకుడు పరమాత్ముడే యన్నది భంగ్యంత రంగా ప్రవచింపబడినది. రాముడు పాపాత్ములలోను పుణ్యాత్ములలోను సమానంగా ఉంటాడు. ఐతే పాపాత్ములలో మసిపట్టిన గాజుబుడ్డిలోని దీపకళికవలె ప్రకాశించక, పుణ్యాత్ములలో శుద్ధమైన గాజుబుడ్డిలోని దీపంవలె ప్రకాశిస్తూ ఉంటాడని దేవుని సర్వాంతర్యామిత్వస్థితి విశేషాన్ని యుక్తియుక్తంగా చెప్పినారు (52). 'చేపకు నీరువలె, చెట్టుకు మూలంవలె, చంటిపాపకు తల్లివలె, సతికి పతివలె, నదిలో నావవలె ఆత్మ లన్నిటికి నీ పాదపద్మాలే గతి'యని శరణాగతి పొందినారు (68). 'పాపినైన నేను నీ సన్నిధికి వచ్చి నీలో లీనం కావలె ననుకోవడం పిల్ల కాల్వ సముద్రంలో కలియవలె ననుకోవడం వంటిదే. ఐనా గురుదేవ సమాశ్రయణంచేత, పిల్ల కాల్వ నదిలోచేరి సముద్రంలో కలిసే విధంగా నేను నీలో సారూప్యం చెందగలను' అని నీచులకైనా భగవత్ప్రాప్తి కలదని పథ నిర్దేశం చేసినారు (89). 'పూర్వకర్మయే ఒక పాత్రయై దాని కొలతతోనే సుఖదుఃఖాలనుభవిస్తాడు జీవుడు. ఈ మర్మం తెలిసి కూడ సర్వ సంపత్సౌఖ్యాలన్నీ నాకే కావలెనని ఆశిస్తాను' అని కర్మఫలభోగం వివరిస్తూనే దురాశ వ్యర్థమని ప్రబోధించినారు (92). 'మనుష్యుడు పాపాలు చేస్తాడు కాని పాప ఫలాన్ని పొందగోరడు. పుణ్య కార్యం చేయడు గాని పుణ్యఫల సౌఖ్యం కావలెనంటాడు. పల్లేరు విత్తనాలు నాటి తియ్య మామిడి పండ్లు కావలెనంటే ఏవిధంగా లభించగలవు?' అని జీవుల మనస్తత్వాన్ని కర్మసిద్ధాంతాన్ని చక్కగా వక్కాణించినారు (103). సంసారం దుఃఖ నిలయమని 105, 106 పద్యాలలో

వివరించి సంసారులైన నరులు గంజిలో పడిన గుడ్డి ఈగలనీ, సంసారబాధ లెన్నియున్నా అదే సుఖమని భ్రమిస్తారనీ విరక్తిని వెల్లడించినారు.

దిగువ పద్యాలలో శ్రీరాముని దివ్యరూపరేఖలను వర్ణించి సందర్శన కాంక్షను వ్యక్తం చేసినారు.

"క్రొన్నెల వన్నె లన్ని గయికొన్నటు చెన్నెసలారు నెన్నొసల్...."(27)
"కస్తూరీతిలకోర్ధ్వపుండ్రములతో గ్రైవేయ హారాళితో... (60)
"కలకలలాడు నీ నగుమొగమ్మునఁబూసెడి పారిజాతముల్ .. " (108)

ఈ స్తవరాజంలో ఒక ముఖ్య విశేషం గోచరిస్తుంది. ఉపాస్యదైవమైన శ్రీరామచంద్రుని మనసార వినుతించడంలో వరదాచార్యులవారు తమ పోతన చరిత్రములోని ఆశ్వాసాంత పద్యాలను యథాతథంగా దీనిలో అక్కడక్కడ పొందుపరచినారు. పోతనచరిత్ర కృతిపతియైన శ్రీరాముని సంబోధిస్తూ అంత్యానుప్రాసాలంకారంతో స్తవమొనర్చిన ఆశ్వాసాంత పద్యా లీ స్తవరాజ సువర్ణహారంలో రమణీయ రత్నాలై రాజిల్లుతున్నవి. వాటి వివరమిది.

| | | | |
|---|---|---|---|
| 'శ్రీమన్మన్మథమన్మథాయిత ....' | 11 — | పోతన చరిత్రములో | 2-283 |
| 'ఖండిత దుష్ట దానవ....' | 22 — | ,, | 1-204 |
| 'ఆకర్ణాంత జగన్మనోహర ....' | 32 — | ,, | 3-340 |
| 'వికచనవారుణాబ్జ ....' | 42 — | ,, | 4-413 |
| 'భవభయహారకా!....' | 55 — | ,, | 5-310 |
| 'కలికలుషాబ్ద పర్వత....' | 66 — | ,, | 7-345 |
| 'శ్రీరఘురామచంద్ర!....' | 76 — | ,, | 8-313 |
| 'పురుషమనోహరోల్లసదపూర్వ ...' | 88 — | ,, | 9-385 |
| 'సుందరమూర్తి! లోకనుత....' | 97 — | ,, | 11-380 |
| 'సరసిజనేత్ర! సత్యగుణ....' | 107 — | ,, | 12-310 |

ఇక మూడవది శ్రీరంగ స్తవరాజము. దీనిలో శ్రీరంగేశ్వరుని భక్తి తాత్పర్యాలతో స్తుతి ప్రార్థనలు చేయడమే కాక ప్రపత్తి, తత్త్వజ్ఞానం, వైరాగ్య

భావనలు అధికంగా ప్రవచించడం జరిగినది. ఇదొక తత్త్వ గ్రంథంవలె భాసిల్లు తున్నది. దీనిలో విశిష్టాద్వైత తత్త్వం విశిష్టంగా ప్రబోధించబడినది. మొదట శ్రీరంగపురిని స్తుతించి నమస్కరించి వైకుంఠమే శ్రీరంగమై ప్రకాశిస్తున్నదని వర్ణించినారు.

మట్టిలో ఉన్న విత్తులు అవ్యక్తంగా ఉండి వర్షంవల్ల మొక్కలై నానావిధ రూపనామాలతో సువ్యక్తమగునట్లు సూక్ష్మంగా అవ్యక్తంగా ఉన్న చిదచిత్తులు (పురుషుడు, ప్రకృతి) భగవత్సృష్టిచేత ప్రత్యేక నామ రూపాలతో గోచరిస్తుండు నన్న తాత్త్వికవిషయాన్ని 4 వ పద్యంలో వివరించినారు. పిదప భగవత్తత్త్వాన్ని దిగువ పద్యంలో విశదీకరించినారు.

"ఇదమిత్థమ్మని ముక్తకంఠముగ మిమ్మే మిన్కు రూపించు మూ
ర్తిదమౌ పీఁచును టెంక కొబ్బరియు నారేళంబుగా నైనటుల్
చిదచిత్తత్త్వవపుర్విశిష్ట విభవశ్రీఁగూరు నద్వైత సం
పద నొప్పారు భవత్స్వరూపమని నే భావింతు రంగేశ్వరా!" (5)

దీనిలో భగవత్తత్త్వం విశిష్టాద్వైతపరంగా నిరూపించబడినది. ఇక్కడ అద్వైత సంపద అంటే విశిష్టాద్వైత మనియే. మన వేదాంత దర్శనంలో గల అద్వైతం, ద్వైతం, విశిష్టాద్వైతం అనే మూడు మతాలలో జీవుడు వేరు దేవుడు వేరు కాదు ఒక్కడే అన్నది అద్వైతం. జీవుడు వేరు దేవుడు వేరన్నది ద్వైతం. జీవునితో కలిసి యున్న దేవుడొక్కడే అన్నది విశిష్టాద్వైతం. ఈ మతంలో చిదచిద్విశిష్టుడు దేవుడని చెప్పబడినది. చిత్తు అనగా జీవుడు (ఆత్మ). అచిత్తు అనగా ప్రకృతి. ఈ చిదచిత్తులతో కలిసియున్న పరబ్రహ్మ విశిష్టుడు అనబడు తాడు. ఆ పరబ్రహ్మ ఒక్కడే కావున విశిష్టాద్వైతం అనబడినది. జీవుడు ప్రకృతి దేవుడు ఒక్కటే ఐనారు. అంటే పాలలో నీరు పంచదార కలిసి ఒక్కటైనట్లు. ఆ దేవుడే విష్ణువు - నారాయణుడు. అతడే పరదైవం. ఇత్యాదిగా విశిష్టాద్వైతం చెబుతుంది.

వేదాలు భగవంతుని గురించి ఇదమిత్థంగా చెప్పలేదు. నానావిధాలుగా భేదశ్రుతులు, అభేదశ్రుతులు ఉన్నవి. కాగా పీచు టెంక కొబ్బెర కలిసి కొబ్బెర కాయగా పిలువబడినట్లు జీవునితో ప్రకృతితో కూడిన - విశిష్టవైభవం కలదే

నీ స్వరూపమని శ్రీరంగేశ్వరుని వర్ణించినా రాచార్యులవారు. ఈ విశిష్టాద్వైత తత్త్వం ఇంకా అనేక పద్యాలలో అభివర్ణించబడినది. రాముడు విష్ణ్వవతార మూర్తియైనా శివకేశవాభేద సమన్వయ తత్త్వానికి ప్రతీక. శ్రీరంగం విశిష్టాద్వైత తత్త్వానికి వైష్ణవ మతానికి మూలకేంద్రం. కావున ఈ స్తవరాజంలో విశిష్టాద్వైతం ప్రవచించడం సముచితంగా ఉన్నది.

భగవంతుడు నిరాకారుడూ సాకారుడూను. ఈ విషయాన్ని 'శర్కర నీటిలో కలిసి అదృశ్యమయి, అగ్నితప్తమైనంతలో మరల తన రూపుదాల్చి కనబడునట్లు అదృశ్యుడవైన నిన్ను తపస్సులచేత ఋషులు కాంతు'రని ఉపమించి చెప్పినారు (11). 'శ్రీరంగేశ్వరుని చరిత్రంలో శోభిల్లే సద్గుణాలను నింగి చుక్కలవలె లెక్కించలేను. అట్లే అతని చెడుగుణాలు కూడ లెక్కపెట్టజాలను. ఎందుకంటే చెడు గుణం ఒక్కటి కూడా లేద'ని చమత్కారంగా భగవంతుని అప్రమేయత్వాన్ని నిరంజనత్వాన్ని వినుతించినారు (15).

'అనన్యాశ్చింతయంతో మాం యే జనా పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం'

అన్న గీతావచనానుసారంగా 'నన్ను ననన్య చింతఁగొని నమ్మినవాని....' (20) అన్న పద్యం సాగినది. ఇది శరణాగతి. 'భవహరమౌ త్వదీయ మృదు పాద సమాశ్రయణంబు....' (47) అన్న పద్యం కూడా దీనినే తెలుపుతున్నది. 'ఎగిరి నీ చెంతకు రావలెననుకొంటే నీ వైకుంఠపురదర్శనం అబ్బుతుందా? చేపనై చేరవస్తానంటే క్షీరసాగరం కనిపిస్తుందా? అందుకే నీ దర్శన భాగ్యం నాకు కలిగించడానికి శ్రీరంగంలో వెలసినావా?' అని శ్రీరంగప్రాశస్త్యం ఉగ్గడించినారు (23).

శ్రీరంగేశ్వరుని దివ్యసౌందర్య వర్ణన 32, 33, 34 పద్యాలలో భవ్యంగా చేయబడినది. పారమార్థికానికి దారి చూపించే సదసద్వివేకం కలిగించే విద్య నేర్చి దాని నాచరణలో పెట్టని పండితుడు చేతిలో దీపముండి దారి గానని అందుడని చక్కగా వక్కాణించినారు. (38). ఇంకా ధనాశ, దుస్సాంగత్యం మొదలగు అనేక దోషాలను ఖండించడం జరిగినది. శత్రుమిత్రుల యెడ సమ చిత్తం గలవారే వైష్ణవులని ఈ రీతిగా చక్కగా సెలవిచ్చినారు.

"కోసెడి వారికైనఁ దనుగొట్టెడి వారికినైనఁ బెంచనీర్
వోసెడి వారికైనఁ దరువుల్ సమపద్ధతి నీడనిచ్చు నీ
దాసులు ద్వేషమూడ్చి సమతంగని మేలొనరింత్రు వైరమున్
గోసెడివాఁడె వైష్ణవుఁడగున్ దగనంటిని రంగనాయకా!" (49)

జన్మను కడిమిచెట్టుతో రూపించి రమ్యంగా చెప్పిన

"అఘమూలంబయి....భవమహా నీపాగ్ర మందుండి దే
వ! ఘనాపజ్జలధిన్ మునింగితి ననున్ గాపాడవే రంగరాట్!" (54)

అన్న పద్యంలో భవబాధలను వివరించి ఆర్తితో శరణు వేడిన విషయం సువ్యక్తమైనది. తర్వాతి మరికొన్ని పద్యాలలోను ఈ ఆర్తి, శరణాగతి కనబడుతాయి.

ఈ స్తవరాజంలో జీవితక్షణభంగురత, సంసారభోగనిరసన, ఆర్తి, వైరాగ్యచింతన, శరణాగతి చాలా పద్యాలలో నివేదించబడినవి. ముఖ్యంగా,

'స్వామీ! వేరొక దిక్కు గాంచ నిఁక....' (55)
'వనితల వ్రాలుచూపులకు వ్రాలుచు....' (56)
'వేడుక వచ్చినాఁడ పృథివీతల యాత్రకు....' (57)
'అరుసముతోడ భార్యయని... ' (58)

అన్న పద్యాలు పోతన చరిత్రములో సప్తమాశ్వాసంలో భాగవత కృత్యపహరణ తర్వాత పోతన మహాఖేదంతో నిర్వేదంతో తలపోసిన పద్యాలే యథాతథంగా గ్రహించబడినవి. ఇట్లే పోతన చరిత్రము నుండి తీసుకొన్న పద్యాలు మరికొన్ని ఉన్నవి.

ఇంకా నశ్వరవాంఛలు తుచ్ఛలోహాలనీ, అనశ్వరదైవభక్తి బంగారమనీ, బాహ్యశత్రుజయం కంటె అంతశ్శత్రుజయం వీరలక్షణమనీ, హరిని విడిచి అన్యదేవతలను కొలిస్తే ముక్తి లభించదనీ, గోవులను చంపి రక్తం త్రాగే పులుల వంటివారు అసురులు మృతాహారులనీ, గోవులను పెంచి పాలుత్రాగే భూసురులు అమృతాహారులనీ, స్వార్థులు తామే మెరుస్తూ లోకాన్ని వెలిగించని చుక్కల వంటివారనీ, త్యాగధనులు తాము వెలుగుతూ లోకాన్ని ప్రకాశింపజేసే చంద్రుని వంటివారనీ ఈ విధంగా అనేక నీతులు ప్రబోధించబడినవి.

ఈ స్తవరాజంలో 78 నుండి 88 వరకుగల పద్యాలలో రామాయణ సన్నివేశాలను ప్రస్తావిస్తూ తాత్త్విక విషయాలను విశిష్టాద్వైతమతపరంగా సమన్వయం చేసి ప్రబోధించబడినది ప్రశస్తమైనది. ఉదాహరణకు

"పావని లంక సీత దరి వచ్చి వచించు విశిష్టభాషణల్
శ్రీ విభుఁ గూర్చి సద్గురుఁడు చేతనునిం దరియింపఁజేయు సం
భావనజేసి తెల్పు వరభాగవతాది పురాణశాస్త్రముల్
ద్రావిడ సత్ప్రబంధగత తత్త్వరహస్య ప్రబోధ రంగరాట్!" (84)

అద్వైతులు సోఽహమ్మంటారు. విశిష్టాద్వైతులు దాసోఽహమ్మంటారు. భక్తిమార్గాన దాసోఽహమ్మనుటలోనే పరమ పదం లభించగలదని 'తా సోఽహమ్మని....' (108) అన్న చివరి పద్యంలో ద్రావిడ వేదాంత సారభూత వాక్యంగా ప్రవచించి ఈ స్తవరాజాన్ని ముగించినారు.

నాలుగవదియైన శ్రీ వేంకటేశ్వర స్తవరాజములో శ్రీ వేంకటేశ్వరుని స్తుతి ప్రార్థనలు తాత్త్విక విషయాలు లోకనీతులతోపాటు కొన్ని విశిష్ట విషయాలు వర్ణించబడినవి. దీనిలో 10 నుండి 28 వరకు గల పద్యాలలో స్వామి వారి దివ్య రూపరేఖలను అంగాంగాలను మిగుల మనోహరంగా భక్తి రసభరితంగా వర్ణించడం జరిగినది. తర్వాత 31 నుండి 40 వరకు గల పద్యాలు క్రమంగా దశావతారాలను వర్ణించినవి. ఐతే దాశరథిశతకం మున్నగు పూర్వ శతకాలలో వలె గతానుగతికంగా అవతార విశేషాలను ఉగ్గడించటం కాక ఒక్కొక్క అవతారంలో భగవంతుడొనర్చిన దుష్టశిక్షణ శిష్టరక్షణాది విషయాలను ప్రస్తుతించి అవిధంగానే తన నుద్ధరించవలెనని ఆర్తితో ప్రార్థించిన విషయం విశిష్టంగా ఉన్నది. ఉదాహరణకు

"నలువ శయింప సోమకుఁడు నాలుగు వేదములన్ హరించి యా
జలనిధిలోన దాఁగిన ఝషమ్మయి వానిని బట్టి చంపి మిన్
కులజుని కిచ్చినా వటులె కోల్పడు జ్ఞానము నా కొసంగి సం
సరణమహాబ్ధినిస్తరణ శక్తి నొసంగవె వేంకటేశ్వరా!" (31)

ఈ స్తవరాజంలో మరొక విశేషం గోచరిస్తున్నది 41వ పద్యం నుండి అనేకానేక పద్యాలలో ఆత్మాశ్రయంగా తమ దోషాలు దురితాలు లోపాలు భగవంతునికి నివేదించి దయతో ఉద్ధరించి తరింపజేయుమని ఆర్తితో ప్రార్థించినారు. ఆ పద్యాలలో లోకనీతి, లౌకికభోగనిరాసం, జీవనధనాదుల క్షణికత్వం, భరన్యాసం, నైచ్యానుసంధానం - ఇట్లా ఎన్నో ఎన్నెన్నో విషయాలు సాలంకారంగా సరస మనోజ్ఞంగా ప్రవచింపబడినవి. ఈ విధంగా ఈ స్తవరాజము ఆపన్నులకు ప్రపన్నులకు ధార్మికులకు ఆధ్యాత్మికజీవనులకు అవశ్య పఠనీయంగా ఉన్నది. వివరిస్తే మరొక గ్రంథమౌతుంది. కావున మచ్చుకు కొన్ని ఉదాహరిస్తాను.

'విషయ సుఖానుభవంలో తృప్తిలేదు. విషయ వాసనలింకా ఎక్కువౌతవి. సంసార జలధిలోని ఉప్పునీరు త్రాగితే దప్పి తీరుతుందా? పాదతీర్థ మీయవలె' నంటారు (43).

"మానస మందు నా దురభిమానము పోదెవరెన్ని జెప్పినన్
జ్ఞానము రాదు, కర్మయన సాధ్యము గాదెద భక్తిలేదు, నీ
ధ్యానము నిల్వఁబోదు, భవదారుణదావశిఖార్త జీవనో
ద్యానుఁడ నీదు చల్లని పదమ్మును నమ్మితి, వేంకటేశ్వరా!" (44)

ఈ పద్యంలో ఎంత వేదన, నివేదన ఉన్నదో.

'బాల్యం స్వప్నంవలె దాసనపు మొగ్గవలె రెన్నాళ్లుండి పోయినది. కల్లు మత్తువలె చిత్తాన్ని చలింపజేసి యౌవనం వెళ్ళిపోయినది. ముసలితనం, ధరించి తీసివేసిన పూలదండవలె వచ్చిపడినది. ఇంక నేనెప్పుడు జీవిత మనే పుష్పను నీ పాదపూజ కర్పించగలను?' అని వ్యధపడినారు (47). 'పాపాలు చేస్తూ సత్పురుషుని వలె ధర్మ ప్రబోధం చేస్తాను. వ్యభిచరించే వేశ్యలకు జారత్వం చేయవద్దనే హక్కు ఎక్కడిది? అని దుష్టుల శ్రీరంగనీతులను ఖండించినారు (53). 'నిరంతరం పరుల తప్పులు వెదకి తీయడంలో వేయి కనులుగల ఇంద్రున్ని, పరులను నిందించడంలో దశవదనుడైన రావణాసురున్ని, సజ్జనులను హింసించడంలో వేయి భుజాలు గల బాణాసురున్ని. అంతేకాని, ఒకనాడు నేను నా నోటితో నిన్ను కీర్తించను. కనులతో సేవించను. చేతులతో అర్చించ'నని దైవ

భక్తిలేని దుర్మార్గులను వ్యంగ్యంగా అధిక్షేపిస్తారు (68). 'నీ పాదపద్మాల సేవకు విరోధులైనవారు తల్లిదండ్రులైనా, గురువర్యులైనా, సోదరులూ బంధువులైనా విడువదగినవారే యని భరతుడు, ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి, విభీషణుని వంటి మహనీయులు చెప్పి ఆచరించి చూపినా'రని ప్రవచించి దైవనిష్ఠా గరిష్ఠతను చాటినా రాచార్యుల వారు (71).

'ధరణిజనాళి సేవకు....' అన్న 72 వ పద్యంలో ఐదు రకాల మనుష్యులు పేర్కొనబడినారు. 'పరోపకారం చేసేవాడు ప్రథముడు. తన లాభానికి పరులకు ఉపకరించేవాడు రెండవవాడు. ఇతరులను చెరచి తాను సుఖపడేవాడు మూడవ రకం. తనకు లాభం లేకున్నా ఇతరులను చెరచి సంతోషించేవాడు నాల్గవవాడు. ఇక ఇతరులను చెడగొట్టి నేనూ చెడిపోయే పంచమున్ని' అని నైచ్యానుసంధానంగా చెప్పి లోకానికి వ్యంగ్యంగా హితోపదేశం చేసినారు. ఇది భర్తృహరి 'తమ కార్యంబు పరిత్యజించియు పరార్థప్రాపకుల్ సజ్జనుల్....' అన్న సుభాషితాన్ని మించి గొప్పగా చెప్పినది. 'మనస్సనే కోతి సంసారమనే అరణ్యంలో చిక్కుపడి భ్రాంతితో తిరుగాడు తున్న'దన్న విషయాన్ని దిగువ పద్యమెంత హృదయంగమంగా రూపించి చెప్పుతున్నదో చూడండి.

"భ్రాంతాపాంగ విలాసహాససుమమై భామారతస్వల్ప సౌ
ఖ్యాంతాపత్య ఫలాన్వితంబయి యురోజాద్రిద్వయోపేతమౌ
కాంతా మోహన రూపయౌవనలతాకాంతర మధ్యంబునన్
భ్రాంతింజెందె మనఃప్లవంగ మెటులప్పా వేంకటాద్రి ప్రభూ!" (73)

ఈ పద్యం భర్తృహరి శృంగార శతకంలోని-

'కామినీ కాయకాంతారే కుచపర్వత దుర్గమే
మా సంచర మనఃపాంథ! తత్రాస్తే స్మరతస్కరః'

అన్న సుభాషితాన్ని సమగ్ర సావయవ రూపకాలంకృతితో చక్కగా ప్రబోధిస్తున్నది.

'అతి భోగభాగ్యాలిచ్చే నీ కరుణ వద్దు. అది అతివృష్టివలె హాని చేసి నిన్ను మరపించి దురాత్ముని చేస్తుంది' అంటారు అత్యాశ లేని సదాశయంతో

(77). "యస్యాత్మా శరీరం" "యస్య పృథ్వీ శరీరం" అన్న శ్రుతి వాక్యాలుదాహరించి 'ఈ పృథివి నీ శరీరమే కావున శిలావిగ్రహ పూజ చేస్తాను అది నీకే చెందుతుంది కదా!' అని ఈశ్వరుని సర్వమయత్వాన్ని విగ్రహారాధన పరమార్థాన్ని విశదీకరించినారు (93).

విశిష్టాద్వైతం భక్తిప్రధానమైనది. ప్రపత్తి, దాసోఽహం అనే దాస్యభావన దీనిలో ముఖ్య లక్షణాలు. తదనుగుణంగా ఈ స్తవరాజంలో అనేకానేక పద్యాలలో వీటిని ప్రబోధించడం జరిగినది 'నిత్యము తావకీన....' (96) అనే పద్యంలో నీ దాసానుదాసులకు చివరి దాసుడనన్న దాస్యభావన వ్యక్తం చేయబడినది. 'నీ దయ గాంచడానికి నిజమైన ఆర్తి కాక వ్యాకరణాది శాస్త్రాల అవసరమేమి? పూలు పూయక నీడనీయక పండ్లనీయక ఉండే తులసీ చెట్టు ఆకుల సుగంధంతోనే నీవు సంతోషించి అనుగ్రహిస్తావు కదా!' అని విద్యాడంబరం అవసరం లేని నిర్మలభక్తి తత్పరతల ప్రాధాన్యాన్ని వివరించినారు (107).

పంచశతిలో చివరిది శ్రీ నృసింహస్తవరాజము. ఇది సింహాచలక్షేత్రంలో వెలసిన శ్రీ వరాహ నృసింహస్వామిపై చెప్పిన శతకం. దీనిలోను భక్తి జ్ఞాన వైరాగ్య విషయాలు లౌకిక నీతులు పారలౌకికతత్త్వ విశేషాలు ప్రబోధించబడినవి. అర్థకామాదుల దుష్ఫలితాలు, నిత్యానిత్యవస్తు వివేకం, ప్రపత్తి, ముముక్షు మొదలగునవి మిక్కుటంగా చక్కగా వక్కాణించబడినవి.

దేవతల మహాపురుషుల నామాలకు చమత్కారార్థ కల్పన చేయడం వరదాచార్యులవారి కవితా లక్షణాలలో ఒకటిగా వారి మణిమాలాది కృతులలో చూడగలము. అది ఈ స్తవరాజంలోను గోచరిస్తుంది. సింహాచలక్షేత్రస్వామి వరాహనరసింహుడు. ఆయన కా పేరు ఎట్లా వచ్చినదో దిగువ పద్యాలలో చమత్కరించి చెప్పినారు.

"నీవు వరాహరూపుడవా.. .హరీ" (19) అని చెప్పి,

"చిత్రముగా వరాహ నరసింహ సమైక్యతబూని...." (22) అన్న పద్యంలో వరాహ నరసింహత్వాలను ఒకే రూపంలో చూపి శ్రీదేవిని భూదేవిని ఏకకాలంలో దగ్గరకు తీసి ఇద్దరూ ప్రేమపాత్రలని నిరూపించినావు. కాగా

'శ్రీదేవి నిన్ను కేసరిగా అలముకోగా భూదేవి చందన రూపంతో కౌగిలించు కొన్నది' అని చమత్కారంగా మనోజ్ఞంగా వివరించినారు.

"కదనార్థమ్ము....శ్రీహరీ!" (59) అన్న పద్యంలో మదపుటేనుగువలె యుద్ధోన్మాదియై మీదికి వచ్చే హిరణ్యకశిపు రాక్షసాధముని వధించడానికి పైకి సింహరూపంతో, తమ పాదపద్మములలోని తీర్థ మకరందాన్ని ఆస్వాదించ దలచిన తుమ్మెదవంటి భక్తప్రహ్లాదుని కాపాడడానికి క్రిందికి నరరూపంతో - ఒకే సారి నరసింహ రూపాలతో అవతరించినా"వని యుక్తియుక్తంగా చమత్కారంగా కల్పన చేసినారు. ఇక్కడి వరాహ నరసింహస్వామికి కేసరి, చందనం పూసి అర్చించడం విశేషాచారం.

"కాకి రావిపండ్లు తిని రెట్టవేయగా అందులోనుండి పవిత్రమైన రావిచెట్టు పుట్టునట్లు, ఈగ ఎంగిలినుండి తేనె జనించునట్లు సామాన్యమైన ముత్యపు చిప్పనుండి ముత్యాలు బయల్పడునట్లు నా అల్పవాక్కు నీ దయచేత కవిత్వమై జాలువారదా?" అంటారు రమణీయోపమతో (4). 'విశ్వరూపివైన నీవు నా చిన్న ఎదలో అణగి యుండడం మహావృక్షం సూక్ష్మబీజంలో నిక్షిప్తమైనట్లే' అంటారు (5). అంతటా ఉన్న నిన్ను గ్రుడ్డివానివలె హిరణ్యకశిపుడు కానక నీ వెక్కడా లేవంటాడు. భక్తి దృష్టితో చూసే వానికి నీవంతటా కనబడ గలవని ప్రహ్లాదు డంటాడు' అని నాస్తికాస్తిక భేదాన్ని సోదాహరణంగా ప్రవ చించినారు (7). 'నన్ను పైకెత్తడానికి నాలుగు చేతులు ధరించి యున్నావు. నేను పడిపోవడానికి పశువువలె నాలుగు కాళ్ళతో గింజుకొంటాను' అని హరి ఉద్ధరించదలిస్తే జీవుడు పతితుడు కాగోరుతాడన్న వాస్తవాన్ని వెల్లడి చేసినారు (16).

నరసింహావతారం వీర వైష్ణవానికి నిదర్శనమని చెబుతారు. తదను గుణంగానే ఈ స్తవరాజంలో సింహాచల నరసింహస్వామిని సర్వోత్కృష్ట దైవతంగా పురస్కారం, తక్కిన దేవతలను తిరస్కారం చేయడం జరిగినది.

"శ్రీ సింహాద్రి వసించి నీవిటువలెన్ సింహాఖ్యతో నెయ్యెడన్
భాసించం గతమేమి? స్వామి! యితరుల్ బ్రహ్మేంద్ర రుద్రామరుల్
నీ సాన్నిధ్యము నందుఁగేసరి సరి న్నిల్వంగ లేనట్టి స
త్రాసాశేషసృగాలజాలమని యీ దాసాళి తెల్యన్ హరీ!" (18)

'నీవు సింహాద్రిలో వెలసి సింహాఖ్యతో ప్రకాశించడానికి కారణమేమి? బ్రహ్మ శివుడు ఇంద్రుడు మొదలగు ఇతర దేవతలు నీ ముందట సింహం ముందట భయంచేత నిలువలేని నక్కలు అని భక్తులకు తెలియజేయడానికే స్వామి!' అంటారు. ఇటువంటిదే "చిల్లర దైవముల్...." అన్న 43 వ పద్యంలో భాసిస్తుంది. 'చిల్లర దేవుళ్ల చిన్న దీపాలవలె ఒక్కొక్క ఇంటిని వెలిగిస్తారు. కాని సూర్యుని వలె నీవు విశ్వమెల్ల ప్రకాశింపజేస్తావు' అని శ్రీహరి పరాత్పరత్వం కొనియాడినారు.

స్తవరాజంలో మతసామరస్యం, సామ్యవాదం వంటి ఆధునిక భావాలూ ప్రవచింపబడినవి.

"ఎందును గాంచనందె కలవీవని తెల్పెను నీ చరిత్రమో
హిందు వితండు ముస్లిమితఁడీతఁడు క్రైస్తవుఁడంచు భేదముల్
బొందుదురే నరుల్ చెవిని బోసిన వేద ఖురాను బైబిలుల్
సందియమేలరా? బధిరసన్నిధి సంకురొదల్ నృకేసరీ!"(27)

'సర్వాంతర్యామి యైన భగవంతుని హిందువని ముస్లిమని క్రైస్తవుడని భేదభావంతో ద్వేషిస్తారు. భగవంతుడు ప్రసాదించిన వేదం ఖురాను బైబిలు చెవిటివాని ముందు శంఖమూదినట్లే అయె'నని విచారం వ్యక్తం చేసినారు. నిజమైన దైవభక్తి గలవాడు ఏ మతస్థుడైనా అన్యమతస్థుని ద్వేషించడం పాపం అన్న ప్రబోధం లభిస్తుంది ఇందులో. ఇక సామ్యవాదం, పేదల బాధల గురించి ఇలా వ్రాసినారు.

"గుడిసెల యందు నస్థికల గూఁడులఁగూడును గుడ్డలేని యా
బడుగు శరీరముల్ మిడుక బంగరు శాటిని దాల్చి కుల్కుచున్
కుడిచెడు భోగభాగ్యములు కూడునె? పుత్రులఁబస్తులుంచి తాఁ
గడుపును నింపుకొంచు మనగల్గునెట్టుల్ జనకుండు? శ్రీహరీ!" (34)

నిరుపేదలు కూడు గూడు గుడ్డలేక పరితపిస్తూ ఉంటే వారి నాదుకొనక దేవునికి వైభవసేవలు చేయడం నిరర్థక మన్న మానవ సేవయే మాధవ సేవ అన్న నీతిబోధ చేయబడినది. ఇట్లే తరువాతి 35 వ పద్యంలో 'కరవులు కాట కాలు పడి రైతు దివాల తీసినాడు. ప్రజలు దిక్కుగానక దయజూడుమని నిన్ను ప్రార్థిస్తున్నారు. నీవేమో లక్ష్మిని ఎదలో పెట్టుకొని పట్టనట్లుంటావు' అంటారు. దుర్భిక్షాది విపత్కాలాలలో ధనికులు సరకులను పేదల కందకుండా దాచి యుంచే దౌష్ట్యాన్ని వ్యంగ్యంగా అధిక్షేపించినారు.

స్తవరాజంలో కొన్ని చమత్కార భావాలు, వ్యాజస్తుతులు శోభిల్లుతున్నవి.

'నరసింహా! నీవు ప్రాణులకు మోక్ష మివ్వాలని తలుస్తావు. నీ కొడుకులైన బ్రహ్మ, మన్మథుడు మోక్షానికి విరోధులై సృష్టి కార్యక్రమాలు సాగిస్తారు. ఇది విచిత్రంగా ఉన్నది' అంటారు (39). ఇంకా 'నీ సతులైన శ్రీదేవి, భూదేవి మాకు ధనధాన్యాలపై ఆశ కలిగిస్తారు నీ సుతుడు మన్మథుడు స్త్రీవ్యామోహం కలిగిస్తాడు. నీవు వారినేమీ అనవు. మమ్ము శిక్షిస్తావు. ఇక నీ కూతురు గంగమ్మయే మా పాపాలను తొలగిస్తున్న'దని చమత్కారంగా ఆక్షేపిస్తారు.

"అరయ పరస్వరూప...." అనే 51 వ పద్యంలో నారాయణుని రూపాలు పేర్కొన్నారు. వైకుంఠంలోనిది పరరూపం. అది మేఘ జలంవలె అందనిది. పాల సముద్రంలో పడుకొని యున్నది వ్యూహరూపం. అది సముద్రజలంవలె సేవించ వీలుకానిది. రామకృష్ణాద్యవతారాలు విభవ రూపాలు. అవి బావి నీళ్ళ వంటివి. దేవాలయంలో ఉండెదిది అర్చారూపం. అది చేతిలోని నీరు వంటిదై సులభమైనది' అని ఉపమానపూర్వకంగా యుక్తియుక్తంగా వివరించినారు.

'ఈ ప్రపంచమే ఒక నాటకం, జ్ఞానాజ్ఞానాలే రాత్రింబవళ్ళు, భూమియే రంగస్థలం, ఆకాశమే మేలుకట్టు, ఋతువులే తెరలు, జీవులే పాత్ర'లని జగత్తత్త్వాన్ని మనోజ్ఞంగా రూపకాలంకారంలో వర్ణించినారు(69). 'జ్ఞానంతో తరిస్తానంటే శాస్త్రం తెలిసే మేధస్సులేదు. భక్తితో ధ్యానిస్తానంటే మనస్సు నిలువదు. ప్రపత్తి చేస్తానంటే అహంకారం చావదు. దీనుల నుద్ధరించడానికి నీ కరుణ తప్ప వేరొకటి గతిలే' దంటారు (91). సంసారంకంటె నరకమే మేలంటారు.

నరకంలో తన దేహబాధలొకటే జీవు డనుభవిస్తాడు. కాని సంసారంలో తన బాధలతోపాటు తన భార్యాపుత్రుల బాధలు కూడా పడవలసి వస్తుంది అని దేవుని శరణు వేడుతారు (97). ఇక్ష్టే స్వర్గంకంటె భూలోకనివాసమే మేలంటారు. స్వర్గంలో దేవతలు సుధలుగ్రోలి పొగరెక్కి సమ్మోహాత్ములై భగవంతుని విస్మరిస్తారు. భూలోకంలోనైతే దుఃఖాలు కలిగినప్పుడైనా దేవుని స్మరిస్తారు (90). ఇంకా అనేక విధాల ఐహికభోగ నిరసన, శరణాగతి, తర ణోపాయచింత వ్యక్తం చేసి చివరకు 'జన్మము ముక్తిదారి....' అన్న 108 వ పద్యంలో 'పుట్టుక అనేది ముక్తి మార్గంలో నడువనీయని కాలిముల్లు. ఈ జన్మాలనే ముండ్లను పెరికివేయడానికి మరొక మంచి జన్మ సాధనం. మొదట గ్రుచ్చిన ముల్లును మరొకముల్లు తీసివేసిన తరువాత, తీసిన ముల్లును తీయబడిన ముల్లును - ఈ రెండిటిని పారవేయడమే ముక్తి అనబడుతుంది అంటారు. జన్మ రాహిత్యమే మోక్షమన్న తత్త్వాన్ని ప్రబోధించి స్తవరాజం ముగించినారు.

పంచశతిలోని వస్తుభావాలు, వైశిష్ట్యం మనవి చేయడంలో దిఙ్మాత్రంగా ఉదాహరణ తీయబడినవి. ఇప్పటికే గ్రంథవిస్తరమైనది ఇంకా వివరిస్తే మరొక గ్రంథమౌతుంది. పద్యాలన్నీ పఠనీయాలే, ఆనందప్రదాలే ఆలోచనాత్మకాలే. ఇక దీనిలోని రచనశైలి గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. అనేక పద్యకృతులు, పోతన చరిత్ర మహాకావ్యం సంతరించిన తర్వాత రచించిన ఈ శతక కదంబంలోని రచన మహోత్కృష్టమైనదని అనడంలో ఎట్టి సందేహం లేదు.

పంచశతిలో వేదాంతాది శాస్త్ర విషయాలు రమ్యంగా, రసవంతంగా, భావోదంచితంగా వర్ణించబడినవి. ప్రసాద మాధుర్యాది గుణాలతో ఉపమా రూపకాద్యలంకారాలతో ఆనందం, ధర్మోపదేశం సమంగా శోభిల్లి సత్కృతి రత్నమై విరాజిల్లుతున్నది. పంచశతి చివర కూర్చబడిన 'గద్యము' సాంప్ర దాయికమై ఆచార్యులవారి పరిచయం ప్రశస్తి వెల్లడిస్తున్నది. దీనిలో ముఖ్యంగా వారు పొందిన ఘన సన్మానాలు, బిరుదులు ప్రకటించబడినవి.

ఈ స్తవరాజ పంచశతి పద్యాలకు ఆచార్యులవారు స్వయంగా తాత్పర్యం వ్రాసినారు. ఇది వారే వ్రాయవలసినది కాదు. శిష్యుల అభిమానుల అభ్యర్థన కాదనలేక వ్రాయవలసి వచ్చినది. ఈ తాత్పర్యలేఖనం వలన పాఠకులకు విషయావగాహనలో చాలా సౌలభ్యమేర్పడినది.

ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము తరువాత శ్రీకాళహస్తీశ్వర శతక మొకటి వ్రాసినాడు. పోతన శ్రీ మహాభాగవత రచనానంతరం నారాయణ శతక మొకటి రచించినాడు. వరదాచార్యులవారు పోతన చరిత్రం తరువాత ఈ ఐదు శతకాలు రచించినారు. కవులు కవితాభ్యాస దశలోనే కాక మహాకావ్యాల రచనానంతరం జీవితం పండిన దశలోను శతకాలు రచించినారన్న విషయం సుస్పష్టం. ఆచార్యులవారు ధర్మవిలసితమైన లౌకిక జీవితానుభవం, భక్తి జ్ఞాన వైరాగ్య శోభితమైన పారమార్థిక జీవితానుభూతి, మహోత్కృష్ట కావ్యరచనా కౌశలం దివ్యంగా ఫలవంతమయిన దశలో మహాభక్తి తాత్పర్యాలతో ఈ పంచ శతి రచించినారు. ప్రాణాధికమై ఆత్మ కాత్మయైన ఈ సత్కృతిని ప్రచురించి లోకానికి అందించవలెనని ఆచార్యులవారు పడిన ఆరాటం వారి జీవితకాలంలో ఫలించలేదు ఇప్పటికైనా వెలుగు చూసి ఆచార్యులవారి ఆత్మశాంతికి, ఆంధ్ర సాహిత్య సౌభాగ్యానికి హేతువైనది.

శ్రీమతి పూజ్యురాలగు వైదేహి అమ్మగారి శ్రీ రవీంద్రాచార్యులు గారి ఆదేశానుసారం, ఆత్మీయులు సహృదయ విద్వత్కవివరేణ్యులు శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడు, డా॥ రావికంటి వసునందన్ గారల ప్రోత్సాహంతో అభిజ్ఞత లేని నేను యథాశక్తి ఈ పీఠిక కూర్చినాను. ఈ అవకాశం ప్రసాదించిన వారికి కృతజ్ఞతాభివందనాలు.

అమూల్య సాహిత్య నిధియైన ఈ స్తవరాజ పంచశతి సరస విద్వత్కవి వర్యులకు, ధార్మికాధ్యాత్మిక జీవనులకు అత్యంత ప్రయోజనకరమై అలరార గలదని ఆశంస.

ఇట్లు,
విధేయుడు
**డా॥ అందె వేంకటరాజము**
అధ్యక్షుడు,
భారతీ సాహిత్య సమితి

కోరుట్ల,
1-7-1994

# విజ్ఞప్తి

ఈ స్తవరాజ పంచశతి పూజ్యులు మా నాయన గారి అముద్రిత గ్రంథాలలో చాలా ముఖ్యమైనది దీనిని ముద్రణ చేయించడానికి వారు ఎంతో ప్రయత్నించి యుండిరి. కాని వారి జీవిత కాలంలో నెరవేరలేదు. తరువాత పూజ్యురాలగు మా అమ్మగారికి, మా కుటుంబ సభ్యులకు ఈ పంచశతి ముద్రణ చేయించవలెనన్న కాంక్ష ప్రబలంగా ఉండెను. ఎన్నో విఘ్నాల పిదప ప్రస్తుతం తెలుగు విశ్వ విద్యాలయం వారి రూ 5000/- ద్రవ్య సహాయంతో గ్రంథం ముద్రణ చేయించినాము.

గ్రంథముద్రణ కార్యభారం వహించి నిర్వహించడమేకాక దీనికి 'సుమనోంజలి' పీఠిక రచించిన ఆత్మీయులు, కోరుట్ల భారతీ సాహిత్య సమితి అధ్యక్షులు డా॥ అందె వేంకటరాజము గారికి కృతజ్ఞతాభివందనాలు. ఈ గ్రంథానికి శుద్ధప్రతి వ్రాసిన శ్రీ ఆకుపత్ని కొండలరావుగారికి కృతజ్ఞతలు. గ్రంథ ముద్రణకు ద్రవ్య సహాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి-ముఖ్యంగా మాన్యులు విశ్వవిద్యాలయం పూర్వపు ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి కృతజ్ఞతాంజలులు. ద్రవ్య సహాయం విషయంలో సహకరించిన అంబేడ్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఆచార్యులు ఆత్మీయులు డా॥ రావికంటి వసునందన్ గారికి, ముద్రణలో సహకరించిన ఆత్మీయులు శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడు గారికి కృతజ్ఞతలు. అందమైన ముఖచిత్రం వేసిన శ్రీ శీలా వీర్రాజు గారికి, చక్కగా బ్లాకులు చేసిన మోహన్ ప్రాసెస్ వారికి, ముఖచిత్రం, అమ్మనాన్నల ఫోటో ముద్రించిన శ్రీ బాలాజి ఆర్ట్ ప్రింటర్స్ గారికి, సకాలంలో చక్కగా గ్రంథం ముద్రించి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ శ్రీ పి. శ్రీనివాస్ గౌడు గారికి కృతజ్ఞతలు.

ఇట్లు
భవదీయుడు
వానమామలై రవీంద్రాచార్యులు
అసిస్టెంటు ఇంజనియర్.

హైదరాబాదు.
తేది. 14.7 1994.

# శోధిక

| తప్పు | ఒప్పు | పుట - పద్యం |
|---|---|---|
| కవికి యధర్మమున్ | - కవికి నధర్మమున్ | - 18 - 52 |
| క్షుద్రనృపాలురఁజేర | - క్షుద్రనృపాలురఁజేరి | - 32 - 95 |
| భవచ్ఛరణారవింద | - భవచ్ఛరణారవింద | - 42 - 14 |
| ధర్మహిత | - ధర్మరహిత | - 49 - 33 |
| బంగార మ్మిల | - బంగార మ్మిల | - 61 - 71 |
| ఎంతొ లోతున్ | - ఎంత లోతున్ | - 71 - 101 |
| బటుదర సృష్టి | - బటుతర సృష్టి | - 79 - 13 |
| కట్టెలకు గ్రుంచితి | - కట్టెలకు గ్రుంచితి | - 79 - 14 |
| రంగాద్వరా! | - రంగరాద్వరా! | - 81 - 20 |
| పృథ్వీతలయాత్రకు | - పృథివీతలయాత్రకు | - 94 - 57 |
| తదస్య దైవముల్ | - తదన్య దైవముల్ | - 96 - 64 |
| అరయ నింద్రియాళి | - అరయఁగ నింద్రియాళి | - 107 - 98 |
| భక్తవరేక్షణ! | - భక్తవరేక్షణ | - 113 - 3 |
| నున్మత్తుండనై | - నున్మత్తుండునై | - 118 - 18 |
| పరమపదమ్మునందలరు | - పరమపదమ్మునందలర | - 121 - 29 |
| కొల్పడు జ్ఞానము | - కోల్పడు జ్ఞానము | - 122 - 31 |
| యపారవివక్ష | - యపారవిపక్ష | - 124 - 36 |
| నేత్రముల నిచ్చితి | - నేత్రముల నిల్పితి | - 143 - 95 |
| పుణ్యాపగలో నెదింగి | - పుణ్యావగలో నెసంగి | - 146 - 104 |
| సంచిత ధైర్యము | - నంచిత ధైర్యము | - 147 - 105 |
| యల్పశక్తి | - యల్పశక్తి | - 150 - 4 |
| మన మనెడి | - మద మనెడి | - 151 - 8 (తాత్పర్యం) |
| జగతత్త్వమ్మిదే | - జగత్తత్త్వమ్మిదే | - 157 - 25 |

సారసగర్భుడన్ - సారసగర్భుఁడున్ - 162 - 39

సర్వము నీద - సర్వము నీవ - 170 - 64

ముఖమునుండి బలికించితివి - ముఖమునుండి పలికించితివి - ,, ,,
(తాత్పర్యం)

పీ మహాకృతిన్ - నీ మహాకృతిన్ - 170 - 65

గౌరదహతి - గౌరవహతి - 173 - 74

బోధ నొనర్చుచున్నాడు - బోధనొనర్చును - ,, ,,
(తాత్పర్యం)

బాలిశున్ - బాలిశుల్ - 175 - 80

మాకా నరకము కన్న - మాకా స్వర్గము కన్న - 182 - 99
(తాత్పర్యం)

# విషయసూచిక

# శ్రీ స్తవరాజపంచశతి

## శ్రీ వాగీశ్వర్యైనమః

## శారదా స్తవరాజము

శ్రీపద్మాసనురాణి! నీ కరుణ వర్షింపన్ సదా ప్రమోదులున్
చేపున్ పల్లవపుష్పసత్ఫలరసశ్రీమాధురీధారలన్
ప్రాపై నీవు వసింప నా మది లతల్ ప్రాకున్ ఫలించున్ వడిన్
నాపై నర్మిలి నీ కృపాంబుదములన్ సారించవే శారదా! 1

తా॥ ఓ శారదామాతా! చతుర్ముఖుని దొరసానీ! నీ కృపా రసము వర్షించినచో ఎల్లప్పుడును ప్రమోదులుఁ గూడ చిగురించి పూచి మధురమైన ఫల రస ధారలను చేపును. నీ అండ చూచుకొని నా బుద్ధియను తీవ వ్యాపించి ఫలించును. కావున నీ దయామృత మేఘములఁగొని నాపై వర్షింపవేల?

తల్లీ! అజ్ఞుడ నీదె భారమని నే ధైర్యంబుతో నుంటి స
త్సల్లాపంబులు జాలువార విలసత్సారస్య మేపార ప్రో
ద్యల్లీలన్ సుకవిత్వసంపదలు జిహ్వాగ్రాన నర్తింపఁగన్
ముల్లోకంబులు మెచ్చ వాక్కు నిడవే మూర్ఖుండనో శారదా! 2

తా॥ ఓ శారదాంబా! నేను అజ్ఞానిని. నీదే భారమనుకొని మిక్కిలి ధైర్యముతో నుంటిని. నాకు మంచి మాటలు జాలువారగా సారస్యము తొణికిస లాడు నట్లుగా చక్కని రీతులలో సత్కవిత్వ సంపదలు నా నాలుక కొనపై నాట్యమాడునట్లుగా మూడు లోకములు మెచ్చి శిరములూపఁగా వాక్కును ప్రసాదించుము. నేను మూర్ఖుడను.

ధరణిని లక్ష్మి యిచ్చు ధనధాన్యము లెల్ల నశించు నట్టులే
గిరిజ యొసంగు శక్తియును కీడ్పడు యౌవన మంతరించఁగన్
కరుణను నీవు భక్తజనకల్పకమై యిడు జ్ఞానవిత్త మ
క్షరము ననంతమై నిరతశాంతిప్రద మ్మయి యొప్పు భారతీ! 3

తా॥ భారతీమాతా! లక్ష్మి యిచ్చు ధనధాన్యము లన్నియును నాశముఁ జెందునవియే కదా! అట్లే పార్వతియిచ్చు ప్రాపంచిక బలములన్ని భౌతిక శక్తు లన్నియును వయస్సుతో పాటు అంతరించి పోవునవే. దయతో భక్తుల పాలిటి కల్పవృక్షమువైన నీవిచ్చు జ్ఞానధనము నశించనిదై, అంతములేనిదై నిరంతరము శాంతి నొసంగునదై యుండుగదా!

మిన్నులనుండి నీవు దిగి మేదిని వచ్చుట వీణఁ బూని బల్
సున్నితమైన గానమును చోద్యముగా వినిపించు చుండుటల్
తిన్నగ నావిమాన మది దీధితులన్ వెలుఁగొందుచుండుటల్
కన్నులఁ గాంచి ధన్యతను గంటి ముదమ్మున నుంటి భారతీ! 4

తా॥ కన్నతల్లీ! వాగీశ్వరీ! నేను నిన్ను ఉపాసించుచుండగా నీవు ఆకాశ మునుండి అందమైన విమానములో భూమిపైదిగి వీణను కేలఁగొని సుకుమార మైన నీ గానమును ఆశ్చర్యముఁ గొల్పునట్లు వినిపించుచుండుటలు, ఆ విమాన ములో దివ్యకాంతులను వెదఁజల్లుచు నీవు ప్రకాశించుటలు నా కన్నులతో ప్రత్య క్షముగాఁగని విని ధన్యుఁడనైతిని. ఆనంద సముద్ర మగ్నుఁడనైతిని.

ఏపురుషుండు నక్షరవిహీనముఖుండో; యతండు పృథ్విపై
నో పశుతుల్యుఁడై యిహమునుం బరమున్ విడి జ్ఞానశూన్యుఁడై
కాపురుషుండునై శుభముఁగాంచక గౌరవహీనుఁ డౌచునున్
దీపము లేని గేహమున దీప్తి నశించ నశించు శారదా! 5

తా॥ ఓ భారతీమాతా! ప్రపంచములో ఏ పురుషుఁడు అక్షర జ్ఞాన శూన్యుఁడో వాడు తానొక మానవాకారములోనున్న పశువు. వానికి యిహలోకము నందును పరలోకము నందును ఆనందము లేకుండును. వాడు వివేక విహీనుఁడై, చెడు నడవడి కలవాఁడై మేలు పొందక జనాదరణమును గాంచక దీపములేని గృహమువలె కాంతిహీనుఁడై యుండును గాదా!

అరువదినాలుగౌ కళలు నట్లె చతుర్దశవిద్యలుం గనన్
ధరణిని నీదు రూపయి యథావిధి పూజ్యత నొందు నెందు నీ
వరయ కళాస్వరూపిణిగ నైననొ సాహితిరూపుగొంచు జో
హరు లిడ శాస్త్రరూపముల నాత్మికవిద్యగ నుందు భారతీ! 6

**తా॥** ఓ భారతీ మాతా! అరువదినాల్గు కళలు, పదునాల్గు విద్యలుగూడా విచారించగా నీ రూపముననే యుండి తగిన విధముగా లోక పూజ్యత నొందు చుండును. నీవు కళా స్వరూపిణివి యైనచో కళలలోకెల్ల మేటియగు సాహిత్య కళారూపము ధరింతువు. నీవు శాస్త్రరూపము ధరించినపుడు శాస్త్రములలోకెల్ల తలమానికమగు వేదాంత శాస్త్ర రూపమును దాల్చి యొప్పుచుందువు గదా!

తల్లిరో! వాక్స్వరూపిణిగ ధారుణి రాజిలు చుందు వీవు నీ
యిల్లు రసాఢ్యజిహ్వ నిను నేను నుతింపఁ దలంపఁ బూన నో
సల్లలితాననాబ్జ! యెటుచాలవు నాదగు వాక్కు లైన నా
హృల్లసితానురాగమున హీనపుభక్తిఁ దలంపు భారతీ! 7

**తా॥** ఓ శారదాంబ తల్లీ! నీవు వాక్ స్వరూపముతో ఈ ప్రపంచములో అందరి జిహ్వాగ్రమున వర్తించుచుందువు. నిన్ను నేను స్తోత్రము చేయఁ జాలుదునా? ఓ సుకుమారముఖకమలముగల మానినీమణీ! నా వాక్కులు నిన్ను కొలువజాలవు. నా భక్తిని, నాకు నీ యందు మనసులో గల అనురక్తిని దలంచి కరుణింపుము తల్లీ!

జ్ఞానముకై స్వరూపము నొసంగెడి వాక్కువు నీవె యట్టులే
గానముకై రసధ్వనుల కల్పన చేసెడి తల్లి! భావపుం
గానన మీవె కావ్యఫలకల్పకభూజము నీవె నిన్మతిన్
ధ్యానము సేయు మార్గము ప్రదానము సేయఁ గదమ్మ! భారతీ! 8

**తా॥** ఓ భారతీదేవీ! జ్ఞానమునకు రూపమిచ్చెడి వాక్కువు నీవే; అట్లే గానమునకు స్వరకల్పన మొనర్చి రంజింపఁజేసెడి తల్లివి నీవే; సరస సుందర మైన భావ వృక్షములకు అరణ్యమవు నీవే; కావ్య ఫలముల నన్నిటి నొసంగు కల్పవృక్షమవు నీవే. నిన్నెట్లు ధ్యానించవలెనో ఎట్లు ప్రసన్నవగుదువో ఉపదేశించుము.

కవితలు నీ మన స్సటులె గానము నీ దగు వాక్కు శిల్పమే
చివురుల నీను మేను రససిద్ధి వహించిన నాట్యరూపమే
మివుల విలాస మీను రుచిమిశ్రప్రఫుల్లసుమాంగకమ్ములో
సువిదితవాక్స్వరూపిణి విశుద్ధకళాఖని బ్రాహ్మి! భారతీ! 9

తా॥ ఓ సరస్వతీ! కవిత్వమే నీ సుందర భావాన్వితమగు మనస్సు. అట్లే సుందర స్వరముల కల్పన మొనర్చు గానమే నీ వచస్సు. అట్లే సుందరములగు రూపకల్పనల నొనర్చు శిల్పమే చిగురుల నీను నీ వపుస్సు. మేను సుందరములగు విన్యాస విలాసముల కల్పించు నాట్యమే నీ అవయవములు. ఓ వాగ్రూపిణీ! ఓ కళాఖనీ! ఓ బ్రాహ్మీ! భారతీ! నిన్నేమని వినుతింతును?

మనసె మనస్సరోవరమొ మంజులహంసయె ప్రాణవాయువో
ఘను డగు నాత్మ బ్రహ్మయయి క్రాలునొ తద్రసనాగ్రవర్తనన్
గొన బగు వాక్కె నీవొ సరి క్రొత్తని వీణయె వెన్ను పూసయో
కననగు పుండరీకమె ముఖమ్మొ వచింపఁగ లేను భారతీ! 10

తా॥ ఓ వాగీశ్వరీ! మనస్సే నీ మనస్సరోవరమో? సుకుమారమైన ప్రాణవాయువే నీ హంసయో! ఘనమైన ఈ ఆత్మయే నీ బ్రహ్మయో! ఆ యాత్మను వ్యక్తపరచు శరీర ముఖమున నాల్కయందు నర్తించు ముద్దయిన వాక్కువే నీవో! బొట్టకు బుఱ్ఱకు మధ్య వర్తించు వీణాదండమనబడు వెన్ను పూసయే నీ వీణయో! వాగ్రూపిణివై నీవు వర్తించు ముఖమే నీవు నివసించు పద్మమో! నేను తెలుపఁజాలకున్నాను.

వీణ ప్రతీక యౌనొ మురిపించెడి గానకళాత్మవీవనన్
తాను కరస్థగ్రంథ మది నవ్యసుకావ్యకళాప్రతీకయో
కానఁగనౌ మయూరము సుఖప్రదచిత్రకళాప్రతీకయో
వాణి! కళాత్రయమ్మునకు వాస్తవ మీవ ప్రతీక భారతీ! 11

తా॥ ఓ వాగ్దేవతా! మురిపింపఁజేయు గాన కళాత్మవు నీవే యనుటకు ఆ వీణయే ప్రతీకయో! ఆనందపెట్టు కావ్య కళవు నీవే యనుటకు నీ హస్తగతమగు పుస్తకమే ప్రతీకయో! నేత్ర పర్వమొనర్చు చిత్రకళ వీవే యనుటకు నీ సమీపమున నటించు నెమలియే ప్రతీకయో తెలియజాలను ఓ భారతీ! లలితకళల మూడింటికిని నీవే ఒక ప్రతీకవు కదా!

కరమున నున్న గ్రంథ మది కాంచగ నొనొక ధర్మరూపమై
యిర వగు నర్థరూప మది యేర్పడు నేమొ కరస్థ పద్మమై
వరశుక మద్ది కామమయి వర్ధిల మోక్షమె యక్షమాలయో!
నరపురుషార్థరూపిణివి నాతిరొ! నీవె కదమ్మ! భారతీ! 12

తా॥ ఓ భారతీ! కరమున నున్న పుస్తకమే ప్రథమ పురుషార్థ రూపమగు ధర్మరూపము కాదుకదా! అట్లే ఇంకొక చేతిలో నున్న కమలము తానది ద్వితీయ పురుషార్థమగు అర్థరూపమగునేమో! అట్లే మరియొక హస్తము నందుండు చిలుక తానది తృతీయ పురుషార్థమగు కామరూపమై యుండవచ్చును. తద్విధముగానే, నాల్గవ హస్తమందుఁ గల జపమాల నాల్గవ పురుషార్థమగు మోక్షమో? నరుఁడు సాధించఁదగిన నాల్గు పురుషార్థములకు నీవే రూపమవు కదా!

పాలును నీరు వేర్పరచు భావవివేకమె హంసరూపమై
ఏలిక వైన నీకు నొక యింపగు వాహనమై వరించె వా
ణీ! లలనామణీ! బుధవినిర్మిత కావ్యధునీరసస్ఫురత్
కూల నివాసినీ! సుకవికుంజరవాహిని! శ్రీ సరస్వతీ! 13

తా॥ జ్ఞానరతీ! సరస్వతీ! వాణీ లలనామణీ! బుధులచే ప్రవహింపఁజేయఁబడిన ఓ కావ్యగంగా! రసనదీ తీరమున వసించుదానా! సుకవులనే ఏనుగులు వాహనములుగాఁ గలదానా! ఓ వాగీశ్వరీ! నీవు నీ వరుఁడగు బ్రహ్మతోపాటు హంస వాహనముపై నధిరోహించుదానవు కదా! పాలను మరియు నీరును అనగా మంచిని, చెడును వేర్పరచే సదసద్వివేకమే నీవధిరోహించు హంస రూపము కాదు కదా!

ఆతతసంప్రదాయయుతమై రసభావగభీరదీప్తమౌ
పూతకవిత్వపున్ రుచులు పూర్ణతఁ గ్రోలఁగ నర్హులెందరౌ
లోతు పయోధిలో మునిగి లోఁగల రత్నపురాసులంటి మేల్
చాతురినీతగాఁ డెవఁడొ! సంగ్రహణం బొనరించు భారతీ! 14

తా॥ ఓ భారతీ జననీ! సంప్రదాయబద్ధమై రసభావాలంకార గుణ రీతులచే నొప్పారుచుండు ఉత్తమ కవిత్వామృతపు రుచులను గ్రోలి ఒంట పట్టించుకొనుటకు సమర్థులైన వారెందరో ఉండరు కదా! లోతైన సముద్రములో మునిఁగి దాని యడుఁగున గల రత్న మౌక్తిక రాసులను దర్శించి వానిని సంగ్రహణ మొనర్చుటకు చతురులైన యే గజ యీతఁగాండ్రో చాలియుందురు కదా!

ఆశువుకన్న భావమననాత్మకమైన కవిత్వమే సుధా
పేశలమాధురిన్ శ్రవణపేయ సుఖ మ్మిడు నెందునున్ గభీ
రాశయ డోలికాలహరి నాడు సరిత్పతి రత్నముల్ ఫణీ
శాశునదీప్రవాహ జలమందెటులన్ లభియించు భారతీ! 15

తా॥ ఓ భాషాయోషామతల్లీ! ఆశువుగాఁ జెప్పు కవిత్వముకన్నను భావ మనన మొనరించుచు నెమ్మదిగా నుడువు సరస కావ్య కవితలే శ్రుతిపర్వమును నొనగూర్చుచు సుఖప్రదములై యుండును. గంభీరములగు భావ తరంగ డోలి కలలో వెనుక ముందు విహరించు సముద్రములోని రత్నరాసులు పాామువలె పరుగెత్తు నదీ ప్రవాహ గర్భములో లభించునా?

పదముల గారడిన్ గనుచు భవ్యకవిత్వ మటంచు నెంచుటల్
ముద మిడు భావవైఖరుల మూలకు నుంచుట లెంత మౌఢ్యమౌ
పదముల నంటి వేడుకొన పజ్జకుఁ జేరునె కావ్యకన్య తా
నెదఁగల భావసంపదల నెంతయు దొంగిల కున్న భారతీ! 16

తా॥ ఓ శారదాంబా! పాండిత్య పాటవమును మాత్రమే చూపించుటకు ప్రాసలతో శ్లేషలతో యమకములతో చిత్ర విచిత్ర బంధవృత్తములతో పదా డంబరముతో వ్రాయు పదముల గారడీ గల కవితల మెచ్చుచు గంభీర భావ బంధురమై సరసమై యలరారు కవితల ద్రోసిపుచ్చుటలు మూర్ఖత్వమే కదా! కవితా కన్య తానెంతైన పదములఁ బట్టుకొనిన ప్రసన్నయగునా! భావ హృదయ ముల దొంగిలించిననే కదా మెచ్చును?

ప్రతిభాలేశము లేక కేవలముగా పాండిత్యము న్నింపియే
యతిప్రాసల్ జతఁ గూర్చియే కవితయౌ నంచెట్లు భావింతురో
అతిగా దేహముఁ బెంచి యంద మనఁగా నావంతయున్ లేని గు
బ్బెత మోముంగని యెట్లు దాని సరసుల్ ప్రేమింతురో! భారతీ! 17

తా॥ ఓ వాగీశ్వరీ! ప్రతిభాలవమైన లేక కేవల పాండిత్యపు గడబిడలను నింపి యతి ప్రాసల జతగూర్చి ఇదియే కవితయౌనని యెట్లు భావింతురు? దేహావయవములందు ముఖమునందు సౌందర్యములేక వట్టి కండలను బెంచి యున్న రూప విహీనయగు యువతి ముఖమును గాంచి సరసులు ప్రేమించ గలరా? ఆ సౌందర్యములేని స్త్రీ వారిని మోహింపఁజేయఁ గలదా?

సరసత లేని కైతలన చప్పని చొప్పయటుల్ రుచించునే
సరసత లేని స్త్రీ యదియొ చక్కని దయ్యును లాభ మేమియా
సురుచిరశిల్పసుందరిని జూచి కవుంగిటఁ జేర్ప హావభా
వరసతయబ్బునే యవియొ వట్టి భ్రమల్ గదె శ్రీసరస్వతీ! 18

తా॥ సరస్వతీ మాతా! రసవిహీనములై చప్పని చొప్పదంటు కవితలు సరసులకు రుచించుట కష్టము కదా! సరసత్వము లేని మొరటు స్త్రీ చక్కని దయ్యును ఏమి ప్రయోజనము? సుందర శిల్పములలో నుండు స్త్రీ అది యెంత చక్కదనమున్నను హావభావ విలాస ప్రకటనముఁ జేయకుండును గదా! దానిని కౌగిట జేర్చుట వట్టి భ్రమ దప్ప ఆనందముకలుగఁ గలదా?

ప్రాచీనం బగు సంప్రదాయకవితల్ బాగుండు నంచొక్క ర
ర్వాచీనంబగు గద్యపుంగవితలే బ్రహ్మాండ మంచొక్క రీ
వాచాలత్వము లేవి యైనను సరే, వ్యర్థంబు లీరెండు ని
ద్దా చాంపేయము ప్రాత కొత్తలకునున్ దావిచ్చునే భారతీ! 19

తా॥ ఓ వాగ్దేవీ! ప్రాచీన సంప్రదాయాను సారములైన కవితలే బాగుండు నంచొక్కరు మరి యొకరు (అర్వాచీనములు) నూత్న మార్గములో పయనించు వచన కవితలే సరసముగా నుండి ప్రయోజన వంతములని బ్రహ్మాండముగా రాణించగలవని వదరుట లేవి యెట్లున్నను ఇవి రెండును వ్యర్థ ప్రలాపములే. ప్రాచీనమైనను అర్వాచీనమైనను బంగారము బంగారమే కదా!

ప్రాకృతికాంతరంగబహిరంగప్రవృత్తుల వాస్తవస్థితిన్
లోకము ముందు దర్పణములో వలెఁ జూపుటలే కవిత్వ మా
ప్రాకృతికాంతరంగపరివర్తనమే రసరూప మొందు బా
హ్యాకృతిలోని మార్పులె రసాంగకవర్ణన లౌను భారతీ! 20

తా॥ ఓ భాషామతల్లీ! ప్రకృతిలోని అంతరంగ బహిరంగ ప్రవృత్తుల యాథార్థ్యమును అద్దములోవలె జూపుటలే నిజమైన కవిత్వము కదా! ప్రకృతికి అంతరంగ పరివర్తనమే రసరూపము మరియు బాహ్యాకారములోని మార్పులే రసాంగములై రస ప్రకాశకములౌ వర్ణనములు అనిపించుకొనును గదా!

ఉన్నది యున్న యట్లు సరసోక్తులఁ జూపు కళావిలాసమే
యెన్నగ సత్యరూప మది యెందును సుందరమై చెలంగు నా
వన్నె యొకండె చాలక శివంబును దానయి సాహితీవిలా
సోన్నతి వెల్గి బ్రహ్మసుఖసోదరమై రహియించు భారతీ! 21

తా॥ శారదమ్మ తల్లీ! ప్రకృతియొక్క స్వభావ పరిశీలనము మరియు వ్యక్తియొక్క మనస్తత్వ విశ్లేషణ మొనర్చి ఉన్నది ఉన్నయట్లు వివరించుటలు సత్యరూపమగును. ఆ వివరణము ప్రకటించుటలో నందముగా నుడువుట సత్య వస్తువును సుందరముగా చూపుటలగును. అనగా ఉక్తి వైదగ్ధ్యముతో భావ ప్రకటన మొనర్పవలెను. అది విశ్వశ్రేయమునకు కారకమైన శివమగును. కావున సాహిత్యతత్త్వము, సత్యం, శివం, సుందరంగా ప్రవచించుటలైనది.

కాంతాసమ్మితకర్ణపేయరసవాక్యస్ఫూర్తి నొప్పారి ధ్వ
న్యంతర్గర్భితభావపూర్ణరమణీయార్థప్రపంచాతిభా
స్వంతం బౌచను కావ్యరాజ మది విశ్వశ్రేయ మొందన్ రసో
దంతంబై మను టొప్పు నప్పు డది సత్కావ్యం బగున్ భారతీ! 22

తా॥ వాగ్వనితా శిరోమణీ! కాంతాసమ్మితమగు నుపదేశముతో చెవులకు నింపగు రసవత్తర వాక్యస్ఫూర్తితో నలరారి ధ్వనిగర్భితమగుచు భావపూర్ణ మగుచు రమణీయార్థ ప్రతిపాదక శబ్దములతో నొప్పారిన కావ్యరాజము తానది విశ్వమంగళకరమగును. ఆ కావ్యము శృంగార వీరాది రసప్రధానములగు ఇతి వృత్త సన్నివేశములతో రసజ్ఞుల నలరింపజేసి యప్పుడది ఒక సత్కావ్య మని పించుకొనును గదా!

అకలంకంబయి యత్యుదాత్తమయి లోకాదర్శవిజ్ఞానదా
యకమై దివ్యకథాప్రపూత మయి పాత్రౌచిత్యసల్లాపదీ
పకమై ప్రాజ్ఞమనోనురంజకరసప్రస్ఫోటమౌ కావ్యమున్
సుకవీంద్రుం డొకడే రచించు ననుటల్ చోద్యంబొకో భారతీ! 23

తా॥ సరస్వతీమాతా! దోషరహితమును గుణసహితమును ఉదాత్తమునై లోకాదర్శకమగు విజ్ఞానము నొసంగునదై పవిత్రమగు ఇతివృత్తముతోగూడిన దివ్యప్రబంధమునై పాత్రోచితములగు సంభాషణములతో నలరారినదై, పండి తుల మనస్సును మెప్పించునదియు రంజింపజేయునదియు రసస్ఫూర్తితో శిరముల నూపించునదైన మహా కావ్యమును ఒక మహాకవి మాత్రమే వ్రాయఁగలఁ డనుటలో ఆశ్చర్య మావంతయును లేదుకదా!

మండితసత్కళాగగనమందిరుడున్ రసమానసాబ్జమి
త్రుండుననౌ మహాకవివరుండగు పెట్టి తపఃఫలంబొ? ఛీ!
దండుగ తక్కువిద్దెలు వృథాప్రభుతల్ తనురంధ్రయుక్తమృద్
భాండజలమ్ము జీవనము పాదరసమ్మది సొమ్ము! భారతీ! 24

తా॥ వాణీ! వీణాపాణీ! అలంకార యుక్తమగు సత్కావ్య కళయను ఆకాశమే మందిరముగాఁ గలవాడును. సరసుల హృదయ కమలములను సూర్యునివలె నలరింపఁజేయువాడును నగు మహాకవివరుఁ డగుట ఎన్ని జన్మల తపః ఫలమో! యనవలెను. తక్కిన విద్యలు దండుగ. సత్కావ్య కళయే సార్థకమగు విద్య. నాల్గు నాళ్ళ ప్రభుత్వములు వృథలు. జీవితము రంధ్రయుక్త మృద్ఘట జలము సొమ్ములు పాదరసమ్ము వలె కడు చంచలములు.

ఇలఁ గడు సున్నితంబు కవిహృద్గతి నైజకలావిలాసమం
జులమధురాస్యయౌ ప్రకృతిసుందరి నిందిరఁ జేసి చారుకో
మలహృదయారవిందసుమమందిరమం దిడి మ్రొక్కు నాయమన్
మలిన మొనర్చు చేష్ట లణుమాత్రము నోర్వఁడుఁ గాదె? భారతీ! 25

తా॥ ఓ శారదాంబా! కవి హృదయము కడు సున్నితమైనది. ఆయన తాను సహజ సౌందర్యవతియును, మనోహర సుకుమార వదనయగు ప్రకృతి సుందరిని లక్ష్మిగా నొనర్చి సుందరమగు హృదయ కమల మందిరమున ప్రతిష్ఠించి మ్రొక్కును. ఆ యమను మలినపరచు దుడుకు చేష్టలు కవికుమారుడు లేశమైనను ఓర్వజాలడు. అతడు ప్రకృతిలో పరమాత్మను దర్శించి యుపాసించువాడు.

జగజంపౌ మగమానికంబులును బచ్చల్ కెంపులున్నీలముల్
సొగసౌ ముత్తియముల్ ప్రవాళములు జజ్జుల్వాసి మేల్దాళువా
నగతోఁ గూడి వెలుంగు నట్లు తెనుఁగుల్ నానారుచుల్ రూపముల్
నిగుడన్ సంస్కృత భాషఁ గూడి మది కెంతే విందిడున్ భారతీ! 26

తా॥ ఓ భారతీ! జిల్గిగా నల్లిన సొగసైన ముత్యములు, వజ్రములు, పచ్చలు, కెంపులు, ఇంద్రనీలములు, పగడములు కడుఁగఁబడిన మాలిన్యము గలవై చొక్కపు బంగారు ఆభరణముతో గూడి మిక్కిలి ప్రకాశించునట్లు జానుతెనుగు పదములు పలు విధములుగా ప్రకాశించుచు, యనేక విధరూపము లొప్పఁగా సంస్కృత భాషా పదములతోఁగూడి మనస్సునకెంతో పండువు నొనర్చుచుండును గదా!

జలజల పూలు రాలి నటు చల్లని మెల్లని పిల్ల తెమ్మెరల్
తెలతెలవారి వీచినటు తియ్యని కమ్మని పాల మీగడల్
తొలితొలి తోడు విచ్చినటు తోరపు సిగ్గున ముగ్ధ కన్దొవల్
వలపులఁ జిమ్ము నట్లు చెలువ మ్మిడు చొక్కపు కైత భారతీ! 27

తా॥ చదువుల తల్లీ! జల జల పూలు రాలినట్లు, చల్లగా మెల్లగా పిల్ల గాడ్పులు తెల తెలవారి విసరినట్లు, తియ్యని కమ్మని పాల మీగడలు మొదటి సారి తోడు విచ్చినయట్లు ఎంతో సిగ్గుతో ముద్దరాలి కన్ను కలువలు వలపుల విరజల్లినట్లు చొక్కమైన కవిత్వము తన సొగసుల నొలుకబోయును.

పూలను మల్లికాలతకు మూలములందు నుషీరజాతికిన్
వాలెము నాకులందె మరువమ్ముకు దారువునం బటీరవృ
క్షాలికి సౌరభ మ్మొలయుఁ గాని మహాకవితాలతాంగనన్
గ్రాలు పరీమళమ్ము పొసఁగన్ సకలాంగములందు భారతీ! 28

తా॥ అమ్మా శారదాంబా! మల్లె తీగలో పూలయందు మాత్రమే, అట్లే వట్టి గడ్డికి వేరులలో మాత్రమే, మరువమునకు ఆకులందు మాత్రమే, శ్రీగంధపు వృక్షమునకు దారువులో (చెక్కలో) మాత్రమే సువాసనలు గలవు. కాని మహా కవితాలతలో సకలాంగములలో నంతటను సుపరిమళముల నీనుచుండుట లాశ్చర్యము.

అమరనదీతరంగసలిలార్చితసస్యఫలాన్నపూర్ణ శ్రీ
సుమహితభారతావనియె సుస్థితసుందరమాతృధాత్రిగా
నమృతముకన్న దియ్య నగు నాంధ్రమె మామకమాతృభాషగా
రమణఁ దలిర్ప విష్ణునుతి వ్రాయనె పుట్టువు లిమ్ము భారతీ! 29

తా॥ తల్లీ! భారతీ! ఆకాశ గంగా జలములతో తడుపబడినదియు, సస్య శ్యామలమై తృణకాష్ఠ జలసమృద్ధిఁ గలిఁగినదై అన్నపూర్ణ యనిపించుకొని సకల సంపదలతో కూడుకొనిన భారత దేశమే నాకు జన్మ జన్మలలో జన్మభూమి గావలెను. అమృతము కన్న తియ్యనైన ఆంధ్ర భాషయే నాకు మాతృ భాష కావలెను. సొంపారగా విష్ణుకథలనే సత్కావ్యములుగా వ్రాయుటకే నాకు జన్మల నొసంగుమా.

ప్రచుర రసస్వరూపము నుపాసనముం బొనరించుచుండుటల్
రుచిరతమాక్షరాచ్ఛపదరూపములన్ భజియించు చుండుటల్
శుచిగ తపస్సమాధి నెదఁ జొన్పుచు బాహ్యము విస్మరించుటల్
ఉచితమగున్ కవిన్ ఋషిగ నొప్పెసలార వచింప భారతీ! 30

తా॥ అంబా! వాగీశ్వరీ! ప్రసిద్ధమైన రసస్వరూపమును ఉపాసన మొనర్చు చుండుటయు, మిక్కిలి ప్రకాశించు అక్షరపద రూపముల (మోక్షసాధమును) దీవించుచుండుటలు, పరిశుద్ధ మనస్కతతో సమాధి స్థితిలో విలీనమై యుండుట బాహ్యమును మరచి పారవశ్యమును భజించుటలను ఋషిచర్యలు కలిగి యుండుట వలన కవిని ఋషిగాఁ జెప్పుట సముచితమే.

చదివిన వానిఁ బోలె గురు సాహసి నౌచు మహాకవిత్వ మిం
పొదవఁగ వ్రాయఁ బూనితిని నోయన, నా యనరాదు గాని, త్వ
త్పదకమలాశ్రితుండ రసభావపదార్థమహత్కవిత్వసం
పదల నొసంగి యేలవె! కృపామతి! జ్ఞానరతీ! సరస్వతీ! 31

తా॥ అమ్మా! శారదాదేవీ! నేనొక చదివిన వానివలెనే గొప్ప సాహసము చేసి మహాకావ్య కవిత్వమును సొగసుగా వ్రాయబూనితిని. ఓ యంటే నా యనరాదు గాని మహాకావ్యము వ్రాయుటలా! ఐనను నేను నీ పాదకమలముల నాశ్రయించినవాడను. నాకు రసభావములతో గూడిన శబ్దార్థములతో నొప్పు మహాకవిత్వ సంపదల నొసంగి పరిపాలించు తల్లీ! కరుణామయీ! జ్ఞానమున విహరించు మాతా!

ముందర నీకు మ్రొక్కి కలముం గయిఁ బూనితి దాని జిహ్వపై
నందము చిందఁగా పదము లందు సువర్ణపు టందె లూని త
ద్దిం ధిమి తైతతోమ్మనుచు దివ్యరసధ్వను లూర నాట్య మిం
పొందఁగఁ జేయవే! సహృదయుల్ విబుధుల్ వినుతింప భారతీ! 32

తా॥ సరస్వతీదేవీ! నేను మొట్టమొదట నీకు నమస్కరించి కలమును హస్తమున దాల్చితిని. దాని నాలుకపై అందముల జిల్కుచు పదములతో సువర్ణపు అందెలుఁ దాల్చి ''తద్దిం ధిమితైత తోమ్'' అని దివ్యములగు రస ధ్వను లూరుచుండఁగా సహృదయులైన విద్వాంసులు మెచ్చునట్లు శిరమ్ములూపగా సొగసైన నాట్యమొనర్పుమా!

సువిదితకాంతిపుంజముల శుద్ధములై నవరత్నసంతతుల్
మివుల నమూల్యమై రుచుల మెప్పగుచున్ సరిక్రొత్తలౌ నటుల్
నవరసధార లూరు కృతినాయకముల్ దగ నిత్యనూత్నమై
యవిరళకాంతులీనఁ గని యౌదలఁ దాల్తురు వాని భారతీ! 33

తా॥ శారదాంబా! మిగుల ప్రసిద్ధముల కాంతి సమూహములచే పరిశుద్ధములైన నవరత్నముల సమూహములు ఎంతో అమూల్యములై ఎప్పటికప్పుడు తమ కాంతులతో నెల్లర మెప్పించుచు నిత్య నూత్నములైనట్లే నవరసధారల నూరఁ జేయుచు కావ్య రాజములు నిత్యము నూతనములై తమ కాంతుల నెంతగానో ప్రసరింపఁజేయుచు సరసులు సహృదయులు వాని నౌదలఁదాల్తురు గదా!

కలమును బట్టి నంత నొక కావ్యము వ్రాయఁగ నర్హుఁడౌనొకో
బలమును పుంజుకోవలయు భావము భాషను మేళవింపఁగన్
మెరయున దంతయున్ భువిని మేలిమి యౌనెటు సాన రాపిడిన్
నిలిచినగాని మేల్మియని నిర్ణయమౌట యెటుల్ సరస్వతీ! 34

తా॥ భారతీమాతా! కలమును బట్టినంతలో నొక మహాకావ్యము వ్రాయ గల సమర్థుఁడగునా? దానికి తగిన బలముల నార్జింపవలయును. భావమును, భాషను సమన్వయింపఁజేయు శక్తి గావలయును. మెఱయున దంతయు మేలిమి బంగారము కాదు. సానరాపిడి పరీక్షలకు నిలిచినగాని అది బంగారముగా నిల్వలేదు.

అరయఁగ విస్ఫులింగముల యట్టులె ఖండకృతుల్ తమంతతా
మెరయు సమీపవిశ్వము నమేయగతిన్ మెరపించఁ జాలవా
హరువున జ్యోతిభాతిని మహాకృతు లాత్మప్రకాశకమ్ములై
పరిసరమున్ వెలుంగులిడి భాసిలఁ జేయు గదమ్మ! భారతీ! 35

తా॥ ఓ వాగ్దేవతా! విచారమొనర్చి చూచినచో అగ్ని మిణుగురులవలె ఖండ కావ్యములు తమంత తాము మాత్రమే క్షణ కాలము వెలిగి మలిగి పోవును గాని పరిసర ప్రదేశముల మెరపించ జాలవు. వానిపై తమ కాంతుల ప్రసరింపఁ జేసి, వానిని జూపింపఁ జాలవు. అట్లే మహాకావ్యములు ఒక దీప శిఖలవలె తాము చాల కాలము మెరయుచు పరిసర వస్తువులను మెరపించి చూపింపఁ గలుగును. చుక్కలవలె తాము మాత్రమే మెరయునవి ఖండ కావ్యములు, చంద్రుని వలె తాము మెరయుచు ప్రపంచమును గూడ ప్రకాశింప జేయునవి మహా కావ్యములు.

గురువరశిక్షణమ్ము లొనగూడిన కేవల మందబుద్ధియే
సురుతరశాస్త్రవేత్త యగు నొక్కెడ కాని మహాకవీంద్రుఁడై
వరలుటలెట్లు? మైబలువ వచ్చును పుష్టికరాన్నభక్షణన్
సురుచిరసుందరత్వమన జొప్పడు పుట్టుకతోనె భారతీ! 36

తా॥ ఓ సరస్వతీదేవీ! గురువుల వద్ద శిక్షణ బొందిన మందబుద్ధియును గొప్ప శాస్త్రవేత్త గావచ్చును. కాని మహా కవీంద్రుడు కాలేడుకదా! పుష్టికర పదార్థ భక్షణమున కండపుష్టి గలిగి శరీరము బలుపెక్కవచ్చును కాని సుకుమారమగు మనోజ్ఞమగు సౌందర్యము తానది పుట్టుకతోనే రావలసినది కదా!

అలవక్రోక్తియె కాదె కైతలకు తా నందంబు చేకూర్చునం
చలఘు ప్రాజ్ఞజనమ్ము వల్కుటలు నెందావంతయుం గల్లఁగా
దెలమిన్ వెన్నను దీయఁగా పెరుగులో నెంతైన వ్రేల్ వంకరల్
గలుఁగన్ జేసినగాదె నుప్పతిలు నో కంజాక్షి! శ్రీ భారతీ! 37

తా॥ ఓ వాగ్రూపిణీ! వక్రోక్తియే కవిత్వమునకు సౌందర్యము నాపాదించునదియని కొందరు ఆలంకారికులు పలుకుట లెంతయును సత్యమే యనిపించును. పెరుగులో వ్రేలు వంకరనిడి గిల కొట్టనిది వెన్నవచ్చుట చాలా కష్టమే కదా! వంకర రేఖలేకదా శిల్పమునకు అందచందములు చేకూర్చునది!

కాంచఁగ నౌచితీమహిమ కావ్యము నందున వన్నె గూర్చు నం
చెంచెడి ప్రాజ్ఞువాక్కు లవి యెంతయు సత్యము లౌను గాదె? ఓ
కాంచనగర్భురాణి! తినగా తమి పాక మొనర్చు కూర నొ
క్కించుక ఉప్పు నెక్కువగ నేసిన నెట్లు రుచించు భారతీ! 38

తా॥ కాంచన గర్భుడగు నలువకు దొరసానివైన ఓ వాణీ! ఆలోచించినచో ఔచిత్యమే కావ్యమునకు గొప్పగా వన్నె చేకూర్చునని చెప్పెడి ప్రాజ్ఞుల పల్కులు సత్యసందీపితములే కదా! పాకమొనర్చుపట్ల కూరగాయలలో తగినంత ఉప్పు వేసిననే రుచించును గాని ఎక్కువ వేసిన ఆస్వాదనాయోగ్యము కాదు గదా! అందుకే పాత్రౌచిత్యము సంభాషణౌచిత్యము సన్నివేశౌచిత్యము మొదలగునవి కావలసియే యుండును.

ఓజఃకాంతిప్రసాదమాధురిగుణా లోక్కింత లేకుండ నా
వాజమ్మల్ విరచించునట్టి కవితల్ ప్రాజ్ఞాలి మెప్పొందునే
యోజన్ కామిని యెంతొ సుందరియు నయ్యున్ సద్గుణాల్లేమి దా
పూజింపం బడునెట్లు? లోకమున నోపూజ్యాకృతీ! భారతీ! 39

తా॥ ఓ భారతీ సతీ! ఓజఃకాంతి ప్రసాద మాధుర్యాది గుణముల పాటించక తెలివి మాలినవారు వ్రాయు కవితలు విద్వాంసుల మెప్పు పొందలేవు కదా! కామిని యెంత సుందరి యయ్యును సద్గుణాలను పాటించక సంచరించుట వల్లనే కదా గౌరవార్హతఁ గోలుపోవునది. వ్యభిచారిణి తానెంత సుందరియైనను లోకముచే గౌరవింపబడునెట్లు?

అర్థ మనల్పతన్ వరలి యల్పవచస్సుల నొప్పు కైతలే
సార్థకమై వెలుంగు సరసప్రకరమ్ము తలంధరింతు రం
డ్రర్థవిహీను జీవనము నట్టులె యర్థవిహీన కావ్యముల్
వ్యర్థము లందు వాని తృణవద్గణనం బొనరింత్రు భారతీ! 40

తా॥ ఓ వాగ్దేవీ! అల్పపదములలో అనల్పార్థమును పొదిగి వ్రాసిన కైతలే కదా సార్థకములై సరసులు తలదాల్చి గౌరవించు వారు. అర్థహీనుని (ధన హీనుని) జీవితమువలెనే అర్థవిహీన కావ్యములు వ్యర్థములని వానిని గడ్డి పరక కంటెను చులకనగా జూతురు కదా!

అరయ విశిష్టశబ్దసముదంచితసుందరరీతినున్న నే
సరసము లంచు కావ్యముల సన్నుతిఁ జేతురు విజ్ఞులెంతయున్,
నెఱిగ సువర్ణ సుందరతనే తనురీతుల బంచు జవ్వనిన్
శిరముల నూపి మెచ్చుటలుఁ జెల్లును నెల్లెడ తల్లి! భారతీ! 41

తా॥ ఓ విజ్ఞాన రూపిణీ! భారతీ! విశిష్ట పదములతో రచన మొనర్చు గౌడి పాంచాలి వైదర్భి మొదలగు రీతులలో దశగుణ విశిష్టమగు వైదర్భీరీతినే సరసములని సహృదయులు తలం ధరింతురు. స్తుతి చేతురు. రీతిలో వర్ణ సుందరత శ్రుతి సుభగత్వము ప్రాధాన్యము కదా! అట్లే సువర్ణ సుందరతను శరీర కాంతులతో బంచు జవ్వనిని శిరములూపి మెచ్చుటలు నెల్లెడల జెల్లు చుండును గదా!

ఎనయగ మేల్రసధ్వని రహింప రచించెడి కావ్యరాజముల్
ఘనులగు పండితోత్తములు గన్గొని యౌదలదాల్చుచుంద్రు నా
గౌనబగు మేల్ గళధ్వనుల గూడని పాటలు శాస్త్రయుక్తమేన్
జనములు మెత్తు రెట్లు విని సన్నుతి చేతు రదెట్లు? భారతీ! 42

తా॥ కళాస్వరూపిణీ! భారతీ! విచారించి చూచిన ధ్వని ప్రధానముగా రచించిన కావ్య రాజములనే గొప్పవారగు సరసులు పండితోత్తములు శిరసా వహించి స్తోత్రమొనర్తురు కదా! కంఠములో చక్కని శ్రావ్యమగు ధ్వని లేక పాడిన శాస్త్రయుక్త గానములనైనను జనములు మెచ్చుకొనరు గదా!

ఛందము తా స్వతంత్రగతి సాగెడి భావనపుం బదాలకున్
బంధము వైచుచుం గవికి బాధనొసంగ సపాదబంధనా
లందెలు వైచి మేల్ నడల హంసవిహారము సల్పి నట్టులై
ఛందము బంధమైనను బసందగు నందము జిందు భారతీ! 43

తా॥ నలువరాణీ! భారతీ! ఛందోబద్ధమైన కవితలు కవి పదాలకు బంధము వైచుచు స్వేచ్ఛనీయక బాధను గూర్చుననువారును కొందరుందురు. కాని కల హంసలు సంచరించునపుడు వాని కాళ్ళలో అందెలు వైచిన ఆ యంచల నడకల యందము లిమ్మడిగా ప్రకాశించునట్లు ఛందస్సు బంధము నొనగూర్చినను పసందైన అందమును పాఠకుల కొసంగదెట్లు?

తగు వ్యుత్పన్నత లేక స్వీయప్రతిభాధారమ్మునం గైతలన్
మిగులం జెప్ప రుచించు నెట్లు? తరుణామేయాంగసౌందర్యముల్
సొగసుల్ మోమున నున్ననేమి వృథ లచ్చుంబోతలో బోసిన
ట్లుగ నిండైమను కండ పుష్టి యతిగా లోపించునో భారతీ! 44

తా॥ వాణీ! నలువరాణీ! తగినంత పాండిత్యము లేక ప్రతిభాధారము పైననే కైతలు వ్రాసి చదిన నవి రుచించునెట్లు? పడుచుదనము వచ్చిననేమి సహజ సౌందర్యమున్ననేమి? వృథయేకదా! అచ్చులలో పోతపోసినట్లు నిండగు కండపుష్టి లేక ఆ సహజ సౌందర్యము తానెంతగానున్న రాణించదు.

సరవి సమస్తభూషలకు స్వర్ణమె తాను ప్రధానమై నటుల్
ఇరవగుఁ దానలంకృతుల కెన్నిటికే నుపమాన మొక్కటే
వరుసగ నెన్నివేషములు వైచియు నట్టువరా లొకర్తెయే
సరసుల మానసమ్మొకటి సంతసపెట్టునుగాదె భారతీ! 45

తా॥ దేవీ! భారతీ! క్రమముగా సమస్త భూషణములకు బంగార మొక్కటే తాను ప్రధానమైనట్లు కావ్యాలంకారము లన్నిటికిని ఉపమాలంకార మొక్కటియే మూలము గదా! ఎన్ని వేషములు భిన్ననామములతో వైచి నటిం చినను నొకే ఒక నట్టువరాలు సరసుల స్వాంతములను సంతోషపెట్టుచుండును గదా!

నెయ్యము మీరగా మృదులనిర్మలసత్పదమైత్రి యొప్ప మేల్
శయ్యను గూర్చుటందు సరసత్వముఁ జూపెడి తీరుతియ్యముల్
తియ్యని ద్రాక్షఁ గ్రోలినటు తీరగునట్టి పదార్థపాకముల్
ఎయ్యెడ కావ్యకన్య రచియింప రసజ్ఞుఁడుమెచ్చు భారతీ! 46

తా॥ భారతీ! ప్రేమ మీరగా పదమైత్రి యొప్ప మృదువగు శయ్యను గూర్చుట యందు సరసత జూపెడి విధానములును తియ్యని ద్రాక్షల గ్రోలినట్లు తీరైన పాకములను కావ్యకన్య తానొనగూర్చు రచన మొప్పిననే కదా రసజ్ఞులు మెచ్చి యానందింతురు.

గానము నీ వచస్సు నును కమ్మని కైతలె నీ మనస్సు వి
జ్ఞానము నేర్పు శాస్త్రముల జాడలు నీదగు మేధ నాట్యసం
ధాన విలాసపు న్విధివిధానము లెల్లయు నీ వపుస్సు, వా
గ్మానిని! దివ్యసుందరము నీ కరణత్రయమెందు భారతీ! 47

తా॥ ఓ తల్లీ! భారతీ! గానమే వచస్సు కమ్మని కైతలే నీ మనస్సు విజ్ఞాన సంధాయకములగు శాస్త్రములే నీ మేధస్సు. నాట్యసంధాన మొనగూర్చు సుందర విధి విధానములన్నియు నీ వపుస్సు (శరీరము) - వాగీశ్వరీ! నీ కరణ త్రయము లెందును దివ్య సుందరములు. అందులకే అందరును దాని యందములకు పరవశులగుదురు.

జ్ఞానము బ్రహ్మ కెక్కడిది? కమ్మని వాక్సతి వీవు లేమి, యా
గానము సామరూపమునఁ గ్రాలు నెటుల్ హరి కీవు లేమి? శ
ర్వాణికి తత్సఖుండగు శివయ్యకు లాస్యము తాండవంబెదో
మానిని! నిన్ ద్రిమూర్తులును మన్నన జేతురు గాదె? భారతీ! 48

తా॥ ఓ విద్యా దేవతా! నీవు లేకున్న బ్రహ్మకు జ్ఞానమెక్కడిది? నీవు లేనిదే సామరూప గానము శ్రీహరి కెక్కడిది? పార్వతికిని శివునకును కళా స్వరూపిణివి నీవే లేకున్న లాస్యము, తాండవ మెక్కడిది? ఓ వాఙ్మానినీ! నిన్ను త్రిమూర్తులును మన్నన జేయుచున్నారు కదా!

బలి యబలుం గలంచుటలు భావమునం గరుణన్ వహించి యా
హరి పరమేశ్వరుండు వివిధాకృతులన్ ధరియించి వచ్చి యా
ఖలుల నడంచునట్లు కవి గాంచియు నీశ్వరుఁడౌచు వచ్చి తాఁ
బలుకృతులన్‌ధరించి వెతఁబాపు ప్రబోధమొనర్చి భారతీ! 49

తా॥ ఓ భారతీ దేవీ! బలి అబలులను హింసించుటలు గాంచి పరమేశ్వరుఁడు వివిధాకృతులను ధరించి వచ్చి యా మూర్ఖుల నడంచివైచును. అట్లే బలి దుర్బలుల హింసించుట కవీశ్వరుఁడు తాను గాంచియు అనేక కృతి రూపముల ధరించి కష్టముల బోదోలు ప్రబోధ మొనర్చును.

నలువురు గ్రుడ్డివారు గజనాసయుఁ గర్ణము లంగముల్ దమిన్
బలువిధముల్ స్పృశించి యెదో భావమునందునఁ బోల్చుకొన్నటుల్
పలువురు శాస్త్రకోవిదులు భావమున న్నిను కావ్యరూపిణిన్
అల ధ్వని వంచు రీతి వని యౌచితివౌ రస మంద్రుడు భారతీ! 50

తా॥ విద్దెల రాణీ! వాణీ! నలుగురు గ్రుడ్డివాళ్ళు ఏనుగు అవయవముల వేరువేరుగా ఒక్కొక్క దాని మాత్రమే స్పృశించి తమ మనస్సులలో విభిన్న రూపములతో బోల్చుకొని తృప్తి పడినట్టులు అనేక శాస్త్రకోవిదులగు ఆలంకారికు లెందరో తమ మతములలో కావ్య కన్యకా స్వరూపము ఆత్మయును 'రీతి' యని 'ధ్వని' యని 'ఔచిత్య'మని 'రస'మని 'గుణ'మని 'అలంకార' మని భేదించుచుందురు.

భవభయపాపతాపవినివారకమై తలఁదాల్ప నొప్పుచున్
నవరసముల్ స్రవించి చరణప్రసవప్రభవమ్ము నొందుఁ గా
దె విబుధలోక మెల్ల వినుతించఁగ సత్కవితాస్రవంతి గం
గ వలె నిరర్గళామృతవికాసవిలక్షణధార భారతీ! 51

తా॥ తల్లీ! భారతి గంగవలె సత్కవితానది గూడ 'భవ' శంకరుని పాపతాపముల నివారించునదై (సంసార) భయమును అందరి పాపతాపములను నివారించునదై చరణమున (పాదమున) అడ్డులేని ధారతో అమృత తుల్యముగా లక్షణ యుక్తముగా (విలక్షణ) పరిశుద్ధముగా ప్రవహించును గదా!

కవికి యధర్మమున్ గెడపఁ గాల్బల మశ్వగజాదులున్న వే
వివిధమహాస్త్రముల్ గలవె విశ్వపుశాసనకర్త యెట్లనన్
అవిరళకావ్యగంగ యొక డద్దియె చాల్ తన దారి కడ్డుగాఁ
దవిలిన గట్లఁ గోయు తను దాకిన చెట్లను గూల్చు భారతీ! 52

తా॥ వాగీశ్వరీ! కవిని శాసనకర్తగా నభివర్ణింతురు. కవికి శాసన కర్తయగు రాజునకు వలె చతురంగ బలములు శస్త్రాస్త్రములు లేవు కదా! ప్రపంచమునెట్లు శాసించఁగలఁడన అవిరళముగా కవి కలము నుండి ప్రవహించు కావ్యగంగ చాలును. గంగ తన మార్గమునకు అడ్డువచ్చు చెట్లను సమూలముగా కూల్చి గట్లను కోసి ప్రవహించదా!

ఒక విద్యన్ఁబరిపూర్ణుఁడై మిగతలం దొక్కొక్క యల్పాంశసా
ధకుఁడైనన్ శశిఁ గూడి యుండు నుడుసంతానక్రియన్ వెల్గుఁ దా
నొకటన్ పూర్ణుఁడుఁ గాక యన్నికళలం దొక్కింతె సాధించుచో
సకలోడుస్థగితాంబరమ్మున నమాసం గన్నటుల్ భారతీ! 53

తా॥ ఓ చదువుల రాణీ! మానవుడు ఒక విద్యలో పరిపూర్ణుడై తక్కిన విద్యలలో కొంచెము కొంచెము పరిజ్ఞానముఁ గలవాఁడైన చాలును. చుక్కలతో గూడిన చంద్రుని శుక్లపక్షము పూర్ణిమవలె ప్రకాశించఁగలఁడు. అట్లుగాక అన్ని కళలలో ఒకింత పరిచయమే యుండిన చిన్నచిన్న చుక్కలతో గూడిన అమావాస్యా బహుళ పక్ష రాత్రివలెనయి ప్రకాశించఁజాలఁడు.

మూఁడవ కన్ను గల్గుటయు మూర్ధమునన్ రసగంగ లుండుటల్
వేడుకతో కళానిధుల పీడక నౌదలఁ దాల్చు చుండుటల్
కూడును గూడు లేక సతిఁ గూడి దరిద్రత నాశ్రయించుటల్
గాఢ సమాధి నుండుటలుగా కవి ఈశ్వరుఁ డయ్యె భారతీ! 54

తా॥ ఓ భారతీమాతా! మూడవ కన్ను (ప్రతిభానేత్రము) గల్గి యుండుటయు, తలపైన రసగంగను గల్గియుండుటయు, సంతోషముగా కళానిధుల (చంద్రుల) తల దాల్చు చుండుటయు, అన్నమునకు గతిలేక భిక్షమెత్తుటయు, నిలువ నీడలేక పర్వతముపై నుండుటయు, భార్యతోపాటు దారిద్ర్యమును ఆశ్రయించి యుండుట లీ సామ్యము లన్నింటితో కవి తా నీశ్వరుడుగా పిలువ బడెనో!

వర సుర పారిజాత మటు వాడక యుండి సుకోమలంబునై
పరిమళముల్ దిగంతములఁ బర్వఁగఁ జేయుచు వర్ణరమ్యతల్
నెరపుచు దర్శనార్హమయి నిర్మలమై మకరందగర్భని
ర్భరమయి సొంపులీనుచును పద్యములుండఁగ నొప్పు భారతీ! 55

తా॥ సరస్వతీ! జ్ఞానరతీ! శ్రేష్ఠమగు నందన వన పారిజాతకుసుమమువలె వాడిపోక యుండుటయు, కోమలముగా నుండి తన పరిమళముల దిక్కులలో వ్యాపింపజేయుటయు, చక్కని వర్ణ సౌందర్యము గలిగి యుండుటయు, దర్శనమునకు తగి యుండుటయు, నిర్మలముగా నుండుటయు, తేనెలూరు చుండుటయు, అన్ని విధముల తన సౌందర్యముల పంచివేయుచు పద్యములు హృద్యములుగా నుండవలె గదా!

చిలుకలతోడి స్నేహములుఁ జేయుచుఁ గూసెడి కోకిలమ్మతోఁ
గలహము వెట్టికొంచు నవకంజదళాక్షుల కల్కిపల్కులన్
వెలితిని జూపు చెల్వముల వేణునినాదము లూది దిక్ఫణుల్
తల లూగి నూపు మేల్ పదము లందఁగ నల్లుటె కైత భారతీ! 56

తా॥ ఓ శారదాంబా! చిలుకలతో చెలిమి సేయుచు, కోకిలల మధుర స్వరములతో కలహించుచు, స్త్రీల యొక్క ముద్దైన పలుకులలో వెలితిని జూపించుచు, తన ధ్వని సౌందర్యముతో వేణుగానము లొనర్చి దిక్కులనెడి సర్పములా పద్య సౌందర్యములకు మెచ్చి తలల నాడించగా అందాల పదాల నల్లిబిల్లిగా నల్లుట కైత యనబడును గదా!

అచ్చపు వాగ్విలాసమహదబ్ధుల మందరముల్ మథించఁగా
వచ్చు సుధారసమ్ములకు వన్నెలు దిద్దెడి కావ్యధార క
మ్మచ్చున దీయు తీవియల మచ్చుల నిచ్చు మనోజ్ఞశైలి పూ
ల్విచ్చిన నందనోపవనవీథుల కాదను కైత భారతీ! 57

తా॥ ఓ భారతీ! చొక్కమగు వాక్య సౌందర్య మహా సముద్రముల పరిశీలనా పర్వత మందరములు మథన మొనర్చఁగా అందు జనించిన యమృత రసమ్ములకు వన్నెలు దిద్దెడి కావ్యధార, కమ్మచ్చునుండి తీసిన చక్కని పైడి తీగెలలకు మచ్చుగా నిచ్చుచున్న మనోహరమగు శైలితో పూలు విచ్చుకొని యున్న నందనోద్యాన వనుల తలదన్ని వెలుఁగులీను కైతయే కైత కదా!

ప్రాకృతికోల్లసద్విషమభావపరిస్థితిఁ జూడలేకయే
లోకహితార్థమై మనసులోఁ గల వేదన నాఁపలేక యెం
తో కరుణమ్ము తానటులె తోడుత వీరము జోడుగంగలై
ప్రాకటశక్తితో నుబికి పారును కైతలయేరు భారతీ! 58

తా॥ ఓ శారదా! ప్రపంచ ప్రాణులలో విషమ పరిస్థితి (అనగా ఒకరు సుఖించుట మరియొకరు అన్న వస్త్రాలకు కష్టమనుభవించుట అను తారతమ్య స్థితి) చూడలేక ఎట్లయిన అందరు సుఖముగానున్న ఎంత బాగుండెడిది? అను వేదనను అణచుకొనలేక యెంతో కరుణరస ప్లావితమైన గుండెలోనే తద్విరోధులపైఁగల కోపము నాపలేని వీర రసము; అనగా అటు కరుణ మరియు వీరము రెండు జోడు గంగలై ప్రబల శక్తితో కైతల యేరు పారుఁగదా!

చేరున్ శాంతిపథాలలోఁ గవిత తా శృంగారమై హాస్యమై
పారున్ క్రాంతిపథాలలోఁ గరుణయై బల్వీరమై కైత తా
నీ రీతిన్ సుఖదుఃఖసంగతులలో నెందున్ ప్రతీకాకృతిన్
పారమ్యస్థితి సంఘదర్పణముగా భాసించు నో భారతీ! 59

తా॥ ఓ భారతీ! శాంతి సమయాలలో కవిత తాను శృంగార రసాకృతితో హాస్యరసాకృతితో ప్రవహించు చుండును. మరియు క్రాంతి సమయాలలో కవిత కరుణ రసమై మరియు వీరరసమై ప్రవహించు చుండును. ఇట్లు సుఖ దుఃఖములలో సంఘమునకు పట్టిన నిలువుటద్దమువలెఁ ప్రతీకాకృతిలో కవిత తాను భాసించు చుండును గదా!

సమకాలమ్మున నొడ్లలో నొదిగి తా శాంతమ్ముగాఁ బారు వై
షమకాలమ్మున నొడ్లఁ ద్రెంచుకొని యాశాంతమ్ములం బారు, ప
ల్లములన్ నింపును మెట్ట ముంచు సమతాలాస్యంబుఁ గావించు చం
దము స్వచ్ఛందము నంతె కావ్యఝరి కిద్ధాత్రిన్ సదా భారతీ! 60

తా॥ వాగ్దేవతా! భారతీ! సమకాలములలో కావ్యఝరి తాను ఒడ్లలో ఒదిగి శాంత గతిఁ బారుచుండును. విషమ కాలములో నది యొడ్లఁ ద్రెంచుకొని దిగంత ములలో పల్లముల నింపుచు మిట్టల ముంపుచు సమతా నాట్యముఁ గావించు చుండును. శాంతి పరిస్థితిలో ఛందోబద్ధమై క్రాంతి పరిస్థితిలో స్వచ్ఛందమై అనగా స్వేచ్ఛాగతిఁ గల్గి హద్దుల నతిక్రమించి ప్రవహించుచుండును గదా!

బలి బలహీనునిం గదిసి భాసురలీలలఁ బొంగి పొంచి బె
బ్బులి యయి గావుఁ బట్టు కడుపున్ వడి నింపును ధర్మ మంచు న
క్కలకయి కొంత దాన మిడు కాంక్ష మెయిన్ నుతిసేయునవ్వి యా
బలి నడచంగ వామనుని భాతి కవీంద్రుఁడు పుట్టు భారతీ! 61

తా॥ ఓ వాణీ లలనామణీ! బలవంతుఁడు బలహీనులను సమయము నారసి లేళ్ళపైఁబడు బెబ్బులివలె గావుఁ బట్టి రక్తముఁ ద్రావుచు కడుపును నింపుకొనును. ధర్మము దానము అను మిషతో నక్కలకు తన ఆస్తిలో కొంత భాగము నిచ్చును. అవి దానిని తిని ఆ బెబ్బులిని మొగిలంట పొగడుచుండును. ఆ బలియను పులిని అణచుటకై కవి వామనుఁడై జనించును.

పరిశుద్ధంపు పదార్థజాలమును సత్పాకంబుఁ గావింప ని
బ్బరపుం గాంక్ష భుజింప నొప్ప సరసుల్ బాగంద్రు భక్షించియున్
పరిశుద్ధంపు పదార్థముల్ సుకవితాపాకమ్ముఁ గావించనే
బరమామోదము తోడఁ గ్రోలుదురు విద్వాంసుల్ బుధుల్ భారతీ! 62

తా॥ తల్లీ! శారదా! పరిశుద్ధమైన పదార్థములతో మంచి పాకమును గావించిన మిక్కిలి కాంక్షతో సరసులు బాగుగా నున్నదని భుజింతురు. అట్లే దోషరహితమై శుద్ధమైన పదార్థములతో (శబ్దార్థముల) సుకవిత్వ పాక మొనర్చినచో విద్వాంసులు అభిజ్ఞులు సంతోషముతో ఆ కవితా రసములను ఆస్వాదింతురు కదా!

సవిధిన్ భోజనమం దవశ్యముగ నాస్వాద్యంబులై శాకముల్
చవులూరించి రసానుగుణ్యమయి యెంచన్ దాము నాహారమౌ
వివిధాలంకృతు లట్లె సుందరతలన్ విస్తారముం జేసి య
ర్థవిలాసంబునఁ బుష్టిఁగూర్చుఁ గవితారమ్యాకృతిన్ భారతీ! 63

తా॥ ఓ శారదాంబా! విధివిధానముగా భోజనములో తప్పనిసరి శాకములు తినదగినవై రుచి పుట్టించి తాము గూడ ఆహారములో నొక భాగమై యెట్లుండునో అట్లే కవితా రమ్యతను ప్రసాదించుచు వివిధాలంకారములును అర్థ పుష్టిని గూర్చునవై సౌందర్య వర్ధకములునై యభిరుచిని పెంచును. అలంకార రహిత సాహిత్యము శాకములు లేని భోజనము వంటిదే కదా!

కాంతన్ భాసిలు మందహాసము లపాంగశ్రేణి సౌందర్యముల్
వింతల్ వేడ్కలు గల్గఁ జేయుచునె వెన్వెంటన్ సుతావాప్తి నా
నెంతో గొప్ప ప్రయోజనం బొసఁగి తా నేపారునట్లే కృతుల్
వింతల్ గాఁగ మృదూపదేశ మిడుచున్ విన్పింపవే! భారతీ! 64

తా॥ ఓ సరస్వతీ! ప్రియురాలి ముఖములో ప్రకాశించు చిరునవ్వులు క్రేగంటి చూపులు శరీర సౌందర్యము మనస్సుకెంతో వినోదజనకములగుచునే తోడ్తో మహత్తరమగు ప్రయోజనమనదగు పుత్రప్రాప్తి నొసంగునట్లే కృతి కాంతయును వినోదమొసంగుచునే హితోపదేశమను ప్రయోజనకరమై యొప్పును.

కవిత వినోద మిచ్చుచునె కాంచఁగ సంఘములోని కుళ్ళునున్
సువిదితరీతులం గడిగి శుద్ధ మొనర్చుచు నిత్యనూత్నమౌ
అవిరళగాంగధారలు జనాళికి దేహపు వెచ్చ నూడ్చుచున్
మివులగ నీక పాపముల మ్రింగి విశుద్ధులఁ జేయు భారతీ! 65

తా॥ ఓ వాణీరమణీ! కావ్యము వినోదమొసగుచునే సంఘములోని కుళ్ళును సమూలముగా కడిగి పరిశుద్ధ మొనర్చుచు నిత్యనూత్నతను గడించు కొనుచున్నది. అవ్యాహతముగా ప్రవహించు గంగాధార జనుల దేహ తాపముల నూడ్చుచునే నిశ్శేషముగా పాపమాలిన్యాదుల పోనడంచును గదా!

కవితయె పేరిమిన్ సవిత గాఁగఁ బ్రకాశము జెంది జ్ఞానమున్
మివుల నొసంగి ప్రాణులకు మిత్రగతిన్ గనువి ప్పొనర్చుచున్
ప్రవిదితపండితాళిముఖపద్మములన్ వికసింపఁ జేయుచున్
భువి పయి మూర్ఖతాతమము పూర్ణముగాఁ దొలగించు భారతీ! 66

తా॥ ఓ విద్దెలరాణీ! కవితయే సవితగా ప్రకాశించుచు జ్ఞానమును మిక్కిలిగా ప్రసాదించి ప్రాణులకెల్లను మిత్రునివలెనే కనువిప్పొనర్చి ప్రసిద్ధ పండితుల ముఖ పద్మముల ఆనందాతిశయముతో వికసింపఁ జేయుచు ప్రపంచమున గల మూర్ఖత్వమనెడి చీకటులను బొత్తిగాఁదొలంగించును గదా! సూర్య గుణములన్ని కవితలో గలవు.

కవిత నిసర్గసుందరతఁ గ్రాలమి నెన్ని యలంకృతుల్ తమిన్
దవిలిచి దిద్దినన్ రుచిరతన్ గడియించుకొనంగ లేదు తా
నువిద కురూపతన్ వరల నొక్కట సొమ్ము లవెన్ని పెట్టినన్
మివుల స్వరూపసుందరత మేకొను నెప్పగిదిన్? సరస్వతీ! 67

తా॥ ఓ సరస్వతీ! కవితా కన్య సహజ సుందరిగానిదే కృత్రిమాలంకారములు దానికి వన్నె చేకూర్చఁ జాలవు. స్త్రీ తాను కురూపయైన దానికెన్ని సొమ్ములు పొదిగినను సౌందర్యము నాపాదించఁ జాలవు గదా! సహజ సుందరికి సొమ్ములు వెట్టిన సౌందర్యము తానది ద్విగుణీకృతమగును గదా!

పదమందున్ రసగంగ బుట్టు నది సర్వజ్ఞుల్ తలం దాల్పఁగా
నెద వొంగన్ విబుధుల్ నుతింప భువిపై నేపారుఁ గావ్యాకృతిన్
బుధుఁడౌ సత్కవి యక్షరాకృతుల దిక్పుంజమ్ములం గీర్తి సం
పదలన్ శ్రీపతి గాఁగఁ బూజ్యుఁడయి సమ్మాన్యుండునౌ భారతీ! 68

తా॥ ఓ భారతీ! పదము (శబ్దము) లో రసగంగ పుట్టును. అది సర్వజ్ఞులు (శివుడు) తల దాల్చుకొందురు. విబుధులు (దేవతలు) స్తుతి యొనర్తురు. అట్లే కవితా రస గంగలు పదములయందే జనించి శాస్త్రజ్ఞులు పండితులు తల ధరింపగా పొగడఁగా ప్రపంచములో ప్రసిద్ధి గాంచును. దాని ప్రవహింప జేయు సత్కవి యక్షర రూపములైన కృతి రూపములతో దిక్కుల సమూహముల యందు కీర్తి సంపల్లక్ష్మితో పూజ్యతను మాన్యతను గడించ గలడు.

భయమునఁగాక సత్కవిత ప్రాకటమౌ నయరీతితోనె తా
జయమును గాంచు నెల్లపుడు సంఘమునం గల కుళ్ళు బాప వి
స్మయ గతి మందు విందగుచు స్వాదుమరందములెందు బాలకా
మయములు బాపు కైవడిని మాన్యకళావతి! శ్రీ సరస్వతీ! 69

తా॥ ఓ శారదా సతీ! సత్కవిత తాను భయముతోఁగాక నయముతోనే ప్రపంచములోఁగల కుళ్ళును కడిగివేయుటలో విజయమును గాంచఁగలదు. ఆశ్చర్య మొదవునట్లు తియ్యని తేనెలు మందును విందును అగుచు బాలుర రోగములు నివారించుటకు సహాయపడును గదా!

సరస కవిత్వ కన్య కిల సాంఘికమున్ దగ రాజకీయ మం
చిరు కనులుండు సంస్కరణమే కదె రెంటికిఁ గల్గు దృష్టియున్
కరుణము వీరమంచు నిరుఁగన్నుల నశ్రులు నగ్ని రాల్చుచున్
నిరతము లోకశాంతి కయి నిద్దుర వోక శ్రమించు భారతీ! 70

తా॥ ఓ వాగ్దేవీ! సరస కవిత్వ కన్యకు ప్రపంచములో సాంఘికమనియు రాజకీయమనియు రెండు కన్నులుండును. రెంటికిఁగల సంస్కరణ దృష్టి యొకటియే. ఈ రెండు కన్నులలో నొకటి కరుణరసమును మఱియొకటి వీర రసమును గలిగియుండి లోకశాంతికినై అశ్రులొక కంటను అగ్ని నొక కంటను వర్షించుచు నిదురబోక శ్రమించును.

పద్దెములందు నున్న రసభావనలన్ సరసుం డెఱుంగుఁ దా
విద్దెల నేర్వనట్టి యవివేకి యదెట్టు లెఱుంగ నీలగున్
వద్దనఁ బూలలోని రసవన్మకరందము తేంట్లు గ్రోలెడిన్
తద్దయు నాకులం దిను పతంగ మదెట్లు గ్రహించు భారతీ! 71

తా॥ పద్యములలో నుండు రసభావములను సరసుడెరుంగును గాని విద్యా వివేకములు లేని మూర్ఖుడెట్లు తెలిసికొనగల్గును? వద్దని పోదోలినను పూవులలోఁగల రసవంతమైన తేనియలను తుమ్మెదలు గ్రోలఁగలవు గాని, ఆకులను దిను పసరులాను మిడుత తాను తేనెల గ్రోలు విధానమును తెలియఁ గలదా?

విత్తంగా వలె సస్యసంపదఁ గొనన్ బీజమ్ములన్ శ్రద్ధతో
జెత్తల్ విత్తక ముందె తుంగల వలెన్ జేలన్వడిన్ మొల్చు నా
పత్తుం గూర్చును నట్లె కావ్యగుణముల్ వచ్చుం గృషిన్నల్పనే
చెత్తల్ దోషము లెంత వద్దనిననున్ జేరుంగదే భారతీ! 72

తా॥ భారతీ! సస్య సంపదల వాంఛించి విత్తనములను శ్రద్ధతో నాటుచుండ వలెను. తుంగ కట్టలవలె చెత్త మొక్కలు విత్తకున్నను మొలిచి సస్యములకు హాని గూర్చును. అదే విధముగా కావ్యములోని గుణములను చాల కష్టపడి కొని రావలసి వచ్చును. చెత్తలవంటి దోషములు ఎంత జాగ్రత్త పడి నివారించినను వద్దనగా వచ్చి చేరును గదా!

కలహంసల్ కలహించినట్టులును వీకం గోకిలల్ కూసిన
ట్లు లలిన్ శబ్దములున్ శ్రుతిప్రియములై రూఢిం బ్రకాశింపనౌ
వలపుల్ పూయఁగఁ గాంచి స్వప్రియునితో వాల్గంటి తానవ్విన
ట్లెలమిన్ భావములున్ రసధ్వనులునందే పారుగా భారతీ! 73

తా॥ ఓ భారతీ! కలహంసలు కలహించినట్లు కోకిలలు పంచమ స్వర మెత్తి పాడుచున్నట్లు లలితములైన శబ్దములు ప్రకాశించఁగూర్చవలెను. అవి వినుటకింపుగా నుండవలెను. ఆ సుందర పద బంధములో వలపులు పూయు చున్నట్లు కాంచి తన ప్రియునితో వాల్గంటి తాను భావ మొప్ప నవ్వినట్లు రస ధ్వనులు భావములు కవితలందుండ వలెను.

వక్రోక్తుల్ మరి వానితో నొకటఁజెల్వారన్ స్వభావోక్తియున్
శుక్రామర్త్యగురుప్రశంసితమునై సొంపారు నాకావ్య శి
ల్పక్రీడల్ కనకాంకరత్నఘటితప్రాలంబమై యొప్పు నా
వక్రంబుల్ సరళంపు రేఖలును శిల్పం బౌఁగదే భారతీ! 74

తా॥ తల్లీ! సరస్వతీ! వక్రోక్తులును స్వభావోక్తియును గూర్చి వ్రాసిన కవితలు, కవియగు శుక్రుడైనను, మేధావియగు బృహస్పతియైనను ప్రశంసిం చక తీరదు. అందు కావ్య శిల్పము చెవి విందిడుచు బంగారములో పొదిగిన రత్నములు గల హారమువలె భాసించును. శిల్పమనగా సరళ రేఖల వక్రరేఖల విచిత్ర సమ్మేళనమే కదా!

పికసంఘమ్ములు వేణునాదవిలసత్పీయూష పేయమ్ము లో
పికతోఁ బంచుఁ బ్రసూనముల్ ప్రతిఫలాపేక్ష న్విసర్జించి హ్లా
దకరామోదమరుత్తరంగములఁ జేతస్సంహతి న్మంచు న
మ్మకపున్వీధుల నుంతురేల కృతులన్ మాన్యుల్ కవుల్ భారతీ! 75

తా॥ భారతీ! కోకిలలు తమ వేణు గానామృతముల నోపికతో పంచును. పువ్వులు నవ్వులు నవ్వుచు ప్రతిఫలమును కోరకుండగనే ఆనందము నొసంగు సువాసనా వాయుపేటికలతో చేతస్సును రంజింపఁ జేయును. మాన్యులగు కవులు తమ కృతుల రాజులకు అమ్ముకొనన జూతురేల? అగ్రహారముల ఆసకో, ధనముల ఆసకో లేక పదవుల ఆసకో ఈ కార్యము చేయరాదు.

ముందు తరాల వారి కని ముంతలతో బహుశార్థరాశు లిం
పొందఁగఁ గూర్చి పెట్టి నటు లున్నతులీ కవిసార్వభౌములున్
వందల మంది చేకొన సువర్ణపు పాత్రల నక్షరార్థముల్
విందు లొనర్ప భవ్యకృతివీధులఁ గూర్చిరి కాదె! భారతీ! 76

తా॥ సరస్వతీ! ముందుతరాల వారికని పాత్రలతో ధనరాశులను నింపి పాతరలో దాచిపెట్టినట్లు సత్కవి సార్వభౌములును సరస సంతతి వందలాది మంది గ్రహించునట్లు సువర్ణ (అక్షర) పాత్రలలో (అర్థ) ధనములను గంభీర రసవదర్థములను ప్రసాదించి కృతి వీధులలో దాచియుంతురు కదా!

పూవులు పూవుఁబోఁడులును పుట్టిన చోటుల మెట్టు చోటులం
దే విధి నుద్ధరించెదరొ యేవిధి కీర్తి ప్రతిష్ఠ గూర్తురో!
ఆ విధి కావ్యకన్యకయు నంచితరీతిఁ గవీశు నంకిత
శ్రీవిలసత్కృతీశుని నశేషయశోన్వితుఁ జేయు భారతీ! 77

తా॥ సరస్వతీ! పూలు, స్త్రీలు ఏరీతిగా తమ పుట్టిన చోటుల మెట్టిన చోటుల నుద్ధరించి కీర్తిప్రతిష్ఠల చేకూర్చెదరో, అదేవిధముగా కావ్యకన్య కూడ తగిన విధముగా కృతి కర్తయగు కవీశ్వరునకు కృతి భర్తకును మిక్కిలి కీర్తిప్రతిష్ఠల చేకూర్చి చిరంజీవులుగా జేయఁగలదు. పూలు దండగా చేసి ఎవరి కంఠసీమ నలంకరింతుమో వారిని గౌరవించుటకే కదా! అట్లే కన్యాదానము చేయుటలో వరుని నారాయణునిగా భావించి పాద ప్రక్షాళన చేసి గౌరవింతుము కదా!

పాత్రలు నిత్యసత్యములు పాత్రవయోవిభవాయురర్థముల్
గాత్రము లెందు సత్యములు గాథలు నక్షర సత్యముల్ వన
క్షేత్రములు న్గిరుల్ ఝురులు జీవములే యజరామరంబులౌ
చిత్రమె కావ్య విశ్వమది చిన్మయసత్య మటన్న భారతీ! 78

తా॥ ఓ వాగీశ్వరీ! కావ్యములోని పాత్రలు నిత్య సత్యములు. అవి మృతి చెందవు. ఆ పాత్రల వయస్సులు వైభవములు ఆయుష్యము అర్థసంపదలు. వారి శరీరములుఁ గూడా ఎప్పుడును కావ్యములో జీవించుచుఁడును. ఆ కావ్యములో వర్ణించిన పుణ్య తీర్థములు కొండలు నదులు అందున్న ప్రాణికోటులు జరామరణములు లేనివేకదా! ఇక సాహిత్యము తానది సత్యరూపమని నిర్వచించిన చిత్రమేమి యుండును?

ధర్మాధర్మవివేకచర్యలు దయాదాక్షిణ్యముల్ సర్వదా
శర్మాపాదకమై శుభప్రదమునై సౌశీల్య సౌధాగ్ర స
న్నిర్మాణాత్మకమై జగజ్జన మనోనీతి ప్రబోధాఢ్యమై
పేర్మిన్ కావ్యగతేతివృత్తము శివంబె కాదెటుల్? భారతీ! 79

తా॥ ఓ వాగ్దేవతా! ధర్మాధర్మ వివేకచేష్టలు ధర్మము వైపున నెప్పుడును దయ కరుణ చూపుటలు సుఖమును గలుఁగఁజేయునవియై మంగళప్రదములై సౌశీల్యమనెడి భవనముపై శిఖరము నిర్మించుటలు కాదా! ఆ కావ్యములోని పాత్రలు ఇతివృత్తము రచన జగత్తులోని జనులకు నీతి ప్రబోధము నొనర్చునదై యున్నపుడు సాహిత్యము శివరూపము గాదెట్లు?

పదములు సుందరంబులును వాక్యవినిర్మితి సుందరంబు సొం
పు దనరు నర్థసంగతులుఁ బొల్చెడిభావము సుందరంబునున్
విదితసుకావ్యరూపకకవిత్వప్రపంచమె సుందరంబు తా
ముదమిడకుండునే సరసమూర్తికి సుందరతల్ సరస్వతీ! 80

తా॥ ఓ వాగ్రూపిణీ! కావ్య ప్రపంచములోని శబ్దములు శ్రుతి ప్రియములై మనోజ్ఞములై యుండును గదా! వాక్య నిర్మాణముఁ గూడ సాలంకారమునై సుందరముగా శోభించును. సొంపులైన అర్థ సమన్వయముతో నేర్పడు భావములును మిక్కిలి సుందరములై యుండును. ఇంతకు కావ్య ప్రపంచ మాద్యంతము సుందరమై యుండుననుట సుప్రసిద్ధమే కదా! కుసరసుడు సౌందర్యమును గాంచి సంతసింపడు. అట్టితరి సాహిత్యము సుందరమనుట నిజమే కదా!

గానము జ్ఞానయుక్తమయి గౌరవమొందును జ్ఞానహీనమౌ
గానము భర్తనేవిడుచుకామినిఁబోలెఁ బ్రపంచదృష్టిలో
హీనముగాఁగఁ జూడఁబడునెప్పుడు విశ్వహితమ్ముఁగూర్చఁదా
జ్ఞానము గాన మీశ్వరుఁడు గౌరియునై మనుటొప్పు భారతీ! 81

తా॥ ఓ వాగీశ్వరీ! గానము వ్యామోహకరమగు కళ. దానిని జ్ఞానముతో జతపరిచి వినినచో ఆ కళ లోకమునకు మేలు చేకూర్చి గౌరవము పొందును. జ్ఞానముతో గూడని గానము భర్తను విడిచిన కామినివలె అనాదరమును గాంచును. ప్రపంచ దృష్టిలో నీచముగా జూడబడును. అది తానెప్పుడును లోకహితము నొనర్పదు కావున ఆ గానము మరియు జ్ఞానము పార్వతీ పరమేశ్వరులవలె ఒకరినొకరి అంటియుండుటె పూజనీయములు గదా!

శ్రుతులె శ్రుతుల్ స్మృతిప్రతతి సొంపగు బుద్ధిగ సత్కళాఢ్యసా
హితి మధురాననమ్ముగ రసేక్షణపంక్తులు దర్శనమ్ములై
జతపడఁగా నలంకృతులె చక్కనిసొమ్ములుగాఁగ నీదు మై
కథగఁ బదమ్ములే చరణకంజములంచు భజింతు భారతీ! 82

తా॥ తల్లీ వాగీశ్వరీ! నీ రూపము నేమని వర్ణింతునమ్మా? నీవు వాగ్రూపిణివి కదా! ఆ శ్రుతులే నీకు శ్రుతులు కర్ణములు. స్మృతులే నీ బుద్ధి. కళాత్మకమగు సాహిత్యమే నీ సుందరమైన ముఖపద్మము. ఆ దర్శనాలే నీ కంటి చూపులు. అలంకారములే నీ ఆభరణాలు. కావ్యేతివృత్తమే నీ శరీరం. అఖిల పదములే నీ పదములు కదా!

గాథల క్షేత్రమందు రసగంగలుఁ బారఁగఁజేసి సాహితీ
మేదిని దున్ని సత్కవి శ్రమించి క్రమంబుగ ధర్మబీజముల్
పాదుల నింపి ఛందముల పందిటశబ్దము లల్లి ద్రాక్షస
న్మాధురి జిల్కు లోకహితమంజుఫలమ్ముల నిచ్చు భారతీ! 83

తా॥ తల్లీ వాగీశ్వరీ! గాధలనెడి క్షేత్రమునందు రసమను గంగలను కాల్వలను ప్రవహింపఁజేసి తడిపి సాహిత్యమనెడి భూమిని సాగుచేసి సత్కవి యను కర్షకుఁడు శ్రమపడి క్రమగతితో ధర్మాచరణములను బీజములను విత్తి పాదులను నింపి ఛందములను పందిళ్ళలో శబ్దవాక్యలతలు ప్రాకు నట్లొనర్చి ద్రాక్షామాధుర్యమ్ముల పండించు లోక కల్యాణ మనెడి ఫలముల నొసంగును.

ఘోషప్రాంగణ మందు సత్కవి లసద్గోపాలుఁడై తాను బెన్
భాషారణ్యపు శబ్దఘాసమును మేపన్ నాల్గు పాదాల సం
తోషంబొప్పఁగఁ బద్యగోగణము తానో పూరుషార్థాఖ్యపీ
యూషంబుల్ గురిపించెఁ గైతలను వేదోధంబునన్ భారతీ! 84

తా॥ ఓ వాగ్దేవతా! గొల్లపల్లె (ధ్వని - భావ ప్రకటనము) సత్కవి గోపాలుఁడు, (వాక్పాలుఁడు) తాను భాషారణ్యములో గల శబ్దములను తృణము నాల్గు పాదాలుఁ గల పద్య గోగణమును మేపఁగా ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములనెడి అమృతమును వేదముల వంటి చతుర్విధ కవితలనెడి పొదుగు నుండి కురిపించినవి గదా!

దేహములందు మానవత దీప్తివహించుటలే యదృష్టమై
లోహములందు స్వర్ణమటు రూఢివహించును నందు సత్కళా
సాహితిగాన నాట్యములు చక్కనికైతలభింప సన్మణి
స్నేహముగూర్చి మేల్మినగ జేసినయట్లు వెలుంగు భారతీ! 85

తా॥ ఓ వాగీశ్వరీ! దేహములలో మానవ దేహము లభించుటలో లోహములలో సువర్ణము లభించినట్లు అదృష్టకరమే కదా! ఆ మానవ దేహములో కవిత మొదలగు కళలతో స్నేహ మేర్పడుట అన్నచో బంగారములో నవరత్నముల పొదిగినట్లయి జగత్తు అట్టి వానిని తల ధరించదా?

కవి యిల తాను బ్రహ్మయయి కావ్యప్రపంచము సృష్టిసేయుఁ దా
నవిరళగాయకుండు స్వరమల్లుచు సామముఁబాడు విష్ణువై
భవుడుగ నృత్యకోవిదుడుఁ భవ్యత తాండవముంబొనర్చు నీ
ముపురును విశ్వనాటకవిభూతికి దర్శకులౌట, భారతీ! 86

తా॥ ఓ భాషా మాతా! కవి తాను బ్రహ్మగా నుండి కావ్య ప్రపంచమును సృష్టి జేయుచుండును. గాయకుడు విష్ణువై సామమునకు స్వరములల్లుచు సంగీతమును గూర్చుచుండును. నాట్య నృత్య కోవిదుడు తాను శంకరుడై దివ్య నాట్య తాండవముల గూర్పగా ఈ ముగ్గురు అనగా కవి, గాయకుడు, నటకుడు కావ్య ప్రపంచ నాటకమునకు దర్శకులై యొప్పుచుందురు కదా! కవి, గాయకుడు, నటకుడును త్రిమూర్తులై ఈ విశ్వ నాటకమునకు కారకులగుదురు కదా!

కమలములున్ రసంబులఁ బ్రగాఢత మున్గియు సూర్యకాంతికే
విమలగతిన్ హసించినటు విశ్రుత కావ్యరసాల మున్గియున్
ప్రముదిత మానసాబ్జముల భాసిలకన్ గుణకోవిదుల్ కృతిన్
క్రమతహితోపదేశ గురుకాంతులు మెచ్చనుతింత్రు భారతీ! 87

తా॥ ఓ వాగ్దేవతా! కమలములు కంఠము బంటి నీటిలో మునిగియు సూర్యకాంతి లేనిదే వికసించలేవు. అట్లే సుప్రసిద్ధ కావ్య రసములలో తల మునుకలై యుండియు గుణ కోవిదులు ప్రాజ్ఞులగు దోషజ్ఞులు సంతోషించరు. కావ్య ప్రయోజనమగు హితోపదేశములు లోక కల్యాణకరములై కాంతుల విరజిమ్మి మార్గదర్శకములగును గాన వానిని గాంచి సంతసించి నుతింతురు కదా!

శృంగారంబె ప్రధానకావ్యపురసశ్రీయంచు భావించి ధ
ర్మాంగ ప్రక్రియకున్ విరుద్ధమగు కామాదుల్ ప్రలాపించుటే
బంగారంబె ప్రధాన మర్థమనుచున్ బాగంచు దానిన్ వడిన్
దొంగై యార్జనముంబొనర్పనెటుమానున్ శిక్షలో భారతీ! 88

తా॥ ఓ వాగీశ్వరీ! శృంగారమే ప్రధాన రసమని భావించి ధర్మ విరుద్ధమగు పద్ధతిలో కామకలాపముల ప్రలాపించఁదగునా? అట్లే బంగారము అర్థసంపాదనకు ముఖ్యమని దొంగతన మొనర్చి దానిని గడించిన శిక్ష తప్పునా? కావున కామ పురుషార్థమగు శృంగారమును అర్థ పురుషార్థమగు బంగారమును ధర్మమునకు విరుద్ధముగా కావ్యమున చిత్రించరాదు కదా!

విశ్వశ్రేయమె కావ్యలక్ష్యమనుచున్ వేమారు భావింపఁగన్
శశ్వద్ధర్మపథానువర్తనకునై సద్గోష్ఠి సంధింపఁగన్
పశ్వాదుల్విని మానవోత్తములునై భాసింపఁగన్ గావ్యగా
థాశ్వంబు న్నడపించు త్యాగపథగమ్యం బందఁగా భారతీ! 89

తా॥ ఓ శారదా! కావ్య లక్ష్యము విశ్వశ్రేయమే యని కవి భావించగా, ధర్మ మార్గానుకూలముగా కావ్య గోష్ఠి సమకూడఁగా ఆ కావ్యములు పశువు వంటి వారు విని మానవులై మసలు కొనగా కావ్య కథయను అశ్వమును త్యాగ మార్గములో నున్న సద్యః పర నిర్వృతి యను గమ్యస్థానము వైపు భద్రముగా నడపింపవలెను కదా!

పరపీడం బొనరింపకుండుటకునై పాఠంబిడున్ ధర్మమో!
ధరణిన్ బీదల నాదరించుటకునై త్యాగార్థమౌ నర్థమో!
వరవంశంబును నుద్ధరించుటకునై వర్తించెడిన్ కామమో!
వరుసన్ సత్కృతులం త్రివర్గమిటు లొప్పారుంగదే భారతీ! 90

తా॥ ఓ తల్లీ! సరస్వతీ? నీవిచ్చు ధర్మార్థకామ మోక్షములను చతుర్విధ పురుషార్థములలో ధర్మము పరపీడ నొనరింపకుండుటకు పాఠము నొసంగును. అర్థము బీదల నాదరింపఁగా త్యాగమును నేర్పును. తన వంశమును పవిత్ర గతి నిల్పుటకు కామ పురుషార్థము అవసరమై యుండును. వరుసగా త్రివర్గము కావ్యములో నిట్లు చిత్రించవలెను గదా!

విద్దెలు నేర్వగావలెను విజ్ఞత నార్జనముం బొనర్ప నా
విద్దె ఫలించెడిన్ దనను విశ్రుతధర్మపథానువర్తిగా
దిద్దుకొనంగనెంచుటకు తీవ్రముగా కృషిసల్పువానికే
పెద్దనిపించి లోకమున పేరు వహించునతండె భారతీ! 91

తా॥ సరస్వతీ మాతా! మానవుడు విజ్ఞానము నార్జించుటకునై యే విద్దెలు నేర్వవలెను గదా! తనను తాను ప్రసిద్ధ ధర్మ పథానువర్తిగా దిద్ది తీర్చుకొను వారి వద్దనే విద్దె ఫలించును. దానికై యతఁడు తీవ్ర ప్రయత్న మొనర్పవలెను. వాడే లోకములో పెద్దనిపించి పేరు వహించును గదా!

విషయానందముకన్న నున్నతము లీ పృథ్విన్ కళానందముల్
విషయానందము నింద్రియాదులది సేవించు న్నమాలిన్యమున్
విషతుల్యంబది సత్కళాభ్యసనదీప్తిన్‌గల్గు నానందమో
ధిషణాగ్రాహ్యము నిర్మలంబు గురుశాంతిస్థానమో భారతీ! 92

తా॥ పృథ్విలో కళానందము, విషయానందము కన్నను ఉన్నతము గదా! విషయానందముల నింద్రియాదులు సేవించును. ఆ విషయానంద మలినములైనవి క్షణికములైనవి. అవి విషతుల్యములు. కళాస్వాదన గల్గు ఆనందమో బుద్ధి గ్రాహ్యము వినిర్మలము చిత్తశాంతిప్రదము జ్ఞానమును ప్రసాదించుచుండును గదా, భారతీ!

అలనా డీవును పోతరాజుగని నన్నమ్మంగ బోకెప్పుడున్
గలనైనన్ ఖలులౌ నృపాలురకు నో కవ్యగ్రణీ! యంటివ
శ్రులు రాలన్ బహుజన్మపుణ్యముల నాశుద్ధాత్ముఁడున్ భక్తిసం
కలితుండై తన కంటనీరొలుక నిన్గాంచెన్గదే భారతీ! 93

తా॥ ఓ భారతీ! వెనుక నీవు పోతరాట్కవీంద్రునకు ప్రత్యక్షమై నన్నెప్పుడు గూడ కలనైన గాని దుర్మార్గులైన రాజులకు అమ్మవలదు, ఓ కవి కులాగ్రణీ! అని అశ్రుల రాల్చుచు అనినావు ఆ శుద్ధాత్ముఁడుఁ గూడ భక్తి సంభరిత హృదయుడై తానును కంట నీరునుంచి నిను గాంచ గలిగినాడు. ఆయన బహు జన్మముల పుణ్య ఫలము కాదా! నీ దర్శన మతని కబ్బినదన సామాన్యమా? ఏ కవికిని నీ దర్శనము కాలేదు.

బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె పొట్టకై
హాలికవృత్తినుందునని యార్తిమెయిన్ శపథంబొనర్చెఁ దా
మాలునుబిడ్డలున్ శ్రమలనందఁ జలింపకనిల్చె భారతీ! 94

తా॥ ఓ విద్యలవాణీ భారతీ! గున్నమావిక్రొన్ననవలె సుకుమారియైన కావ్యకన్యను కూళలైన (తుచ్ఛులైన) ఆ నృపాధములకు అంకితమిచ్చి వారి పడుపు కూడు కడుపు నింపుటకన్న భూమి దున్నుకొను హాలికుడనై బ్రతుకుదును అని ఆర్తితో నీ ముందు శపథమొనర్చి ఆలుబిడ్డలాకలికి మలమల మాడినను శ్రమలు పడుచున్నను చలింపక నిల్చిన పోతనార్యుడే కదా, నిజమగు కవి!

సొత్తునకాసజెంది చని క్షుద్రనృపాలురఁజేర వారి యు
న్మత్త ప్రలాపగాన మహిమమ్ములు పందినినందిఁజేయఁగా
నెత్తినపెట్టికొంచు నిదినిక్కమటంచును బ్రక్కతాళముల్
తోత్తయితక్కతోమ్మనుచు తొత్తువలెన్ లయఁగల్ప భారతీ! 95

తా॥ ఓ భారతీ! డబ్బు కక్కుర్తితోపోయి అల్పులైన రాజుల సమీపించి వారి పిచ్చి ప్రలాపములు చెడును మంచియని చెప్పుచుండగా పందిని నందియను మన ఆ యాజ్ఞను తల ధరించి వారి ప్రక్కఁ జేరి "తోత్తయి తకతోం" అని లయ వేయుచు నా ఆత్మను చంపుకొని యుండలేనమ్మా!

నిక్కముగా వచింతు నవనీపతి మన్ననమాట గాంచఁగా
నక్కరపూర్తియౌవరకె యావల వారిని మందలించినన్
చుక్కలనాడు కన్నులను చూడనుచూడరు వారి మానస
మ్మొక్కటు లుండదా మరులు నొద్దిక పాములముద్దు భారతీ! 96

తా॥ ఓ భారతీ! నేను నిజము చెప్పుచున్నాను. రాజుగారు మన్ననజేసి మాటాడు వారంటే వారి యవసర పూర్తియగువరకే. అక్కర తీరిన తరువాత వారిని మందలించిన వారి కన్నులు చుక్కలలో నాడుచుండును. మనవైపు అపుడు చూడను గూడ చూడరు. వారి మనసు ఎప్పుడొక్క రీతిగా నుండదు. వారి ప్రేమలు పాము ముద్దాడుటవంటిది. ఎప్పుడు కాటు వేయునో అని భయమే సుమా!

నాకీతం డనుకూలుడం చలుపు సన్మానించు ఁడట్టివా
డాకాలంబున నాప్రదేశమున దీపార్చిః క్రియన్వెల్గు నై
జాకీర్ణ ప్రతిభావిభాసితుఁడు తానై వెల్గు మార్తాండున
ట్లేకాలమ్మన కేప్రదేశమనకెప్డీ ధాత్రిపై భారతీ! 97

తా॥ వాగీశ్వరీ భారతీ! నాకీతఁడనుకూలుడని ఒక అల్పునైనను మహా కవియని రాష్ట్ర పాలుడు సన్మానించును. అతడు సన్మానించిన యావ్యక్తి అతడుండు కాలమున మాత్రమే ఆ చోటనే వెలిగించిన దీపమువలె ప్రకాశించును. నిజమైన ప్రతిభాశాలియగు కవి ఎవరు వెల్గించవలసిన యవసరము లేక తనకు తానై ఏ ప్రదేశమనక యేకాలమనక సూర్యునివలె అంతట ప్రకాశించును.

చిత్తము స్వామి! యం చుఅక చేతులు పూర్వసువాసినిం బలెన్
వత్తులు బేనగా విటునివశ్యనిజేసెడి వేశ్యయట్లు కిం
చిత్తయినన్ మనస్సునకు జెందని కృత్రిమహాసదీప్తులున్
బత్తెపుపెత్తనమ్ములకు బంగరుహారతులీయ భారతీ! 98

తా॥ ఓ భారతీ మాతా! చిత్తము, చిత్తము మహారాజా! యనుచు చేతులు విధవవలె నలుపుచు వత్తులు పేనగా, మరియును విటుని వశ మొనర్చు వేశ్యాంగన వలె మనస్సులో నుండి కాక పై మాత్రమే కనబడునట్లు కృత్రిమముగా చిరునవ్వు కాంతుల వెదజల్లుచు ఆ రాజుగారిచ్చు బత్తెపు పెత్తనాలకు నేను బంగారు హారతులీయనమ్మా!

ముసు జన నన్ను మించి చను ముఖ్యుఁడవాయను నొక్కయడ్గు వె
న్కనిడిన నీవువట్టి కొఱగాని జడుండ వటంచు దిట్టు ప్ర
క్క నడచినంత నా సమముగాజన నర్హుఁడ వౌదువే యనున్
గననెటువోయినన్ శ్రమయె క్ష్మాపుఁడు పల్లెరుగాయ భారతీ! 99

తా॥ ఓ భారతీ మాతా! ఈ రాజు తన ముందర నడిచినచో నతనిగాంచి నన్ను మించి పోవుచున్నావు నీవే ముఖ్యుడవా యని మందలించును. ఒక్క యడుగు వెనుకకు వేసి వెనుక నడచిన నీవెప్పుడును వెనుక నే యేడ్తువు ఎందుకు కొఱగాని వట్టిమూర్ఖుడవనును. ప్రక్క ప్రక్క నడచిన నా సమముగా భుజమొరసి నడచుచున్నావు నాతో సమానుడవా యనును. ఆ రాజుతో ఎటు నడచినను శ్రమయె. అతడొక పల్లేరు గాయవలె ఎటు వేసినను ముల్లే గ్రుచ్చును.

వేమరు రాజకీయపదవీమదమత్తులు గాంచ సాహితిన్
పామర లే ప్రజాపతుల పండితులెవ్వరొ యొక్కరుండ్రు నీ
కోమలరూపరేఖలను గుర్తెరుగన్ భవదక్షరార్థ సు
శ్రీమహిమంబుల స్గణనసేయఁగ గౌరవమీయ భారతీ! 100

తా॥ ఓ వాగ్దేవతా! ఈ రాజకీయ పదవీ మదమత్తులును గాంచ వారికి సాహిత్య మేమి తెలియును? వట్టి పామరు లా రంగమున వారు ఈ ప్రజా పాలకులలో సాహిత్యమును దెలిసిన వారెవరో ఒకరుందురు. అట్టివారే నీ కోమల రూప రేఖ లను నీ అంద చందముల గుర్తించి నీ యక్షరార్థ సంపదల మహిమల లెక్క యుచు గౌరవమీయ గలరు. అట్టివారు కాని పామర జన పాలకులవద్ద కరిగిన నీకి యవమానమే ఎదురగును.

అందరు దక్షులేయగుచు నాదను వింతయులేని రిక్తులన్
కొందల మందఁజేయఁ బెనుకోపవశమ్మున వారు రుద్రులై
చిందులు ద్రొక్కుచున్ కుపిత శీర్షజటోద్భవ వీరభద్రులై
మందిగఁ జేతురాతలల మార్చెడి దక్షులబట్టి భారతీ! 100

తా॥ ఓ శారదా! మహారాజ్ఞీ!, ఈ ప్రపంచములో జీవితమునకై ఆధార మేమియు లేని నిర్ధనులనుబట్టి యేడ్పించుటలో అందరు దక్షులే (సమర్థులే) నీకు ప్రజాపాలకులే యగుచున్నారు. వారుగూడ మనసుమండి రుద్రులై చిందుల ద్రొక్కుచు కోపించిన తలలోని జడ నుండి పుట్టిన వీరభద్రులై తలల మార్చెడి దక్షుల పట్టి యందు మానరు గదా!

అక్కట తోలుదూడ నొగి నారసి గోవులు పాలుచేపిన
ట్లొక్కెడ నారసజ్ఞులయియెప్పెడి పాఠకలోకమెప్పుడో
యెక్కడనో సమాప్తమయి యేగిన గాథల నిప్పుడిక్కడే
చక్కగ జర్గునట్లుగని స్పందనమొందెదరమ్మ భారతీ! 102

తా॥ భారతీ మాతా! తోలు దూడను ముందుంచ దానిని చూచి పాలను చేపు ఆవులవలె రసజ్ఞులగు పాఠకులు ఎప్పుడో, ఎక్కడనో జరిగిపోయిన గాథల కావ్యములు చదువుచు ఇప్పుడు ఇక్కడే తమ కండ్ల ముందు జరుగుచున్నట్లు భావించుకొని హృదయములో స్పందనమును జెంది కరిగిపోవుదురు గదా!

చొక్కపు క్షీరమట్లులు రుచుల్ బచరించుఁ బ్రసిద్ధగాథలా
చక్కెర చారపల్కులు పసందగు ద్రాక్షలు జీడిపప్పులున్
చిక్కనిపాలలో మెదిపి చేసినపాకము మిశ్రసత్కథల్
అక్కజమైన కృత్రిమపయస్సది కల్పితగాథ భారతీ! 103

తా॥ భారతీ మాతా! పిండిపోసిన చొక్కపు పాల రుచివలె పురాణ ప్రసిద్ధ గాథలుండును. ఇక చక్కెర చార పల్కులు మంచి ద్రాక్ష పండ్లు జీడి పప్పు చిక్కని పాలలో గల్పి చేసిన పాయసమువలె కావ్యములుగా వ్రాసిన మిశ్ర కథలుండును. అట్లే కృత్రిమముగా కొన్ని ధాన్యముల నుండి తీసిన పాల రుచి వలె కేవల కల్పనా కథలు రుచి గొల్పును గదా!

పలుకగనేర్చనే నరుల భాషణలం బహుపక్షు లుర్విపై
చిలుకయొకండుదక్కఁ గడుచిత్రమగున్ ఖగమయ్యు నద్దితా
పలుకులు నేర్చెనెప్పగిది బాపురె! నీదగు చేతిచల్వతో
పులుఁగులుఁగూడనుం బలుకు పుణ్యముకై యిటునోచు భారతీ! 104

తా॥ ఓ భారతీ మాతా! నీ మహిమ నేమని యందును? ప్రపంచములో అనేక పక్షులు గలవు. గాని ఒక చిలుక దక్క యే పక్షియు నరుని భాషణముల పలుక నేర్చెనా? ఆ చిలుకయు పక్షి కాదా! అది తానెట్లు మనుష్యుని మాటల నేర్వఁ గలిగెను. బాపురే! ఆ చిలుక నీ చేతిలో నెప్పుడుండును కావున నీ చేతి చలువతో నా పక్షికి గూడ భాషణ మబ్బెనే, ఆశ్చర్యము!

క్రమగతి రేకులంబొదిగి కమ్మని వర్ణము లందగింప నీ
సుమసమమార్దవంబులగు సుందరశబ్దము లల్లి కైతలన్
సుమధుర సన్మరందరస శోభితమౌనటు గూర్చుటొప్పునాన్
కమలము హస్తమందిటులుకైకొనియుంటివె తల్లి! భారతీ! 105

తా॥ ఓ భారతీమాతా! క్రమముగా కమల పుష్పపు రేకులవలె పదముల పొందికగాఁ గూర్చి, చక్కని వర్ణ (అక్షర) సౌందర్యములందగించి, పూలవలె మృదువులగు సమాసము లమర్చి కవితలల్లి వానిలో తేనె వంటి తీయని రసముల పొందుపరచి కావ్యమును రచింపవలెనని నీ కరకమలములో కమల పుష్పమును పట్టుకొని యుంటివా?

స్ఫుటగతి జ్ఞానప్రోల్లసదపూర్వరహస్యములన్ని బుద్ధి నె
న్నటికినినిల్చునట్లు శ్రవణంబొనరించిన విద్యలెందు ను
న్నటులతి శ్రద్ధతోడ మననంబొనరింపఁగ నౌనటంచునున్
స్ఫటికపుటక్షమాలనిటు పాణినిగైకొనినావె భారతీ! 106

తా॥ ఓ భారతీ! స్ఫుటముగా విశదపడునట్లు తత్వజ్ఞాన రహస్యములన్ని తెలిసికొని విని ఆ బ్రహ్మ విద్యలన్నిటిని శ్రద్ధతో తేపతేపకు మననం బొనర్చుచు వానిని ధారణము చేయవలెననియేనా నీ హస్తమందు జపమాలను గ్రహించి త్రిప్పుచున్నావు?

విలసితహస్తకోశమది వేదవిధిప్రదధర్మమయ్యె శ్రీ
లలననివాసమౌ కరవిలాససరోరుహమర్థమయ్యె పూ
విలుతుని వాహనంబు కరవిశ్రుతకీరమె కామమయ్యె ని
శ్చలహృదినిచ్చుపాణి జపసాధనమోక్షపదమ్ము భారతీ! 107

తా॥ ఓ తల్లీ! వాగీశ్వరీ! నీ చేతిలోనున్న వేదధర్మములను ప్రసాదించు పుస్తకమే మా పాలిటి ధర్మపురుషార్థము. మరొక చేతిలో శ్రీలక్ష్మిదేవికి నివాసమైన కమలమే మాకు అర్థ పురుషార్థమైనది. మరొక చేతిలోని కుసుమాస్త్రునికి వాహనముగానున్న చిలుకయే మా పాలిటికి కామ పురుషార్థము. నాల్గవ చేతిలో నిశ్చల హృదయమును ప్రసాదించు హస్తగత జపమాలయే మాకు తురీయ పురుషార్థమగు మోక్షము కదా!

చదువున ధర్మ మర్థమును సాధనజేయఁగవచ్చు నర్థమో
ముదమిడు కామవాంఛితము పూర్తియొనర్చును కామపూర్తిచే
నొదవు విరాగమా విరతి నొప్పగు మోక్షము పూరుషార్థముల్
చదువులతల్లి! నీవిడగజాలనివెయ్యవి? శ్రీసరస్వతీ! 108

తా॥ ఓ, జగన్మాతా! వాగీశ్వరీ! చతుర్విధ పురుషార్థదాయినీ! చదువుల తల్లీ! నీవిచ్చు చదువువలన సదసద్వివేకమేర్పడి ధర్మమును సాధించవచ్చును. ఆ విద్యతోనే అర్థరూపమగు సంపదలను గడింపవచ్చు. ఆ సంపదలగు అర్థ పురుషార్థముతో సకల కామములను పొందవచ్చును. ఆ కామములన్నియు తీరి, తృప్తుడై, విరాగియై విరాగ వశమున మోక్ష పురుషార్థమును సాధింపగవచ్చు గదా! ఓ చదువులతల్లీ! నీవు ప్రసాదించలేని పురుషార్థమేది గలదు?

శ్రీ శారదా స్తవరాజము—సంపూర్ణము

శ్రీ వాగీశ్వర్యై నమః

# శ్రీ స్తవరాజ పంచశతి

## శ్రీరామ స్తవరాజము

శ్రీరమణీలలామ తమ సీత, యనంతుడు భ్రాత, దుష్టసం
హారకశంఖచక్రయుగ మర్మిలి సోదరు, లా దివ మ్మయో
ధ్యారమ శ్రీపదమ్ము, త్రిదశాళి ప్లవంగమపాళి, శౌరి వి
ద్ధారుణి ధర్మరక్ష కవతారము దాల్చిన నీవు రాఘవా! 1

తా॥ సాక్షాల్లక్ష్మీదేవియే తమ సీత. ఆదిశేషుడే సోదరుఁ డైన లక్ష్మణుఁడు. దుష్టసంహారము జేయుటకు వినియోగింపఁబడు శంఖచక్రములే ప్రియ సహోదరు లగు శత్రుఘ్నుడును, భరతుడును. ఆ పరమపదమే అయోధ్యానగరి. దేవతానీకమే వానర సమూహము. ఓ రాఘవా! ధర్మరక్షణ కవతారముఁ దాల్చిన నారాయణుడవే నీవు.

వారిధి నింకఁ జేసితి రవార్యశరమ్ము నొకండు గూర్చి దు
ర్వారభవాబ్ధి నింకెడి కృపాఘనమౌ నొక చూపు తూపుగా
మీరలు దాసుపై మమత మీరఁ బ్రయోగ మొనర్ప లేరె? యో
కారుణికోత్తమా! సుజనకల్పతరూ! రవితేజ! రాఘవా! 2

తా॥ అమోఘ మైనట్టి మీ ఒకే ఒక బాణముతో సముద్రము నింకించితిరి. ఓ కరుణాసింధో! భక్తుల పాలిటి కల్పవృక్షమా! సూర్యసమానకాంతి గల ఓ రాఘవా! మీ వాత్సల్యాతిశయము చేతనే సంసారసముద్రము నింకఁ జేయ కరుణాభరిత మగు మీ కటాక్షవీక్షణబాణముల నాపై ప్రసరింపఁజాలరా?

బంధువు లెల్లరున్ మధుర భాషణలం జిలికించి నన్ను మా
యాంధుని జేసి స్వార్థమునకై దరిఁజేరి ఫలీకృతార్థులై
కంధిని దాఁటి పోతమును గాల్చెడు నట్లు త్యజింత్రు నన్ విప
త్సింధువు దాటఁ జేయఁ గల దీనదయాళుఁడ వీవు రాఘవా! 3

తా॥ బంధువు లందరును తియ్యని మాటలతో నా దరిఁ జేరి నన్ను అజ్ఞాన జన్య మగు మమతాంధకారమున ముంచి తమ యవసరపూర్తి చేసికొని ఏరు దాఁటి తెప్పను గాల్చి నట్లు నన్ను విసర్జించిరి. నేను విపత్సముద్రములో, జిక్కిన వేళల నన్ను దానినుండి నిస్తరింప ఁజేయఁగల దీనదయాళుఁడవు నీవే కదా! ఓ రామచంద్రా!

తరుణిమఁ గాంచి స్త్రీలు, ధన ధాన్యములం గని బంధువర్గమున్,
దొరతన మెంచి లోకులును దోయిళులం గొని భృత్యపాళి, య
క్కరణి నిజార్జన మ్మొకటి కల్గిన మేరకె పుత్రవర్గ మా
దరణ మొనర్చు నార్తుఁ గని దాపిడి ప్రోతువు నీవ రాఘవా! 4

తా॥ నాలో పడుచుఁదనము కల్గి నంత వరకే స్త్రీలు సమాదరించిరి. ధన ధాన్యముల తులఁదూగి నంత మేరకే బంధువర్గములు గౌరవించిరి. నాకు పదవీ భాగ్యము లున్నంత మట్టుకే అంజలు లొసంగి భృత్యులు నన్ను గొల్చిరి,. నా స్వంతపు సంపాదన గల్గినంతకే కొడుకులు నాకు విధేయులై యుండిరి. ఏదియు లేనివేళల నో రాఘవా! ఈ దీనుని దరిఁజేర్చి రక్షించు వాడవు నీవే కదా!

మానవ జీవితాన నడుమంతరపున్ సిరి యైన యౌవనో
ద్యానవసంతకాంతసుమహాసరుచుల్ గల పండ్లు రాల్చి ప్ర
స్థాన మొనర్చు నీ వయసె శాశ్వత మంటి, హిమాంబుసంతతిన్
మానితమౌక్తికమ్ము లని మందమతిన్ భ్రమఁ గొంటి రాఘవా! 5

తా॥ మానవజీవితములో నడుమంతరపు సిరి వలె బాల్యవార్ధక్యములకు మధ్యన వచ్చి పోవు యౌవన మను ఉద్యాన వసంతము పండ్ల నన్నింటిని రాలఁ జేసి పయనించినది. మంచుబిందువులను మంచిముత్యాలని భ్రమించి నట్లు ఈ వయస్సునే శాశ్వతముగా నుండునది యని యనుకొని మోసపోతిని కదా! రామచంద్రా!

ఒక పత్రంబున రుక్మిణీరమణి ని న్నొప్పారఁగాఁ జూఁచదే
ఒక పుష్పంబు గజేంద్రుఁ డార్తి నిడి నీ యుల్లంబు మెప్పింపఁడే
ఒక కర్కంధు ఫలంబు తో శబరి మీ కోరెమ్మ నర్పింపదే
ఒక పాద్యంబు నొసంగె యా గుహుఁడు మి మ్మొప్పింపఁడే? రాఘవా!

తా॥ పత్రపుష్పఫలతోయమ్ముల భక్తితో సమర్పించ తృప్తుఁడ నగుదు నని తెల్పితివి. కావున రుక్మిణి నిన్నొక తులసిపత్రముతో, గజేంద్రుఁడు ఒక కమలపుష్పముతో, శబరి ఒక బదరీఫలముతో, గుహుఁడు పాద్యోదకముతో నిన్ను వశపరచుకొనినారు కదా!

హరిశ్రీవిష్ణుకళాస్వరూపమున నీ వన్నింటిలో నుంట నీ
యరివర్గంబును నాత్మరక్షణముకై యన్యాశ్రయం బుండమిన్
ధర నీ పాదము లాశ్రయించి మనుటల్ తథ్యంబు కాకాసురుం
డరసెన్ దీని రహస్య మంతయును, దీనార్తావనా! రాఘవా! 7

తా॥ ఓ రాఘవా! నీవు విష్ణుస్వరూపమున విశ్వాంతర్యామివై యుండుటచే నీ శత్రువులు ఎచ్చట వేరే దిక్కుగానక నిన్నే శరణువేడ వలసిన వారగుదురు. కాకాసురుఁడు మూఁడులోకములు తిరిగియు వేరే దిక్కుఁ గానక నిన్నే వచ్చి శరణు వేడుటలో రహస్య మిదే.

నీవును, మీరు, వాఁడు, నది, నేనును, మేమును, వారటంచు, సం
జ్ఞావిధి సర్వనామ పురుషత్రయ మేక బహూ స్వరూప సు
శ్రీవిలసత్త్రిలింగ పరి చిహ్నిత సచ్చిద చిత్స్వరూప సం
భావిత విశ్వరూపి వయి భాసిలు చుందువు నీవ రాఘవా! 8

తా॥ నీవు మీరు వాఁడు వారు నేను మేము అది అవి అను సర్వనామ రూపివట ప్రథమ మధ్యమ - ఉత్తమపురుష స్వరూపములు నీవెయై ఏకబహూ వచనరూపివై - స్త్రీపురుష నపుంసకాఖ్యల త్రిలింగరూపివై, సచ్చిదానంద రూపివై విశ్వరూపిగా భాసిలు వాఁడవు నీవే కదా రామచంద్రా!

మానవధర్మకర్మకు ప్రమాణమువై, వరసత్యసూక్తికిన్
స్థానమవై, వదాన్యతకు స్థావరమై, కరుణాంబుదమ్మవై,
దానవ కాననమ్మునకు దావ శిఖాకృతివై, త్రిలోక స
మ్మానము నొందినాఁడ వసమాన యశమ్ముఁ జెలంగ రాఘవా! 9

తా॥ మానవ ధర్మ కర్మలకు ప్రమాణము నీవయై, సత్య సూక్తికి ఆధార మువై, ఔదార్యమునకు నిలయమువై, కరుణా మేఘమువై, దానవులను నడవికి దావాగ్నివై, త్రిలోకముల సత్పతిమానమగు కీర్తి గౌరవములు పొందినాఁడవు కదా! ఓ రామచంద్రా!

ఉగ్ర తపోపవాసముల నొక్కెడ నింద్రియ సంతతిన్ సదా
నిగ్రహముం బొనర్ప జతనించును మానవుఁ డెంత వెట్టి యా
నిగ్రహ భగ్నకారి యగు నీచమనమ్మునె శిక్షసేయఁడే,
యుగ్రతఁ బుట్టఁ గొట్టిన మహోరగ మెట్టులు చచ్చు రాఘవా! 10

తా॥ రాఘవా! తపోప వాసాదుల బహిరింద్రియముల నదుపులో నిడఁ జూచుఁ గాని అంతరింద్రియములగు మనోబుద్ధుల నదుపులో నిడలేని ఈ నీచ మానవుని గాంచ పామును చంపఁగా పుట్టపైఁ గొట్టు మూర్ఖునివలె దోఁచును.

శ్రీ మన్మన్మథ మన్మథాయిత కళాసించన్ముఖేందీవర
శ్యామా! భాను కులామృతాంబుధి మన స్సౌగంధిక ప్రోల్లస
త్సోమా! దైవ కలాభిరామ! రిపు సంస్తుత్యాద్భుత స్థేమ! శ్రీ
రామా! దైత్యవిరామ! సద్గుణ గణారామ ప్రభూ! రాఘవా! 11

తా॥ మన్మథునికి మన్మథ రూప మగు కళల వెదజల్లు ముఖ కమలము గలవాఁడా! సూర్య వంశమను అమృత సముద్రము యొక్క హృదయ కైర వమునకు (కలువకు) వికాస హేతు వగు చంద్ర స్వరూపా! దేవ కళలచే నొప్పు వాఁడా! శత్రువులచే. కొనియాడఁబడు బలసంపన్నుడా! దైత్యనాశకా! సుగుణ ముల కుప్పా! రాఘవా!

తావక సత్కృపా ఘన సుధారస వృష్టి యశేష పాప దు
ర్భావ మహా మలీమసత భంగ మొనర్పదె, మందహాస చాం
ద్రీ విశద ప్రభావళి విజృంభిత కామ తమోంధకార బా
ధా విల మానసున్ క్రమ పథా ప్త నిజాలయుఁ జేయు రాఘవా! 12

తా॥ నీ కరుణామేఘవర్షము నాదగు అనేకపాపమాలిన్యముల ప్రక్షాళన మొనర్చును. నీ చిరునవ్వువెన్నెలతో నా హృదయమును గప్పియున్న కామాంధకారముల విచ్ఛేద మొనర్చుఁవాఁడా! దయతో ఈ దాసుని రక్షింపుమా శ్రీరామ చంద్రా!

పర మగు సత్యవాక్య పరిపాలన, యేక సతీ వ్రతంబు, ని
ర్భర శరణాగతాగతిక రక్షణ, నిత్య వదాన్య తాదు లౌ
వర గుణముల్ త్వదర్చన నవశ్యము నాకు లభింప లే వెటుల్
దొరసిన స్పర్శవేది కృప లోహము స్వర్ణముగాదె రాఘవా! 13

తా॥ సత్యమును పలుకుట, ఏకపత్నీవ్రత మొనర్చుట, శరణాగతుని రక్షించుట, నిత్యము దాన మొనర్చుట మొదలగు శ్రేష్ఠగుణసంతతులు నీ పాద సేవతో నాకు లభింపకుండునా! స్పర్శవేదిని తాకిన లోహము కూడా స్వర్ణ మగును కదా! శ్రీరామచంద్రా!

చెరుగని పాప సంచయముఁ జేసితి నాకిఁక యేది దిక్కటం
చటిముటిఁ జెంద నేటికి నహల్యను పాద రజో వ్రజమ్ము సం
స్కరణ మొనర్చి యేలదొకొ స్వామి! భవచ్చరణారవింద కిం
కరుఁడ మదీయ దోషముల ఖండన సేయవదెట్లు? రాఘవా! 14

తా॥ రాఘవా! నే ననేకపాపములఁ జేసితినే, నాకింకగతిఏది? యని బాధ పడవలసిన పనియేమి? అహల్య మహాపాపమును నీ పాదధూళి శుద్ధిపరచలేదా? నీ చరణకమలనిత్యసేవకుఁడనగు నా దోషములనే కడిగివేయలేకుండునా?

స్త్రీ వడి లోహకార వసతిం గల మన్మథుఁ డూఁదుచున్న భ
స్త్రీవిధి కామతాపమును జెందంగఁ జేయుచు దేవ మానవ
స్థావర తిర్యగాది భవ సంగతదేహ వికార సంచయం
బావహిలంగఁ జేయు నెటు లయ్యవి తప్పఁగఁ జేతు; రాఘవా! 15

తా॥ "కమ్మరివాని ఇంట వెల్గు (భస్త్రి) కొలిమితిత్తి లోహముల తాపపెట్టి అనేకరూపంబు లొసంగునట్లు" స్త్రీ దేహములను కామతాపమునకు లోనుజేసి సురనరతిర్యగాది దేహములఁ బ్రాపింపఁ జేయును. అట్టి జన్మపరంపరల నెట్లు నివారింపఁజేతువో రాఘవా!

నీదు కృపారసంబు లవనిం జలదం బయి వర్ష మిచ్చెడిన్
నీ దరహాస సంతతులు నిర్మల శారద చంద్ర చంద్రికల్
గాఁ దులకించు, భీతి జనకం బగు కోపమె పావకుండుగా
బూది యొనర్చు, నీ క్షమయె భూమిగ నొప్పెసలారు రాఘవా! 16

తా॥ నీ కృపారసమే భూమిపై వర్షరూప మొందినది. నీ చిరునవ్వు కాంతులే శరత్కాలపు వెన్నెలలై ప్రకాశించినవి. నీ కోపమే అగ్నిహోత్రుని రూపము ధరించినది. నీ ఓర్పు తాను భూదేవిగా మారినది సుమా! రామచంద్రా!

రాముఁడు గల్గు చోటి కెటు రాగలుఁగున్ భవపాశికాముఁ డా
భీముఁడు రామ తారకముఁ బ్రేమ జపించియె కాము గెల్చె శ్రీ
రామ పదార్పితం బయి విరాజిలు మామక మానసంబునన్
కాముఁడు వచ్చునెట్లు? రవిఁ గాంచునె చీఁకటు లెందు రాఘవా! 17

తా॥ భవబంధము లొనగూర్చు కాముఁడు రాముఁడు గల హృదయము లోని కెట్లు రాగలఁడు? శంకరుఁడు రామనామమును జపించియే కదా, కాముని భస్మ మొనరించినాఁడు! రామపదార్పణ మొనరించిన నా మనస్సులో కాముఁడు ప్రవేశించు టెట్లు? రవి వచ్చిన పిదప చీఁకటు లుండునా? రాఘవా!

నా మదిలో దురాశయవినష్టికినై నిను సంస్మరింతు, గీ
స్తోమములో నసత్యములు దూరుల కొండెము లుండకుండ నీ
నామజపంబు సేతు నిఁక నాదగు చేష్ట నధర్మకృత్యముల్
తా మవి రాకయుండుటకు త్వత్పదపూజ లొనర్తు, రాఘవా! 18

తా॥ నా మనసులో చెడు సంకల్పములు రాకుండ నిన్ను హృదయమున స్మరింతును. నా వాక్కులో కొండెములు తిట్లు అసత్యములు ప్రవేశించకుండ నీ నామజపము నొనర్చెదను, నా క్రియలలోన అధర్మము ప్రవేశించకుండ నీ పాద పూజలు సేతును రామచంద్రా!

ఆరయ రామతారకజపాచరణమ్మున శూలి కాలునిం
బారఁగఁ దోలి యమ్మరుని భస్మ మొనర్చియుఁ జావుపుట్టుకల్
మీరె మమత్వమున్ గెడపె, మృత్యుజయుం డభవుండు నయ్యె సం
సారసముద్రసంగతవిషంబు హరించుకొనెన్ రఘూత్తమా! 19

తా॥ శంకరుఁడు తారకమంత్రజపము నొనర్చుట వల్లనే కదా, యముని పారదోలఁ గల్గెను! మరుని భస్మ మొనరించెను. యముని మన్మథుని జయించి చావుపుట్టుకలనే గెల్చెను. మమతల నడగఁజేసెను. సంసారసముద్రపు విషాదుల హరించెను. మృత్యుంజయుఁ డను బిరుదమును దాల్చెను రామచంద్రా!

శబరిది యేమి జాతి యని సాదరబుద్ధిని భుక్తశేషమున్
గబగబ నారగించితివి, కారుణికోత్తమ! నావఁ దోలఁగా
నబకను బూను తద్గుహుని యన్వయ మెట్టిది? ప్రేమవాసనల్
గుబులుకొనంగఁ గౌఁగిటను గ్రుచ్చితి మెచ్చితి శ్రీరఘూత్తమా! 20

తా॥ రాఘవా! శబరిది ఏమి జాతి యని భుక్తశేషము నారగించితివి! ఓ కరుణాసముద్రా! గుహుని వంశమేమని నావఁ దోలునంత మాత్రాన ప్రేమాతిశయముతో వానిని కౌఁగిటఁ జేర్చితి వయ్యా!

శబరి ఫలంబు కంటకిత సంసృతి ముక్తి ఘటింప వేఁడెనా?
అబక నిషాదు హస్తముల నంటి భవాబ్ధి తరింప నాడెనా?
అబల విభీషణాసుర మహార్తి వియత్తల మార్గయాత్ర మే
ల్పబఋగు విష్ణుపాద ఘన సంగతిఁ గోరె నటయ్య రాఘవా! 21

తా॥ శబరి రేఁగుపండ్లొసంగి కంటకుల మధ్యనుండు రేఁగుపండు వలె అనంతదుఃఖపరంపరలతోఁ గూడుకొను సంసారమునుండి నా యాత్మను విడఁ దీయుమా! యని తెలిపెనా? గుహుని చేతి యబక సంసారసముద్రమునుండి నావనువలె నాయాత్మను తరింపఁ జేయుమయ్యా యనెనా? విభీషణుని ఆకాశ మందలి శరణాగతిఁ జెందిన యునికి విష్ణుపదము నొసంగు మనెనా?

ఖండిత దుష్టదానవ నికాయ సముద్ధతి వేగ! దివ్యదా
ఖండల కల్ప భోగ! వరకర్ణ చలన్మణి కుండల ప్రభా
మండిత గండ భాగ! స్మిత మంజుల పుల్ల ముఖాబ్జ శోభితా
ఖండ దయానురాగ! త్రిజగన్నుతపాదపరాగ! రాఘవా! 22

తా॥ దుష్టరాక్షసుల ఖండించిన బలవేగ గర్వము గలవాఁడా! ఇంద్రుని వలె వైభవముల భోగించువాఁడా! మణికుండలప్రకాశముచే శోభింపఁ బడిన చెక్కులు గలవాఁడా! చిరునవ్వులు జిందుచుండు ముఖకమలమున అఖండ కారుణ్యప్రేమల నొలకఁబోయువాఁడా! ముల్లోకములు వినుతించిన పాదధూళి మహిమ గలవాఁడా! శ్రీరామచంద్రా!

సముఁడవు ముక్తసంగుఁడవు సాధు జనావన దీక్షితుండ వు
త్తమ గుణ రత్న నీరధి వుదార చరిత్రుఁడ వీవు నిన్ను స్తో
త్రము నొనరింప నా తరమె? తారలు నీరజవైరి చుట్టునున్
దమి గుమిఁగూడినట్లు సుగుణంబులు నిన్వలచెన్ రఘూత్తమా! 23

తా॥ అన్నిభూతములను సమముగాఁ జూచువాఁడవు, సంగముక్తి గల వాఁడవు. సజ్జనసంరక్షణము సలుప దీక్ష వహించినవాఁడవు. సద్గుణరత్నములకు సముద్రుఁడవు. త్యాగశీలము గల చరిత్ర గలవాఁడవు. నిన్ను పొగడ నా తర మగునే? చంద్రుని చుట్టు లెక్కలేని తారకలు కొలిచియున్నట్లు సుగుణములు నిన్వలచినవి రామచంద్రా!

అడిగిన వెల్ల నిచ్చు పవనాగత కల్పక భూరుహంబు రా
ముఁ డనుచుఁ గీర్తిఁ గాంచితివి, మోహితయై మను చుప్పనాతికిన్
వెదపఁ యురమ్మొసంగితివె వీర! దశానన రూపవైరి కె
న్నడయిన వీపొసంగితె? రణస్థలి భీరువు తీరు రాఘవా! ... 24

తా॥ అడిగిన వెల్ల యిచ్చువాఁడు రాముఁడు, కల్పవృక్షము వంటివాఁడు అను కీర్తిని పడసి నాఁడవు. కాని కామమోహిత యగు చుప్పనాతికి ఆలింగన మొసంగితివా? వైరియైన రావణునకు భీరువువై యుద్ధమున వీపు నొసంగితివా? రామచంద్రా!

అతులిత భక్తి సద్గురుని యానతి నౌదలఁ దాల్చి తాటకన్
బతితను సంహరించితివి బాణహతిన్, వర వీర ధర్మ సం
గతికి విరుద్ధ మైనను మఖంబును రక్షణ సేయ నెంచి స
మ్మతి గురుసేవలో సరి సమానులు నీకెవరయ్య? రాఘవా! 25

తా॥ గురుని యాజ్ఞ యైనంత యజ్ఞ సంరక్షణార్థము యుద్ధ భూమిలో స్త్రీవధ ధర్మవిరుద్ధ మని తలపక పాపాత్మురాలగు తాటకను బాణపు దెబ్బచే సంహరించితివి. ఇంతటి గురుభక్తి, ఇట్టి గురుసేవ గల్గిన వారెందరు? గురు భక్తిలో నీకు నీవే సాటి రామా!

రామ యటన్న మాత్రమున రాళులు నీళులఁ దేలియాడె శ్రీ
రామ పదాబ్జ ధూళి పడ రామగ నిల్చెను రాయి తా నిలన్
రాము శరంబుఁ గాంచ సుతరాము శరంబుల నింకె తోయధుల్
రామ యటన్న మాత్రమున రా మను పాపభయాళి రాఘవా! 26

తా॥ రామ యన్నంతలో రాళ్లు నీళ్లలోఁ దేలాడినవి. రామపాద ధూళి పడినంత రాయి వనితగా మారినది. రాముఁడు శర మెక్కుడినంత సముద్రము లింకిపోయినవి. రామ యనినంత పాప భయములు దరికి రా మనును. శ్రీరామ ప్రభో!

క్రొన్నెల వన్నె లన్ని గయికొన్నటు చెన్నెసలారు నెన్నొసల్
కన్నె గులాబి మొగ్గల నిగారపు సారము లూరు చెక్కులున్
బున్నమచంద్రబింబమును పొమ్మను కమ్మని నెమ్మొగంబు తా
మన్నల మేము తమ్ములకు నంచు వచించు కనుల్ రఘూత్తమా! 27

తా॥ చంద్రవంక దగు సౌందర్యమును పుణికిపుచ్చుకొనిన నీ దగు ఫాల తలము గులాబీమొగ్గల సౌరు జిమ్మ నిండైన చెక్కిళులు పున్నమచంద్రుని రాకు పొమ్మను ముఖసౌందర్యము తమ్ములకు మేము అన్నల మను కన్నుదోయి నీ లావణ్యమును వేనోళ్ళ చాటుచున్నవి రామచంద్రా!

ముసిముసినవ్వులో నొకట మొల్లలు మల్లెలు మొగ్గ వేయఁగాఁ
గొసరెడి చూడ్కిఁదమ్ములను గోకనదమ్ములు పూలుఁ బూయ స
ద్రసములఁ జిల్కు సూక్తుల సుధారసధారలు పొఁతవోయ నో
యొసపరి! నీదు దర్శనము నొక్కెడ దక్కఁగ నిమ్ము రాఘవా! 28

తా॥ నీ చిరునవ్వులలో మల్లెలు మొల్లలు మొగ్గలు వేసినట్లున్న పలువరస, నీ కన్నులలో కమలాలు కలువలు వికసించినట్లుండు చక్కదనము, అమృతరసధారలఁ జిల్కు నీ తియ్యని వాక్కులు ప్రకాశించఁగా ఓ చక్కనయ్యా! నీ దర్శనమ్ము నొక్కమా రొసంగవేల? రాఘవా!

ఎంచిన రాజసంబునకు నిల్లయినట్టి యయోధ్య వీడి స
త్త్వాంచితసర్వభూతసమతాశయవేషముఁ బూని మౌనివై
కొంచెపు బెస్తయౌ గుహునకున్ శబరాంగనకున్ ఖగాలికిన్
చంచలమర్కటాళికిని సన్నిహితంబుగ నుంటి రాఘవా! 29

తా॥ రజోగుణమునకు నిలయమగు అయోధ్యను వీడి సర్వభూతముల సమముగా తిలకించు మౌనివేష మూని సత్త్వగుణము నాశ్రయించి బెస్తయగు గుహునకు శబరాంగనకు జటాయువు మొదలగు పక్షులకు చంచలస్వభావముగల కోతులకును అందుబాటులో నుంటివి కదా! రామా!

కామాకృతిని నేను భార్య నొకతెన్ గాంక్షింతు, పుత్రాప్తిలో
వ్యామోహంబొందవెన్ సుతావన ధనావాప్తిన్ బ్రలోభమ్ము, త
ద్శ్రీమత్వాప్తి మదమ్ము స్వేతర వివృద్ధిన్ గ్రోధమాత్సర్యముల్
స్వామీ! సంస్కృతిజాల మల్లుదు నయో సాలీఁడునై రాఘవా! 30

తా॥ కామాతిశయముతో నేనొక భార్యను చేపట్టి యామెతోఁబొందిన పుత్రులపై మోహము పెంచుకొని, పుత్రరక్షణ ధనమునకై లోభమును బూని, ధనాధిక్యము వలన మదమును, నాకన్న మిన్నగ నున్న ధనికులఁ గాంచి కోపమును మాత్సర్యమును వహించి సాలీని గూఁడు వలె అరిషడ్వర్గ పూరిత సంసారము నల్లుకొని యందు బంధింపఁ బడితిని రామా!

హరుడును మౌళిఁ దాల్చుకొను నయ్యకలంకుఁడు బాలచంద్రుఁడున్
గురునకు నెగ్గొనర్పఁగల క్రూర నిశాచర యౌవనోద్ధతిన్
విరహుల రెచ్చఁగొట్టు కటు వృత్తములం దిరుగాడు దుష్కృతిన్
బరఁగెఁ గళానిధుల్ కుముద పక్షగతిన్ క్షతిఁ గాంత్రు రాఘవా! 31

తా॥ రామచంద్రా! చంద్రుఁడు కళానిధి యయ్యును హరుఁడు తల ధరించు అకలంక శిశుత్వముఁ గల్గియు గురుభార్యా పరిగ్రహణదోషము గల నిశాచరత్వపు యౌవనముతో విరహుల రెచ్చఁగొట్టు చెడు నేతలుఁ గల్గి యుండుటచే (కుముదపక్షమూని - కలువల పక్షమూని) చెడ్డసంతోష పక్షమును వహించుటచే క్షయము నొందుచు ధర్మమూర్తిత్వముఁ గల (రామచంద్రుని) నీతో సాటి గానేరఁడు కదా!

ఆకర్ణాంత జగన్మనోహరవిశాలాబ్జాక్ష! సౌందర్యసా
రాకీర్ణాబ్ధితరంగ రంగ ముఖ లాస్యన్మిన దృగ్వీక్ష! ల
క్ష్మీకాంతాకృత సింహ పీఠ విపుల శ్రీవత్సవక్షా! సురా
నీకాధ్యక్ష! దశానన ద్విప శిరో నిర్మూల హర్యక్షమా! 32

తా॥ కర్ణముల వరకుఁ గల విశాల మోహనకర నేత్ర పద్మములు గల వాఁడా! సౌందర్య సముద్ర తరంగ రంగ పీఠి నాట్య మొనర్చు చూపులను మీసములు గలవాఁడా! లక్ష్మీదేవికి సింహాసనమైన వక్షస్థలము గలవాఁడా! శ్రీవత్స చిహ్నము రొమ్మున గలవాఁడా! రావణ మద గజ సంహారకుఁడవగు సింహస్వరూపా! రాఘవా!

పర వనితా ధనాశ నిలపై బలహీనుల హింస పెట్టి ధ
ర్మహిత కామలోభముల రాజస తామస భోగ సౌఖ్యముల్
మరుగు నిశాచరత్వమును మాపఁగఁ జేయనె కాదె నీకు ని
ర్ధర నవతారధారణము ధర్మగుణావన దక్ష! రాఘవా! 33

తా॥ పరస్త్రీలపై పరధనములపై నాశ గల్గి తన కన్న బలహీనులను హింస పెట్టి ధర్మ విరుద్ధములైన స్త్రీపరమైన కామము, ధన పరమైన లోభము ప్రకోపింపఁగా రాజస తామస గుణాతిశయము గల భోగ సుఖముల మరిగిన రాక్షసత్వమును నశింపఁజేయగనే కదా! నీవీ ధరణిపై నవతారధారణ మొనర్చి ధరణి రక్షణ మొనర్తువు రాఘవా!

ఆకాశాదిక పంచభూతములఁ దిర్యఙ్మర్త్య దేవాది స
ర్వాకారంబుల నుండు ప్రాణితతి నాద్యంతములున్ లేని ది
గ్వ్యాకీర్ణంబగు కాల చక్రగతిఁ బ్రోద్యత్కర్మ బంధాను కూ
లాకూతిన్ సృజియించి పెంచి విలయ మ్మొడింతువే రాఘవా! 34

తా॥ ఆకాశాది పంచభూతములను, దేవ మానవ తిర్యక్ స్థావర భూత కోటిని ఆద్యంతములు లేని కాల చక్రముతో కుమ్మరి వాని సారెపై నటులు సృష్టించి బండి చక్రముపై వలె నడిపించు నీ చేతి చక్రముతో వలె విలయమ్ము నొనర్చి వాని వాని కర్మ ఫలానుభవము లిచ్చు చుందువు కదా! శ్రీరామచంద్రా!

స్థిర గతి నీదు కన్దొవల సీత నివాసము సేయు నెందు నిం
దిర యగుటం బరాంగనలఁ దేరియుఁ జూడవు వారు పద్మమం
దిరలె? భవద్దృగబ్జముల తీరముల న్విహరించ నందుకే
సరసిజనేత్రుఁ డన్న నుడి సార్థక మయ్యెను నీక రాఘవా! 35

తా॥ నేత్ర కమలములతో సీత తాను పద్మాలయ యగు లక్ష్మి యగుట వలన స్థిరముగా నివసించు చున్నది. అన్య స్త్రీలు పద్మ మందిరలు కాకుండుట వలన నీ నేత్ర పద్మముల నివసింపలేరు. దీనితో మీ సరసి జాక్షుఁడను నామము, మీ ఏక పత్నీ వ్రతత్వము అన్వర్థ పడుచున్నది శ్రీరామాచంద్రా!

శ్రీరమణీమనోజ్ఞత లశేషగతిన్ జెవికెక్కు, నన్యముల్
జేరగ నీవటంచును వచించునొ; యెయ్యెడ లోకమంగళ
శ్రీలె వినంగఁ గోరునని చెప్పుచు నుండునొ శ్రీమనోహరా
కారములై భవచ్ఛ్రుచిరకర్ణము లొప్పుచునుండె రాఘవా! 36

తా॥ శ్రీదేవీసౌందర్యములే చెవికెక్కును గాని అన్యస్త్రీల చక్కదనము చెవిఁబడనీయవు. లోకమంగళశ్రీలే ఎప్పుడును నీ చెవికి విన బడవలె గాని యమంగళముల వినఁబడనీవు. అందులకే శ్రీకారపుటాకారముఁ గల్గి మీ సుందర కర్ణము లొప్పుచున్నవేమో శ్రీరామచంద్రా!

నీ కృప గల్గినన్ తృణము నిర్జరరాజకుమారుఁడైన య
క్కాకముఁ గాల్చి బ్రహ్మశరకాంతి దిగంతములందు వెల్గదే?
నీ కృపతప్పినంత నవనిన్ బలుమారులు క్షాత్రభూధవా
నీకము జంపు భార్గవుడు నిర్బలుఁ డయ్యెఁ గదయ్య రాఘవా! 37

తా॥ నీ కృపగల్గినచో ఒక గడ్డిపరకయును బ్రహ్మాస్త్రమై ఇంద్రకుమారుఁ డగు జయంతు నంతవాని పాదాక్రాంతు నొనర్చును. నీ కృప దప్పెనేని ఇరువది యొక్క మారు పృథివిని గెల్చిన మహాశూరుఁడు పరశురాము నంతటి వాఁడును బలహీనుఁడై దీనత్వమును వహించును గాదా రాఘవా!

శరహతిఁ దాటకాసురను జంపి యహల్యా శిలాకృతిన్ దయా
చరణత నుద్ధరించి యిలఁ జంప క్షమింప సమర్థుఁడైన శ్రీ
హరి యితఁడంచుఁ గౌశికుని యాత్మకు నమ్మిక కల్గఁ జేయుటో
సిరియగు జానకిన్ వలచి చేకొన నిన్గొనిపోయె రాఘవా! 38

తా॥ ఒకే బాణముతో తాటకను వధ మొనర్చి ఒక పాదరేణు స్పర్శతో అహల్యను రక్షించి యుండుటఁ గాంచి కౌశికుఁడు సృష్టి-స్థితి-లయకారుఁడవగు శ్రీమన్నారాయణుఁడ వీవేయని గుర్తెఁగి శ్రీలక్ష్మీరూపిణి యగు సీతాదేవికి నీవే పతివని మిమ్ము మిథిలకుఁ గొనిపోయెను గాదా రాఘవా!

అసమ సుమాస్త్రు నెందుఁ బరిహాస మొనర్చెడి నవ్వుమోము మే
ల్పిసరుహపాళిఁ దమ్ము లనిపించ సుమించు కటాక్ష వీక్షణల్
పసగల మొగ్గసంపెఁగకుఁ బ్రాణము వోసెడి నాసికాగ్రమున్
మసృణ కపోల దీప్తి ముఖ మండల మెన్నఁడుఁ గాంతు! రాఘవా! 39

తా॥ మన్మథుని పరిహాస మొనర్చుచున్నదా యననొప్పు మీ నగుమోమును కమలములను తమ్ములనఁజేయు మీ విశాలనేత్రములను, మొగ్గసంపెంగకు ప్రాణమువోయుచున్నదాయన ప్రాణవాయువుతోఁ గూడు మీ సుందరనాసికను మరియు మీ దర్పణములవంటి చెక్కులను నాకెన్నడు దర్శింపఁజేతువు రాఘవా!

ప్రాకటరీతి నిర్గుణత భాసిలుచుండెద వేమొ స్వామి! యి
ట్లేకము నం దనేకమయి యీవలరం గన రావదేల? యెం
దేకముగా వెలుంగునెడ నీవు సమంచిత దృశ్యమాన స
త్తాకమవై కనంబడెదు ధాత్రిపయిన్ సగుణాప్తి రాఘవా! 40

తా॥ రాఘవా! నిర్గుణరూపుఁడవై నచో ఈ విశ్వభూతకోటిలో అనేకరూపములతో నాత్మారాముఁడవై కనఁబడవేల? నీవు ఆత్మారాముఁడవైన నిరాకారుఁడవని యనుకొన స్థావరజంగమరూపములతో నేను నేనని దర్శన మిచ్చెద వేలరా?

మానితసర్వనామ గుణ మండితరూప! శుభప్రతాప! నే
నే ననుచున్ జరాచర వినిర్మితరూప సమస్త వస్తు సం
తానము నేక సూత్రమునఁ దార్చెడి యోమహనీయమూర్తి! యీ
నేనె భవత్స్వరూప మను నేరి మెరింగితి స్వామి! రాఘవా! 41

తా॥ నేను నేను అను ఒకే సర్వనామస్వరూపమున సకల చరాచరములకు నంతరాత్ముఁడవై సమస్తవస్తువుల నొకే సూత్రమున గూర్చు మహనీయస్వరూపా! శుభప్రతాపా! ఆ నేనె నీవను రహస్యమును గుర్తెఱింగితిని శ్రీరామచంద్రా!

వికచనవారుణాబ్జదళవిభ్రమతనేత్రవిశాల! విస్ఫురన్
ముకురకపోల! రాజనిభమోహనఫాల! దయాలవాల! సు
ప్రకటితమందహాసకృతభాసురమౌక్తికమాల! శ్రీహరీ!
యకలుషశీల! వార్ధిమదహారకమార్గణజాల! రాఘవా! 42

తా॥ వికసించిన నవ కమల దళముల వంటి విశాల నేత్రములు గల వాఁడా! అద్దముల వంటి చెక్కిళ్ళు గలవాఁడా! చంద్రరేఖ వంటి ఫాల భాగము గలవాఁడా! ముత్తెములఁ బోల్పలువరుస బయల్పడు చిరునవ్వుల సొగసు గలవాఁడా! కలుష రహితమైన శీలము గలవాఁడా! సముద్ర మదము సడంచు బాణజాలము గలవాఁడా! శ్రీరామచంద్రా!

అబ్దములందు నీరమటు లాకసమందునఁ బ్రాణవాయు వ
ట్లబ్ధిజలాల నిండియు ననాకృతి నుండెడి యుప్పుభాతి కా
చాబ్దము నందుఁ దోఁచు వివిధాకృతులంబలె నన్ని నీవయై
శబ్దము నంటు నర్థమటు సర్వము నందును నుందు రాఘవా! 43

తా॥ మేఘములోన నీరము వలె ఆకాశమున ప్రాణవాయువట్లు సముద్ర జలములలోన కనఁబడక యుండు ఉప్పువలె అద్దములోని వివిధాకారములవలె అన్ని నీవెయై అన్నిటిలో శబ్దము నందలి యర్థమువలె వెలుంగువాఁడా! నీ రూపము నేమని వర్ణింతు శ్రీరామచంద్రా!

ఆకస మెన్న శూన్యపద మయ్యు సితారుణకృష్ణవర్ణది
వ్యాకృతితోడ తేజరిలు నట్టులు నీవును నిర్గుణుండవై
మాకయి తాల్చినాఁడ వసమానవిధానఘనావతారముల్
ప్రాకటమూర్తివై సుగుణభావమునన్ దయతోడ రాఘవా! 44

తా॥ ఆకాశము శూన్యమయ్యును అనేక వర్ణములతో ప్రకాశించునట్లు నీవును రూపము లేక నిర్గుణుండవై మాకొఱకై దయతో అనేక విభవావతారములు దాల్చువాఁడవు అని తెలిసితిని శ్రీరామచంద్రా!

పరుల విపత్తులం గనుచు బాధకు లోనగు వారి గుండెలో
పరమ దయాస్వరూపుఁడయి భాసిలు చుండెద వీవె తద్గతిన్
బరులు మదీయులంచు నెడ భావన సేయక యార్త రక్షకై
సిరుల నొడళ్ళ త్యాగమును జేసెడి ప్రేమవు నీవు రాఘవా! 45

తా॥ ఇతరుల కష్టములఁ గాంచి బాధపడు మానవుల గుండెలోని దయా స్వరూపము నీవే. అట్లే పరులు నావారు అని భావించక ఆర్తుల రక్షింప స్వీయ సంపదల శక్తుల త్యాగము నొనర్పఁ జేయు ప్రేమస్వరూపివి నీవయ్యె ఆర్తత్రాణ మొనర్చువాఁడా! శ్రీరామచంద్రా!

అల్లరి యింద్రియమ్ములకు నచ్చన గుండ్లకు, గుండె కాయకున్
బిల్లల యాటబంతికిని బిడ్డల కవ్విధి కమ్మబొమ్మకే
నిల్లుకు బొమ్మరిల్లునకు నెయ్యది భేదము? చిన్న పెద్దగాఁ
జెల్లుట దక్క నిన్మరచి చేడ్పడి యుంట సమంబె రాఘవా! 46

తా॥ అల్లరి ఇంద్రియములకు, అచ్చనగాయలకు, గుండెకు, ఆటబంతికి, సంతానమునకు, కమ్మబొమ్మలకు, ఇల్లుకు, బొమ్మరిల్లుకు చిన్న పెద్ద అనెడి భేదము దప్ప అవియు నివియు ఆటలే. పిల్లలు పెద్దలు ఇట్లు తమతమ ఆటలలో మగ్నులై నిన్మరచియుంటసమంబే శ్రీరామచంద్రా!

నిద్దుర వోవు వేళలనె నేస్తము లాస్తులు దారపుత్రులున్
మిద్దె లబద్ధ మయ్యె నిఁక మృత్యువు వెన్క భవార్ణవమ్ములో
నద్దరి యేమి ప్రాప్త మగు నద్ది యగోచర మప్రతర్క్యమౌఁ
బెద్దల మాట నమ్మి నిను బ్రేమ స్మరించి తరింతు రాఘవా! 47

తా॥ నిద్దుర వోవు వేళలోనే స్నేహితులు దారపుత్రులు మిద్దెలు మొదలగు ఆస్తిపాస్తు లన్నియు నబద్ధము లనిపించుచున్నవి. ఇఁక మరణానంతరము సంసారసముద్రమున కద్దరి ఏమి పొందుదునో? తర్కింపరానిది, తెలియరానిది. పెద్దల మాట ప్రమాణముగా నమ్మి నిన్ను స్మరించి తరింతును శ్రీరామచంద్రా!

అగపడు చొప్పదంటు విషయాల్పసుఖమ్ముల నాన గోరి నన్
దగులన గట్టివేయుఁడని తానె వశమ్మగు పెన్వృషమ్ముటుల్
నెగడెద రాతి నాతిగను నీ పదధూళి నొనర్చినాఁడ వీ
యగతికుఁడౌ పశుప్రతి నరాకృతి సేయవదెట్లు? రాఘవా! 48

తా॥ చొప్పదంటు వంటి ప్రత్యక్షవిషయ సుఖానుభవమునకై నన్ను కట్టి వేయుఁడని మట్టు వద్దకు జను వృషభమువలె పశుప్రాయుఁడనై నెగడుచుంటి. రాతిని నాతిగ మార్చిన నీవు పశువును మనిషిగా మార్చలేవైతివా? రామచంద్రా!

వీరు పరాయివారలని వీరలు మామకబంధుజాల మం
చారసి బంధుబృందమున కన్యుల నోళులుఁ గొట్టి తృప్తిగాఁ
గూరిచి పెట్టి పాపములఁ గూరిచి కొంటిని నెందు మీరలే
హారములోని దార మటు లన్నిట నున్నది కాంచ రాఘవా! 49

తా॥ వీరు పరులని వీరు నావారని బేదబుద్ధితోఁ జూచి నావారలకు పరుల కడుపుఁ గొట్టి తృప్తిగాఁ గూర్చి పెట్టుచు పాపములఁ గూర్చుకొంటిని. కాని హారములోని పూసలలో నొకే దారమువలె యన్నియాత్మలలో మీరొక్కరే యుందురను సత్యమును గుర్తెరుఁగ నైతి రామా!

గంగకుఁ గన్నతల్లి త్రిజగమ్ములకుం గొలబద్ద నాఁడు ఋ
ష్యంగనప్రస్తరప్రతిమ యందున ప్రాణమువోసినట్టి పే
రుం గల జీవగఱ్ఱ భవరూపమహాబ్ధికిఁ బూలతెప్ప మీ
బంగరు పాద మొక్కటియె ప్రాపని నమ్మితి సుమ్మ రాఘవా! 50

తా॥ గంగకుఁ గన్నతల్లియై త్రిజగమ్ములకు కొలబద్దయై రాయిగా మారిన అహల్యలో ప్రాణము నింపిన జీవగఱ్ఱయై సంసార సముద్రమును దాఁటఁ జేయు పూలతెప్పయైన నీ బంగారు పాద మొక్కటే గతి యని నమ్మితి శ్రీరామచంద్రా!

పద్దెము వ్రాయరాదు, ఘనపాండితి నార్జన సేయలేదు, నే
మొద్దును, భక్తి నీ శతకము న్విలిఖింపఁ దలంచినాఁడ యు
ష్మద్దయతోఁ బదార్చన నెసంగడి పాదుక లెప్పిదంబు నీ
గద్దె వసించి రాజ్యము సుఖస్థితిఁ బాలనఁ జేసె? రాఘవా! 51

తా॥ పద్దెము వ్రాయరాదు. గొప్ప పాండిత్య మేదీ సంపాదించలేదు. నేనొక మొద్దును. నీ దయతో దారు నిర్మిత పాదుకలు నీ గద్దెపై వసించి రాజ్యమును పాలించె నన నీ కృపావిశేషము కాదా! అట్లే నీ దయ యున్న నేను గూడ నీ స్తోత్రలేఖన మొనర్తును రాఘవా!

పాపుల లోపలన్ మరియు పావన జీవనులందు నుందు, వీ
వోపిక భక్తులందు వెలుఁగొందెదు, శుద్ధపు గాజుదీపమై
కాపురుషాత్మలం దరయఁగా మసిపట్టిన గాజుబుడ్డిలో
దీపము రీతిగన్ విమలదీప్తి వెలుంగక యుందు రాఘవా! 52

తా॥ పాపాత్ముల యందును, పుణ్యాత్ముల యందును నీవు అంతర్యామివై సమగతి నుందువు. కాని పాపాత్ములలో మసి పట్టిన గాజుబుడ్డిలోని దీప కళిక వలె ప్రకాశింపకుందువు. పుణ్యాత్ములలో తుడిచి శుద్ధ పరచిన గాజు బుడ్డిలోని దీపము వలె ప్రకాశింతువు రామా!

ధరణి సమస్త బాంధవులు, దారసుతుల్ సిరియున్న వెంబడిన్
దిరిగెద రర్థహీనునికి దిక్కెవరంచుఁ దలంపనేల? శ్రీ
హరి! గతిలేని పక్షికి జటాయువుకున్ గతిఁజేసి సత్కృపన్
పరమ పదం బొసంగితివి, భక్తుల కాదిగులేల? రాఘవా! 53

తా॥ దారపుత్రాది సమస్త బాంధవులు లక్ష్మి యున్ననే వెంబడిఁబడి యాదరింతురు. ధనహీనునికి దిక్కెవరున్నారని యడల వలదు. గతిలేని పక్షియైన జటాయువునకు శ్రీరామచంద్రా! గతివై సంస్కార మొనర్చి పరమపద మొసంగ లేదా? దిక్కులేని వారిని, పదభక్తుల నెప్పుడు దలంపరాదు రామా!

పీడక వెంటనుండుటలు వేమరు దేహి క్రియాను కారియై
కూడి మెలంగుచుంట లనుకొంటిని నాదగు తోడునీడ యం
చూడిగ మేమొనర్చునిదీ యుండునె చీకటి వేళ వెంట, మై
పీడిన పీడు నిద్దీ నను పీడక యుందువు నీవ రాఘవా! 54

తా॥ విడువకుండ వెంట నుండుట వలనను దేహ మెట్టులభినయించునో తాను నట్లే యాచరించుట వలన నానీడను నాకు తోడుగా నుండునదని భావించి నది. కాని యది దుఃఖతుల్యమగు చీకటిలో వెంటనుండునా? నానాకష్టములలో నన్నది యేమి యాదుకొని సేవ చేసెను? నా ఆపద్బాంధవుఁడ వీవే కదా! శ్రీరాఘవా! నన్నెప్పుడును వీడనివాఁడవు నీవే.

భవభయహారకా! మధురభావభవాకృతికారకా! మనో
భవరిపుతారకా! నిగమపావనపాలవిదూరపద్మసం
భవరిపుమారకా! విశదబౌద్ధవపుర్వరధారకా! విప
న్నివహనివారకా! నిరతనిర్మలధర్మగుణాఢ్య! రాఘవా! 55

తా॥ సంసారదుఃఖముల ప్రోదోలువాఁడా! మన్మథుని సృష్టించినవాఁడా! వేదముల దొంగిలించిన సోమకుని జంపినవాఁడా! వేదవిరుద్ధమైన బుద్ధావతార మును దాల్చినవాఁడా! నీ చర్యలు పరస్పరవిరుద్ధములై మాకు బోధపడకుండునవి. ఏదెట్లైనను ధర్మప్రచారమొనర్చి భక్తుల బాధల రూపుమాపెదవు రామా!

జారత్వంబు నసత్యవృత్తి భయముల్, చౌర్యంబు క్రౌర్యం బసూ
యారిష్టంబులు, గర్వసంతమసదుష్టాశాపిశాచమ్ములున్,
ప్రారబ్ధామయముల్, దరిద్రత, మహాపాపంబులున్, భక్తి ని
న్నారాధించెడివారి నంట వెరచున్ యాగావనా! రాఘవా! 56

తా॥ వ్యభిచారము, అసత్యవర్తనము, భయములు, దొంగతనములు, క్రూరత్వము, అసూయాద్వేషములు, గర్వము, దురాశ, ప్రారబ్ధబాధలు, దారి ద్ర్యములు, పాపములు నిన్ను పూజించువారినంట వెరచును శ్రీరామచంద్రా!

తన తలిదండ్రి మాట జవదాఁటనివాఁడు, పరాంగనన్ మదిన్
జననిగ నెంచువాఁ డెపుడు, సత్యమునే పలుకాడువాఁడు నా
జిని జయశీలుఁ డార్తులను జేకొని యేలు దయాళుఁడౌర! నీ
తనయుఁ డటంచు విన్న తలిదండ్రులు ధన్యులు గారె? రాఘవా! 57

తా॥ నీ తలిదండ్రులు తమ కుమారుఁడు తల్లితండ్రుల మాట మీరని వాఁడనియు పరస్త్రీల కన్నెత్తియుఁ గనని వాడనియు సత్యమునే మాటాడు వాఁడనియు, యుద్ధమున నెందు జయశాలి యనియు, ఆర్తులఁ గాపాడు వాఁడ నియు విని సంతసించు వారగుటచే మిక్కిలి ధన్యాత్ములు కదా! శ్రీరామా!

నీతులు విన్న యప్పుడిది నిక్కువ మాచరణీయ మంచునుం
జేతమునం దలంచు, నిలు సేరిన వెంటనె దారపుత్రసం
జాతమమత్వమాయకు వశంవదుడై, మదిరావిమోహని
ర్యాతవివేకుఁడై చెడి యదార్థసుబోధము వీడు రాఘవా! 58

తా॥ మానవుఁడు నీతి నియమముల విన్న యప్పుడు తప్పక ఇట్లే నడుచు కొందునని భావించును. ఇంటఁజేరి దారపుత్రాదులపై మమత యనియెడి మదిరను సేవించినపుడు వివేక విహీనుఁడై నీతులన్ని మరచి చెడు వర్తనముఁగల వాఁడ గును శ్రీరామా!

వేసముఁ దాల్చిసజ్జనుఁడు పోఁడనురీతి నటించి పొట్టకున్
గ్రాసము కోసమై ప్రజల కన్నుల కారముఁ జల్లి నేర్పుగా
మోస మొనర్చు నాత్మ కిటు ముందర బొందను ద్రవ్వుకొంటకే
వీసము గవ్వలున్ దనదు వెంబడిఁ గొంచరుగండు రాఘవా! 59

తా॥ సుజనుని వలె పైకి నటించి పొట్టకూటికై ప్రజల కన్నులలో కారము జల్లి మోసగించును. ఈ చాకచక్య మంతయు తన గొయ్యి తానే త్రవ్వుకొనుట కుపయోగ పడునదే కాని వీసము గవ్వలు కూడ తనవెంట కొని పోవునా? దారపుత్రాదులకై తాను పాపకూపమునఁ బడుటేల? శ్రీరామా!

కస్తూరీతిలకోర్ధ్వ పుండ్రములతో గ్రైవేయహారాళితో
మస్తాగ్ర ప్రవిదీప్త రత్నమకుటా మంద ప్రభాపాళితో
హస్తాలంకృత దివ్యకార్ముకముతో హైమాంబర స్ఫూర్తితో
శస్తంబైన భవత్స్వరూప మెటు సాక్షాత్కారమౌ? రాఘవా! 60

తా॥ కస్తూరినామముతో కంఠహారములతో తలపై ప్రకాశించు రత్నకిరీటముతో కోదండమును ధరించిన హస్తముతో పీతాంబరమును ధరించిన నీ దివ్య మంగళవిగ్రహమును సాక్షాత్కరింపఁజేయరాదా! శ్రీరామచంద్రా!

భర్తవు నీవు గల్గ నిటు బాలిశతన్ దురహంకృతిన్ సదా
కర్తను నేనటంచుఁ బ్రతి కార్యములో గుడి మోయు గబ్బిల
మ్మోర్తుక తానహంకృతిని నొందిన యట్టులు నేను గర్వవి
స్ఫూర్తిని బ్రమందుచుంటి దయఁజూచి యహంకృతిఁ బాపు రాఘవా! 61

తా॥ నీవు సకలసృష్టిలయాత్మకప్రకృతికి కర్తవై యొప్పి యుండఁగా గుడిమోయు గబ్బిలమువలె నేనే కర్త నను దురహంకారముతో నావలననే సంసారభారము మోయఁబడుచున్నదని వాకొందును. ఈ యహంకారమును నశింపఁ జేయుమా శ్రీరామచంద్రప్రభూ!

క్షేత్రము నీవె, తత్ఫలముఁ జెందుట నీకె, కృషిం బొనర్చుటల్
మాత్రము నేను; దొంగ పసిమందల మేపిన నెవ్వఁడేని దు
ష్పాత్రుఁడు, నా పొలమ్ము నిటు పల్మరు మేపుట కూడదందు, నీ
మాత్రపు నాయహంకృతిని మన్నన సేయగదయ్య రాఘవా! 62

తా॥ పొలము నీదే దానిలోని ఫలము నీదే నేనొక పాలేరునై దానిలో నీ యాజ్ఞప్రకారము సేద్యము నొనర్తును. ఎవడేని యాక్షేత్రములో దొంగపశువుల మేపి నీకు నష్టము చేకూర్చుచున్నపుడు నా పొలముపై ఎద్దుల నెట్లు తోలితివని వానితో వాదింతును. నా ఈమాత్రపు అహంకారమును మన్నింపుము శ్రీరామ చంద్రా!

వాలి నగమ్ము మాటుగొని వంచనమై హతుజేసె నంచు నిన్
వ్రేలిడి చూపుచుండిరి వివేకవిహీనులు; నక్రమంపు ట
వ్వాలి వరమ్ము తానెదిరి వానిబలమ్ము సగమ్ము లాగుటల్
పోలునె? వానిహత్య కదెపో సరికారణ మయ్యె రాఘవా! 63

తా॥ వాలిని చెట్టు చాటున నుండి చంపితి వనియు నీవు ధర్మమును తప్పినాఁడ వనియు మతి హీనులు మాత్రమే పల్కుచుందురు. వాలి అక్రమ మైన వరమును గోరుకొని ఎదుటి వారి బలములోని సగమును లాగుకొనుట ధర్మమా? వాని యాదుష్ట వరప్రాప్తియే వాని హత్యకు కారణ మని గ్రహించరు.

తమ్ముల కీవు జీవనప్రదాతవు, స్వప్రజలన్ ప్రజాకృతిన్
సమ్మతి నేలినాడవట సాధ్వి ద్వితీయను నద్వితీయప్రే
మమ్మునఁ గాంచినాఁడవు, కుమారులు నాజికుమారులైరి, నిన్
నమ్మిన భక్త సంతతికి నమ్మిడువోయితి వీవు రాఘవా! 64

తా॥ తమ్ములకు (కమలములకు - సోదరులకు) జీవనము (నీరు + ప్రాణము)ల నొసంగువాడవు. ప్రజలను - ప్రజల (బిడ్డల)వలె కాపాడుదువు ద్వితీయను (భార్యను) అద్వితీయ ప్రేమలో నేలినాఁడవు నీ కుమారులు యుద్ధ మున కుమారస్వామి యంతటి వారు. నిను నమ్మిన భక్తులకు నమ్మిడు పోయితి వీవు రాఘవా!

అంగన యైనఁ బూరుషుఁడు నైనను బ్రాహ్మణుఁడేని బోయఁడేన్
రంగగు పక్షియేని మృగరాజివనేచరులేని, నీదు సన్
మంగళదాయకాంఘ్రియుగమ స్తకులైనను జాలు వారలో
సింగిణిలోని వర్ణముల చెల్వు ధరించి తరింత్రు రాఘవా! 65

తా॥ స్త్రీయైనను పురుషుడైనను బ్రాహ్మణుఁడేనియు శూద్రుఁడేనియు పశుపక్ష్యాది తిర్యక్కులేనియు నీ మంగళకరమైన పాదముల శరణాగతులైనచో సింగిణిలోని వర్ణములవలె నన్నియు ప్రకాశించును శ్రీరామచంద్రా!

కలికలుషాబ్దపర్వతవిఖండదురుప్రళయప్రభంజనా!
సలలితరూపశీలగుణసంపదశేషజనానురంజనా!
యలఘుమమత్వమోహమదిరాంధతమఃప్రవిభేదకాంజనా!
విలసితజానకీహృదయవిశ్వవియత్తరుణార్క! రాఘవా! 66

తా॥ కలిలోని పాపరూపములగు కొండలవంటి మేఘములకు ప్రళయ వాయువైనవాఁడా! రూపగుణములతో ప్రజలదృష్టి చిత్తముల హరించినవాఁడా! మమత యనెడి గ్రుడ్డితనమును బోఁగొట్టు అంజనమైనవాఁడా! జానకీహృదయ కమలమునకు సూర్యరూపుఁడవైనవాఁడా!

ఏ కోపాగ్నికి సంద్రమే యినికిపోయెన్ రావణుం డెంతరా?
ఏ కందర్పతనున్ ఋషుల్ పురుషులై యేవేళ మోహింతు రా
సోకుంజేడియ చుప్పనాతి వలపుల్ చూపించు టేపాటియో!
నేకంజాక్షుని వేదముల్ పలుకలే వేనెంతరా? రాఘవా! 67

తా॥ ఏ కోపాగ్నికి సముద్రజలములే ఇంకిపోయెనో? రావణునిజీవనము లెంతటివి? ఏ మన్మథరూపుని ఇంద్రియనిగ్రహముఁగల ఋషులైనను పురుషులే మోహించిరో? రక్కసిచేడెయైన చుప్పనాతి ఎంతటిది? ఏ నిన్ను వేదములే వర్ణించలేవో నేనెంతటివాఁడను రాఘవా!

చేఁపకు నీరమట్టులును, జెట్టుకు మూలము భాతి, చంటిదౌ
పాపకుఁ గన్నతల్లి వలె, భామినికిం బతియట్లు, నట్టితే
యాపగలందు నావవలె, నాత్మల కెల్లను నీదు పాదమే
ప్రాపని నమ్మియుంటి నెడఁబాయఁగ న్యాయమె నన్ను రాఘవా! 68

తా॥ చేపకు నీరువలె చెట్టుకు వేరువలె చంటిబిడ్డకు జననివలె సతికి పతి వలె నదినిదాఁట నావవలె ఆత్మ లన్నిటికి నీ పాదకమలములే దిక్కని నమ్మి యుంటిని. శ్రీరామచంద్రా!

ఏ క్రియ సర్వలోకముల నేలెడి నేత యయోధ్య నుండు, దా
నే క్రియ విశ్వభూతముల కెల్లను దండ్రి సుతాత్మనుండు, దా
నే క్రియ పూర్ణధర్మతనుఁ డీశుఁడొకే నృపధర్మవర్తియౌ
నే క్రియ క్షీరసాగర మొకింత ఘటాన నడంగు రాఘవా! 69

తా॥ సర్వలోకముల పాలించ వచ్చిన రక్షకుడు ఏ రీతిగా ఒకే అయోధ్యలో నుండి పోగలడు? సమస్తభూతకోటికి తండ్రి యైనవాఁడు దశరథునికి మాత్రమే కొడుకై యతని వద్దనే యెట్లుండఁగలఁడు? పూర్ణధర్మస్వరూపుఁడు ఒకే నృపధర్మమునకు బద్ధుఁడై శ్రీరామచంద్రుం డెట్లుండఁగలఁడు శ్రీరామా!

తమతో నున్న సుధార్ణవంబె కలశస్థంబైన క్షీరాన్నమై
క్షమపైకిం బరతెంచెనో నృహరియే జన్మించెఁ దానిట్లనన్
రమ భూగర్భనిధి స్వరూప యయి సీరం బంటి రానోపు సీ
తమనున్ నిన్ హరువిల్లు తానే మరువిల్లై కూర్చెనో? రాఘవా! 70

తా॥ మీతో పాటు క్షీరసముద్రమే పాయసకలశమై దశరథునికి లభ్యమైనదో, లేనిచో నృహరివైన నిన్ను ఏపాయసము ప్రభవింపఁ జేయగలదు? లక్ష్మియే భూమిలో దాగియున్న నిధిస్వరూపమయి రానోవు. హరువిల్లు మరువిల్లయి మిమ్మిరువురిని గూర్చి యుండనోవు శ్రీరామచంద్రా!

బంగార మ్మిల దారపుత్ర పదవీ భాగ్యాదులే యంచు దు
స్సంగాసక్తుఁడ నౌచు నెల్లపుడు యుష్మత్పాద పంకేజ స
త్సంగా సక్తుఁడఁగాక యుండుటె పరేశా! వంక లెన్నేగినన్
గంగాపూర్ణము లర్ణవాభి ముఖతం గ్రాలుంగదే రాఘవా! 71

తా॥ దారపుత్రులు గృహారామములు మొదలైనవే మహాసుఖములని ఎప్పుడును మమతాసంగమును వీడకుండు టేనా? నీపాదపంకజములే ప్రాప్యము అని తెలియవలదా? గంగాజలములు తామెన్ని వంకలేగినను తుదిలక్ష్యము సముద్రములోవిలీనమై పోవుటేగదా శ్రీరామచంద్రా!

కాగిత మాకసమ్ముగను, గ్రమ్మ ఘనమ్ము మషీమణిప్రతిన్
మూఁగెడి చుక్క లక్షరపు ముత్తెపు పంక్తులుగాఁ గళానిధి
ప్రాగుదితాంశువుల్ సరసభాసురలేఖినిగా నజుండు తా
నీ గుణభారతిన్ నుడువ నేరఁడు నాల్గుమొగాల రాఘవా! 72

తా॥ ఆకాశమును కాగితముగా మేఘముల సిరాబుడ్డిగను చుక్కల నక్షర పంక్తులుగను చంద్రకిరణముల లేఖినులుగా నొనర్చి బ్రహ్మ తాను నాల్గు మొగాలతోఁ నీ గుణమహిమను బొగడఁ జాలఁడేమో! యనిపించును శ్రీరామ చంద్రా!

ఈ మహి మానవుండు తన యిల్లును పట్టును జూచుకొంచునే
రామును బొందు యత్నము విరామము లేక యొనర్పఁగాఁ దగున్
భూమి నిజప్రదక్షిణము బొంగరపుం గ్రియ నిచ్చ సేయుచున్
భామహితున్ రవిన్ సమవిభాగతఁ జుట్టివెలుంగు రాఘవా! 73

తా॥ మానవుఁడు తానిల్లును పట్టును చూచుకొనుచునే శ్రీరామా! నిన్ను బొందు ప్రయత్న మొనర్పవచ్చును. భూమి తన చుట్టు తాను తిరుగుచునే సూర్యుని చుట్టు ప్రదక్షిణ మొనర్చుచున్నదిగా తెలిసికొనియుంటిని శ్రీరామ చంద్రా!

చంచలమైన చిత్తమును శాశ్వతరూపభవత్పదార్చలో
నుంచిన యాంజనేయునటు లూహకు మించిన శక్తియుక్తిసా
రాంచితమై క్షణమ్మున భవాబ్ధిని దాఁటి దశేంద్రియాసురుల్
వంచననొంద, జ్ఞానశిఖి సంస్కృతి లంకను గాల్చు రాఘవా! 74

తా॥ శ్రీరామచంద్రా! నా కోతివంటి చంచలచిత్తమును నీ పాదార్చలో నుంచిన ఆంజనేయునివలెనే ఊహకు మించిన శక్తిగలిగి సముద్రమును దాఁటి దశేంద్రియాసురుల వంచనచేసి జ్ఞానాగ్నితో పాపకర్మలను లంకను కాల్చ కుందునా!

నిను గనకున్న భక్తతతి నిల్వఁగ లేదు నిమేషమైన, నా
జనకజప్రాణముల్ నిలుపఁ జాలె నెటుల్ పదునాల్గుమాసముల్
జనని సుతాత్మతుష్టికి దొసంగు లవెట్టివి యెన్ భరింపదే
తనపతికన్న పుత్రమమతల్ కడుహెచ్చగుఁగాదె రాఘవా! 75

తా॥ నిన్ను గాంచకున్న భక్త జనమే అరనిముసముఁగూడా నిల్వ లేదన్నచో జానకీరమణి పదునాల్గుమాసము లెట్లు నిల్వఁగల్గినది? ఆమె బిడ్డలామగు మాకొఱకు కల్యాణమాచరింప నీ విరహమునైన భరించెనేమో? పతిమీఁది కంటె సుతుని పైననే కన్నతల్లికి మమత హెచ్చుకదా! శ్రీరామా!

శ్రీరఘురామచంద్ర! సువిశిష్టప్రతాపజితామరేంద్ర! శృం
గారకళావిలాస! బలకల్పితమారకుమారకేంద్ర! వి
స్తారితకీర్తిసాంద్ర! మద దర్పితరాక్షస హస్తిమస్తకో
న్మూలకకేసరీంద్ర! గుణభూషణదీప్తనరేంద్ర! రాఘవా! 76

తా॥ ప్రతాపమున నింద్రుని గూడ జయించినవాఁడా! శృంగారమున మన్మథుని వీరమున కుమారస్వామిని జయించువాఁడా! కీర్తిసముద్రము గల వాఁడా! మదించిన రాక్షస గజముల శిరస్సు నున్మూలించు సింహస్వరూపా! గుణభూషణములచే వెలుగొందువాఁడా! శ్రీరామా!

అవిరళప్రేమభావమున నమ్మిథిలేశు సభాంగణస్థలిన్
నవమదనుండు తుంటవిలు నర్మిలి యెత్తినయట్లు నెత్తి య
భ్భవి జనువొందు నాత్మలకు పుట్టుక చావుల మూలమైన త
ద్భవధనువున్ హరించుటలు తప్పని కార్యమెకాదె రాఘవా! 77

తా॥ జనకుని సభాసదనమున మన్మథుఁడు చెరకుతుంట నెత్తినట్లు హరుని విల్లెక్కిడి ప్రపంచజీవులకు చావుపుట్టుకలకు మూలమైన భవసంబంధ ధనువునే విరుచు కార్యమొనర్చుట విధియని తలంచితివా శ్రీరామచంద్రా!

పీతవసానధారివయి పెండ్లికుమారుఁడ నేనెయంచు నా
సీతను పెండ్లియాడుటకుఁ జేరితివచ్చుట ముందెదారిలో
గౌతముపత్నిశాపమును ఖండనజేసి మునీశుఁగూర్చి వి
స్పీతను సీతఁగొంటి నిలఁ బెట్టిన వారికిఁ బెట్టు రాఘవా! 78

తా॥ పీతాంబరముతో నున్న నీవు పసుపుబట్టలతో సీతను పెండ్లియాడ వచ్చిన వరునివలె నున్నావనుట నిశ్చయము. దారిలో రాయియైన అహల్యను స్త్రీనొనర్చి గౌతముని ఇల్లు నిలఁబెట్టితివి. వెంబడే సీతావివాహము వలన నీవొక ఇంటివాఁడవైతివి. పెట్టిన వారికి పెట్టుకదా! శ్రీరామా!

నేను భవత్పదాంబురుహనీరజపున్ రజమై వెలుంగుటన్
మానుగ విశ్వమెల్లఁ గడుమాన్యత నౌదలఁ దాల్చె నద్దిరా!
మానవనాథు వెంట కొరమాలిన శ్వాన మొకండు నున్న స
మ్మానితరాజపీఠముల మాన్యత నొందును గాదె! రాఘవా! 79

తా॥ నేను నీ పాదధూళి నౌట వలన నేమో విశ్వమునకు తలఁ ధరింపఁ దగినవాఁడనైతిని. కొఱమాలిన కుక్కఁగూడ రాజుగారి నాశ్రయించి యున్నత పీఠములనుండి లాలింపఁబడుచుండుట (సకలజనులచే) సహజమేకదా! శ్రీరామచంద్రా!

అంబురుహాక్షి! నిన్ను విషమాంబకలక్ష్యములన్ హరింతునో
యంబుజపాణి! యట్లె విషమాంబకదృష్టిపరున్‌హరింతు సూ
క్ష్మంబుగ నంచు సాంబశివకార్ముకమున్ కయిఁబూనినావొ యో
యంబుజనేత్ర! తావకక్రియల్ బహుళార్థదముల్ రఘూత్తమా! 80

తా॥ ఓ సీతా! నిను (విషమాంబక)మన్మథబాణలక్ష్యములచే హరింతును, శత్రురాజుల(విషమాంబక)శంకరుని దృష్టులతో హరింతును అని విషమాంబక ధనుస్సును చేఁబూనినావా! నీ కృతులు బహుళార్థసాధకములు కదా! శ్రీరామచంద్రా!

ధర్మవిరుద్ధపద్ధతిఁ బదంపడి నర్థముకామముం గొనున్
శర్మదమోక్ష మబ్బు నెటు? సజ్జనుఁ డెందును ధర్మమూలమున్
మర్మ మెరింగి యర్చన మొనర్చుచు మోక్షఫలమ్ము నొందునో!
ధర్మశరీర! నిన్‌గొలువఁ దా నిహమున్ బరమబ్బు రాఘవా! 81

తా॥ చతుర్విధపురుషార్థవృక్షములో ధర్మము మూలము, మోక్షము ఫలము. మూలరూపమగు ధర్మార్చనవలననేకదా మోక్షఫలము ప్రాప్తించును? కావున మర్మ మెరింగిన ధర్మవేత్త "రామోవిగ్రహవాన్‌ధర్మః" అని ధర్మరూపివైన నిన్నర్చించి చతుర్విధపురుషార్థరూపమైన ఐహికాముష్మికముల ననుభవింతును శ్రీరామా!

మునుకొని యర్థకామముల మోహనరూపములైన యట్టి యా
ధనవనితాపదార్థముల దాంభికరూపమెకా ప్రపంచ, మా
ధనవనితాస్వరూపభ్రమదాయకమై మను నీప్రపంచమే
మనుజుఁడు గెల్చువాఁడొ? పరమార్థసుఖాశినిబొందు రాఘవా! 82

తా॥ ఈ ప్రపంచసుఖములన్నియు ధనవనితాస్వరూపములేకదా! కావున నీ ధనవనితాస్వరూపమున నొప్పు నీ ప్రపంచము నెవ్వఁడు గెల్చుచున్నాఁడో వాఁడే పరమార్థసుఖమగు మోక్షసుఖమును బొందును శ్రీరామచంద్రా!

పతి క్షమియింపరాని పెనుపాప మహల్యాది యూర్ధ్వలోకస
ద్గతికిని దూరముంచు భవతాపము నారనియగ్నివోలె వి
స్తృతిఁగొను శాప, మెప్పుడును దీరని లోపము, నేరిమోమునున్
బ్రతికియుఁగాంచఁ జాలని విలాపముఁ బాపితివెట్లు? రాఘవా! 83

తా॥ అహల్య యొనర్చిన పతి క్షమింపరాని పాపము సద్గతికి దూరముగా నుంచు భవతాపము, ఆరని యగ్నివలె వ్యాప్తినిబొందు శాపము ఏవేళ తీరని లోపమును బ్రతికి ఎవరి మోమును జూడఁ జాలని విలాపమును ఏ రీతి దూర మొనర్చితివయ్యా రామచంద్రా!

అమల యటంచు నెంచియును నగ్నివిశుద్ధ యటంచుఁ గాంచి శ్రీ
రమణిగ నాత్మ నెందును దలంచియు, విశ్వపు మెప్పుఁ గాంచియున్
భ్రమఁగొని చాకిమాటలకు భార్యను గానల డించి పంచితో
యమలచరిత్ర బంధకి యహల్య పవిత్ర యెటయ్యె? రాఘవా! 84

తా॥ సీత అమలయనియు, అగ్నిపూత యనియు, సాక్షాల్లక్ష్మి యనియు, విశ్వవిఖ్యాత యైన పతివ్రత యని తెలిసికొనియు, చాకివాని మాటలకే అడవుల కంపి త్యాగమొనర్చితివే, అహల్య జారిణి పవిత్ర ఎట్లయ్యెను శ్రీరామచంద్రా?

శాప మొసంగ రాయియయి చచ్చిన గౌతమధర్మపత్ని నీ
శ్రీపదధూళి సోకి సరిజీవనముల్ బడి మారుజన్మ సం
ప్రాపకమై చనన్ దిరిగి పావనతన్ గనెనేమొ లేమిఁ దత్
పాపమలాపనోదనముఁ బాపురె! యెట్లు పొసంగు? రాఘవా! 85

తా॥ శాపమున రాయియై పడి చచ్చిన యహల్యకు పాద ధూళితో పునర్జన్మ నిచ్చుటతోనేమో ఆమె పావనురాలై యుండనోపు. లేమి నామె పాపము నెట్లు పాపుటకు వీలున్నది శ్రీరామచంద్రా!

సీతను గాంచ నంత వనసీమల దీనుని వోలె నేడ్చినా
వేతెరఁ గీవు చాకినుడి నెప్పుడునున్ గననట్లు జానకిన్
స్వేతరవన్యసీమల ఋషిప్రథితాశ్రమవాటిఁ బుత్తు నీ
చేతన చారుపుష్పరససింధువొ? వజ్రసమంబొ? రాఘవా! 86

తా॥ సీతాపహరణ మొనర్చినప్పుడు దీనుని వోలె చెట్టు గుట్టలు వెదకి యేడ్చినావు. చాకివాని మాటతో తిరిగి స్మరింపకుండ పరిత్యజించితివే, నీ హృదయము సుమసుకుమారమా? వజ్రకఠోరమా? శ్రీరామా!

మృగమదపుండ్రలక్ష్మమును, ముద్దగు నిద్దపునవ్వువెన్నెలల్
సొగసగు దంతతారకలు సుందరభృంగకమేఘసంతతుల్
అగణితదోషహారితజపాధరసంధ్యయు సత్కృపాబ్ధిపూ
రగతులు రామచంద్రుఁడన రాజిలఁ జేసెను నిన్ను రాఘవా! 87

తా॥ కస్తూరి పుండ్రమే నల్లని మచ్చగా, తెల్లని నవ్వులే వెన్నెలలుగా, సొగసగు దంతములే తారకాపంక్తులుగా, ముంగురులే మేఘములుగా, దోషాపహార మొనర్చు అధరమే ప్రాతస్సంధ్యగా, సత్కృపయే సముద్రరూప జన్మస్థానముగా రామచంద్రా! నీకును చంద్రత్వ మన్వయించు చున్నది.

పురుషమనోహరోల్లసదపూర్వకళామయదివ్యరూప! ని
ర్జర నరదైత్యసన్నుతవిశాలయశోన్వితసుప్రతాప! శ్రీ
ధరణిసుతామనోజ్ఞముఖతామరసామరభానుదీప! సుం
దరదరహాసవేషకరుణాహృతసన్మునితాప! రాఘవా! 88

తా॥ పురుషుల వలపించు సుందర రూపము గలవాఁడా! దేవదానవ మానవాదులు స్తుతించ నొప్పు ప్రతాపముఁ గలవాఁడా! సీతాముఖ పంకజమునకు భానురూపుఁడవైన వాఁడా! చిరునవ్వు చంద్రునితోఁ గూడిన కరుణాసముద్ర శైత్యముతో మునుల తాపమును హరించిన రాఘవా!

అఘసంకీర్ణుఁడ నేను నీదరికి రా నాసించుటే? కాంచఁగా
లఘుకుల్యల్ వరనీరధిన్ గలియఁగా లంఘించ నేమౌను నో
రఘువంశాంబుధిపూర్ణచంద్ర! గురుపద్రాజీవసంవాసినై
లఘుకుల్యల్ నదిఁజేరి యబ్ధిఁ జను లీలన్ గాంతునిన్ రాఘవా! 89

తా॥ పాపవ్యాప్తి కల నేను నీ సన్నిధికి రాజూచుట నీలో లీనముగాఁగోరుట లొక పిల్లకాల్వ సముద్రమునకు పయనించుట వంటిదే. కాని ఓ రాఘవా! గురుపాద సమాశ్రయణము వలన, చిన్నకాలువ నదిలోఁ గలిసి సముద్రమున లీనమైనట్లు నీలో సారూప్యము జెందఁగలను శ్రీరామచంద్రా!

శేషుఁడు లక్ష్మణుండు తన జిహ్వ జయించియె కాలుఁ గెల్చె దు
ర్భాషుఁడు చాకి శ్రీజనకరాట్సుతఁ దిట్టిన నామె వీడి సం
పోషితబ్రహ్మచర్యగతిఁ బూవిలుకాని జయించితీవు, న
న్వేషితనిర్జితేంద్రియులె నిర్జరనాథులుగాదె? రాఘవా! 90

తా॥ శేషుఁడైన లక్ష్మణుఁడు నీ సేవలో నుపవసించి జిహ్వను గెల్చినవాడై, నీవో చాకిమాటలకు సీతను విడిచి బ్రహ్మచర్య మూని మన్మథుని గెల్చినవాఁడవై దేవత లైతిరి. నిర్జితేంద్రియులే కదా నిజమైన దేవతలు శ్రీరామచంద్రా!

ఖరకరు వేఁడి సంద్రమునఁ గల్గిన నీరు నదృశ్యరీతి నా
విరిని బొనర్చి యాకసపువీధి ఘనాకృతి నాడఁజేసి యు
ర్వరపయిఁ గూలఁజేసినటు ప్రాణులకెల్లను నీదుకాంతి తా
వరుసగ సృష్టివృద్ధిలయవైకృతి నిచ్చును గాదె? రాఘవా! 91

తా॥ సూర్యశక్తి సముద్రములోని నీరు నావిరి చేసి, ఆవిరితో మేఘ నిర్మాణమొనర్చి యాకసమున నాడించి భూమిపయి కూలద్రోసినటులు ఈ సమస్త ప్రాణులకు నీ కాంతియేకదా! సృష్టిస్థితిలయరూపకమై యొప్పియున్నది శ్రీరామా!

కర్మంబే యొక పాత్ర, దాని కొలతన్ గష్టంబునున్ సౌఖ్యమున్
నిర్మాణం బొనరించుకొంచుఁ గుడుచున్ నిర్బంధతన్ బ్రాణి యీ
మర్మం బాత్మ నెరింగియున్ సకలసంపత్సారసౌభాగ్యముల్
శర్మాపాదక మౌత! నాకె యను నాశం గొందునే? రాఘవా! 92

తా॥ కర్మమే ఒక పాత్ర. ఆ పాత్ర కొలతతోనే ఈ ప్రాణి కష్టసుఖప్రారబ్ధ భోగముల తెచ్చుకొని యనుభవించును. ఇదితెలిసియు సకలసంపదలు నన్నే వలచి నాకే సుఖ మీయ వలయునని దురాశ గల్గియుండును శ్రీరామచంద్రా!

కక్కురితిన్ గపోతి యెఱకై యరుదెంచి వలన్ దగుల్కొనెన్
రెక్కలురాని పిల్లలవి రేయిఁబవళ్ళను మేఁతకేడ్చెడిన్
బ్రక్క మహీజశాఖ మగపక్షియు పెంటిని జూసి యార్చెడిన్
దిక్కెవ రీ మమత్వతరుదిష్టఫలమ్ము లివింతె రాఘవా! 93

తా॥ మేత కక్కుర్తితో పావురము వచ్చి వలఁ దగుల్కొన్నది. రెక్కలు రాని పిల్లలు రేఁబవళ్ళు మేతకై యేడ్చుచున్నవి. ప్రక్క వృక్ష శాఖపై మగపక్షి ఆడపక్షిపైఁగల మమతచే అరచుచు ఏడ్చుచున్నది. ఈ మమతావృక్షఫలము అంతములో విష ప్రదములే కదా శ్రీరామచంద్రా!

దేహము లస్థిరంబులను తీరు లెరింగియు దారపుత్ర దు
ర్మోహము పాసిపోదు, సతముం బ్రదుకుం గలదంచు నెంచుచున్
ద్రోహ మొనర్తు నన్యులకు దోషము లన్నియు ముల్లెగట్టుదున్
మోహనరూప! నా హృదయమున్ స్థితప్రజ్ఞ మొనర్పు రాఘవా! 94

తా॥ దేహము నశ్వరమని తెలిసికొని దారపుత్రమోహమును తీసివేయఁ జాలనైతిని. నా బ్రతుకు సర్వకాలము లుండునను దురాశచే నితరులకు ద్రోహ మొనర్చుచుంటిని. నా జ్ఞానమును స్థిరముగా నుండునట్లొనర్పుము రాఘవా!

ఒక్కఁడు రూపయుక్తుఁడను, నొక్కఁడరూపుఁ డటంచు నెంచు, వే
రొక్కఁడు లేఁడు దేవుఁడను, నొక్కఁడు స్త్రీయను బూరుషుం డటం
చొక్కఁడుఁ బల్కు విష్ణువను, నొక్కఁడు కాదు శివుండటంచుఁ దా
నొక్కఁడనున్, సమస్తమున నొక్కఁడవౌ నిను గొల్తు! రాఘవా! 95

తా॥ ఒకఁడు దేవుఁడు సాకారుఁడనియు, నింకొకఁడు నిరాకారుఁ డనియు, మరియొకడు దేవుఁడు స్త్రీ యనియు, ఇంకొకఁడు పురుషుఁడనియు, నొకఁడు విష్ణువనియు, నొకఁడు శివుఁడనియు పల్కుచున్నారు. నేను సకలమునీవేయని నిన్ను భజించుచున్నాను శ్రీరామచంద్రా!

శివుఁడవు నీవటన్న నుతిఁజేతువుతారకనామురాము, మా
ధవుఁడవు నీవనన్ హరి గదాధరుపూజనొనర్తు, పద్మసం
భవుఁడవె యన్న రామశరబాధితకాకము నోమవైతి, వీ
వెవఁడవో? తెల్యలేను దయ నీవె వచింపుమ శ్రీరఘూత్తమా! 96

తా॥ నీవు శివుఁడ వన్నచో శివుఁడు శ్రీరామచంద్రుడనే నుతి జేయును. నీవు మాధవుఁడ వన్నచో సీతతోఁ గూడి శ్రీమన్నారాయణునే పూజింతువు. బ్రహ్మవు నీవన్నచో రామునిబాణముతో బాధపడు కాకము శరణాగతిఁ జేయ కాపాడలేదు. రాముఁడు శరణాగతరక్షకుఁడు కదా! ఈ త్రిమూర్తులలో నీవెవఁడవో నాకు తెలియదు. నీవే తెల్పుము రామా!

సుందరమూర్తి! లోకనుతసూనృతధర్మపథానువర్తి! మ
ధ్యందినభాస్కరోజ్జ్వలమహాద్యుతిసన్నిభసుప్రతాప శ
త్రుందమదివ్యకీర్తి! జనతోషకపాలనసత్క్రియాజగ
ద్వందిత చక్రవర్తి! రిపువర్గమనస్సమవర్తి! రాఘవా! 97

తా॥ సుందరస్వరూపా! సత్యధర్మపథములలో నడచి లోకస్తుతి పొందినవాఁడా! మధ్యందినమార్తాండునివంటి ప్రతాపముతో శత్రుజయ మొనర్చి కీర్తి వడసినవాఁడా! జనముల పోషించుటలో సంతోషింపఁ జేయుటలో జగత్తు వందనముఁ గొనిన చక్రవర్తి! శత్రుల పాలిటి యమస్వరూపా! రాఘవా!

కనఁబడవేల? నీవొకటఁ గన్పడినంతనె వీఁడఁదేడ తా
ధనపరివృద్ధియున్ మరియు ధాన్యసమృద్ధియు, రాజ్యవస్తు వా
హనఘనవృద్ధిఁగోరునొ యటంచుఁ దలంతె? యవేల నాకు నీ
యనితరదివ్యదర్శనము లబ్బుటలే పదివేలు రాఘవా! 98

తా॥ నీవు కనపడ వేటికి స్వామీ! కనబడినచో వీడు తానదేడ ధనధాన్య వస్తువాహన సమృద్ధిని కోరుకొనునో యను భయమా? నాక వేటికి స్వామీ? నీ దర్శన భాగ్యమే భాగ్యమని ఎంచితిని రాఘవా!

బోటిని జుప్పనాతిని విభో! యొక నాసయె కోసినా వదే
తాటక నొక్క వ్రేటున వధం బొనరించితివౌర! యింత మో
మోటమదేలరా? తెలిసె మూర్ఖత నిన్ గికురింప నోర్తు వె
ప్పాటను భక్తులం గలఁచువారి క్షమింపవు నీవు రాఘవా! 99

తా॥ రాఘవా! చుప్పనాతిని స్త్రీయని ఎంచి యాముక్కును మాత్రమే కోసి వదలితివి. తాటకనో! ప్రాణముల నపహరించితివి. అది మాత్రము స్త్రీకాదా? తెలిసెనులే. నిన్ను మోసగించిన క్షమింతువు గాని నీ భక్తులమోసగించినవారిని ప్రాణములతో విడిచి పెట్టవు.

పరసతి నిన్ను గాంచి చెడుభావనతో నరుదెంచ దానినో
గరిత యటంచు ప్రాణమిడు ఘ్రాణము మాత్రమె కోసినా వటుల్
పరపురుషుండు సీతను గుభావమునం దిలకింప వానిదౌ
శిరములఁ ద్రుంచి సంయమనిఁ జేర్చితి ధర్మమె కాదె! రాఘవా! 100

తా॥ పరస్త్రీ నిన్ను గాంచి చెడుభావనతో వచ్చిన దాని ముక్కునే కోసి విడిచినావు, స్త్రీయనియా? అదే రావణుఁడు పరస్త్రీని వాంఛించిన, వానిచంపివైచి నాఁడవు. పురుషుఁడనియేకదా! అది ధర్మమే యగును శ్రీరామచంద్రా!

రంగద్వైభవ! తావకీనకరుణారమ్యార్ణవం బెంతొ లో
తుం గన్పట్టునొ! నంత యున్నతిని బొందున్ నాదు దోషాచల
మ్ముం గుప్తం బెటు సేయువాఁడ విది, నీ పొంతన్ సదా నేనిటుల్
బంగారానికి బాటురాయిగ సమంబై యుంటి శ్రీరాఘవా! 101

తా॥ వైభవయుక్తుఁడవైన శ్రీరామంద్రా! నీ కరుణాసముద్ర మెంతలోతైనదో నా దోషములకొండ అంత ఎత్తైనది. దీని నెట్లు ముంచివేయఁగలవాడవో? నేను నీ చెంత నెప్పుడు బంగారమును తూచు బాటురాయివలె నుందును, నావల్లనే కదా నీ గొప్పతనపుకొలత శ్రీరామా!

అరయఁ జతుర్దశాంకభువనాళికి నాయకుఁడైన వానికిన్
వరపుఁడ నంచు నాకొకట వచ్చును గుర్వభిమానమప్డు నే
వెరవను బ్రహ్మదేవునకు వేల ప్రభావములన్ వెలార్చినన్
సరకుఁగొనంగఁబో నతఁడు చంద్రుఁడు నింద్రుఁడుఁ గాని రాఘవా!

తా॥ చతర్దశభువనాలకు నాయకుఁడైన శ్రీరామచంద్రప్రభువులవారి పాదదాసుఁడ నని నాకొక గొప్ప యభిమానము వచ్చును. అప్పుడు నేనింద్రుడైనా, చంద్రుడైనా, బ్రహ్మదేవుడైనా లక్ష్యపెట్టకుండా వర్తించువాఁడను రామచంద్రా!

పాపము చేయుఁగాని తన పాపఫలమ్ముల నొందఁ గోరఁ డీ
పాపినరుండు; పుణ్యకృతిఁ బాలనచేయఁడు కాని పుణ్యని
క్షేపసుఖమ్ము లాసఁగొను క్షేత్రము గోక్షురబీజవాపి త
న్నేపగిఁదిన్ రసాలఫల మిమ్మనినన్ సమకూర్చు రాఘవా! 103

తా॥ మనుష్యుఁడు పాపము లొనర్చును. పాపకర్మఫలము లీయ వద్దని వేడుకొనును. పుణ్యకర్మలొనర్చఁడు, పుణ్యకర్మఫలముల మాత్రముఁగోరుకొనును. పల్లేరువిత్తనముల నాఁటి తియ్యని మామిడిపండ్ల నర్థించిన నేరీతి పొందఁగలడు శ్రీరామా!

తలఁప శనైశ్చరుండు చెడుస్థానమునందు వసించు నంచెదన్
కలఁత వడున్ జనమ్ము హరికన్నులలో నొకఁ డర్కుఁ డందులో
వెలసిన పాప సౌరి కదె, విశ్వప్రజాసుఖదుఃఖజాల మో
యలఘుప్రతాప! తావకశుభాశుభదృష్టియె కాదె? రాఘవా! 104

తా॥ శని చెడు స్థానములో నున్నాఁడని లోకులు కలఁతఁ జెందుదురు. హరికన్నులలో నొకఁడు సూర్యుఁడనియు, ఆ కన్నులలోపాపయే శనియనియు, ఇంకొక కన్ను చంద్రుఁడనియు, సతనిపాప బుధుఁడనియు తెలిసిన నీ శుభాశుభదృష్టియే మా సుఖదుఃఖమూల మని నిన్నే భజించుచున్నాము రామా!

తుదయే లేని దరిద్రతాభరము, బంధువ్రాతముల్ విందుకై
యెద వేధించు ఋణాల్, కుటుంబమున నెవ్వెవ్వారికో వ్యాధు, లౌ
షధవైద్యవ్యయ, మేట కాన్పులు, మనస్పర్థల్, సదాయింటిపో
రిది సంసారసుఖమ్ము గంజిఁ బడు గుడ్డీగల్ నరుల్ రాఘవా! 105

తా॥ తుదలేని దారిద్ర్యము ఇంటిలో నున్నది. బంధుమండలి విందులకై సిద్ధముగా నుండును. హృదయమున బాధించు ఋణాలు, కుటుంబములో ఎవరికో ఎప్పుడూ వ్యాధులు, ఔషధసేవకై ఖర్చులు, ఏట ఇంట్లో కాన్పులు, మన స్పర్థలు, సదా ఇంటిలో కలహాలు- ఇదీ గంజిలోఁబడిన గ్రుడ్డి ఈగకు దొరికే సుఖము శ్రీరామా!

సంతతి యున్న శూన్య మగు సంపద, సంపదఁ గల్గు చోటునన్
సంతతి సున్న; సంతతియు సంపద లున్నను వ్యాధి బాధ లా
వంతలు లేకయున్న నొకవైపున రేఁగు కుటుంబసంగర
మ్మింతటి బాధలున్న సుఖ మిద్దియె యంద్రు జనుల్ రఘూత్తమా! 106

తా॥ సంతాన మున్నచో సంపద యుండదు. సంపదలున్న సంతతి శూన్యము. సంతతి సంపద లున్నవారికి వ్యాధి బాధలు. అవిలేకున్న కుటుంబ కలహ ముండును. సంసారములో ఇంతటి బాధ లున్నను ఇదియే సుఖమని ప్రజలు తలంచువారు రామచంద్రా!

సరసిజనేత్ర! సత్యగుణ సాధుచరిత్ర! రమాకళత్ర! సుం
దరసుకుమార! మారశతదర్శనగాత్ర! మహాపవిత్ర! మ
ద్దురితలతాలవిత్ర! భవదుస్తరదుఃఖతమఃప్రసుప్త హృ
త్సరసిజమిత్ర! వార్ధిఘనదర్పవిశోషకపత్ర! రాఘవా; 107

తా॥ కమలములవంటి కన్నులు గలవాఁడా! సత్యగుణములతో నొప్పు చరిత్ర గలవాఁడా! లక్ష్మీ వల్లభా! నూర్ల మన్మథులతో తుల్యమైన చక్కని సౌందర్యముగల శరీర యుక్తుఁడా! పాపలతలకు కొడవలివైన వాఁడా! దుఃఖమను చీఁకటిలో నిదిరించు హృదయ కమలమునకు సూర్యుఁడా! సముద్ర గర్వము నడఁచినవాఁడా! శ్రీరామచంద్రా!

కళకళలాడు నీ నగుమొగమ్మున బూసెడి పారిజాతముల్
తళతళలాడు నీ కనుల తమ్ములు విచ్చెడి చారుతాబ్ధిలో
మిలమిలలీను నీదు మెయి మిన్నులు వన్నెలు దిద్దుకొన్నవో
చెలువుఁడ నీదు సౌరు కనుచేరలఁ ద్రావుదు నేను రాఘవా! 108

తా॥ కళకళలాడు నీ నగుమోములో పారిజాతములు పూయుచున్నవి. తళతళమెరసే నీ కన్నుల సౌందర్యసముద్రములో కమలములు విచ్చుచున్నవి. మిలమిలప్రకాశించే నీ శరీరపువన్నెలో మేఘములు వన్నెలు దిద్దుకొనుచున్నవి. ఓ సుందరుడా! ఇంతటి సౌందర్యమును నేను కన్నుల చేరలుగాఁ జేసికొని త్రావుదును శ్రీరామచంద్రా!

శ్రీరామ స్తవరాజము
సంపూర్ణము.

# శ్రీ స్తవరాజ పంచశతి

(శ్రీవాగీశ్వర్యై నమః)

## శ్రీరంగ స్తవరాజము

శ్రీకరమై మహీజనవశీకరమై భువనైకసేవ్యమై
ప్రాకృతదివ్యమంగళసుపావనవిగ్రహసుప్రసాదమై
ప్రాకటపుణ్యతీర్థవరభాసురమై భవపారగప్రభా
వాకరమైన రంగపురి కంజలి సేసెద రంగనాయకా! 1

తా॥ సంపత్కరమై ప్రపంచజనుల నందరిని వశపరచుకొనునదై లోక మున కెల్ల సేవింపఁ దగిన దొకేఒకటియై ప్రకృతికి అతీతమైనదైన పవిత్రమైన దివ్యమంగళ విగ్రహ సేవను ప్రసాదించునదియై ప్రసిద్ధమైన శ్రేష్ఠమైన పుణ్య తీర్థముగా భాసించునదియై సంసారసాగరపు తీరమును జేర్చు ప్రభావముగలదైన రంగపట్టణమునకు దోయిలించెదను శ్రీరంగనాయకా!

కావేరీజలరూపతన్ విరజ భూఖండమ్మునం బారెఁ, దా
నావైకుంఠమె రంగమందిరమనోజ్ఞాకారమైచేరె, నీ
నీవే యాపరవాసుదేవుఁడవునై నిత్యోత్సవం బేర్పడం
గా విచ్చేయుటఁగూరె, గారుడతురంగా! రంగనాథప్రభో! 2

తా॥ విరజానదియే కావేరీరూపమును ధరించి ఈ భూలోకములో ప్రవహించినది. ఆ వైకుంఠమే మనోహరమైన రంగ మందిరమనే ఆకారముతో నిచటవచ్చి చేరినది. ఈనీవే ఆ పరవాసుదేవుఁడవై నిత్యోత్సవం బేర్పడఁగా నిచటికి వచ్చుట సంభవించెఁగాదా ఓ గరుడవాహనా! రంగనాథప్రభూ!

కావేరీనది చుట్టు నెందు పరిఖాకారమ్ముల౦బోలు సం
భావింపందగు సప్తసుందరదృఢప్రాకారముల్ గ్రాలె సం
సేవింపం దమ గోపురాలయములై శ్రీదుర్గముల్ మీరె శ్రీ
దేవేరిం గొని విశ్వపాలకులుకాదే రంగరాడ్వల్లభా! 3

తా॥ కావేరినదీ కందకమువలె నీ కోటగోడలను చుట్టియుండఁగా సప్త ప్రాకారమ్ములే కోటగోడలుగా మీగోపురాలయములే రాజనివాసములగు కోటలుగా శ్రీలక్ష్మిదేవిని గూడి మీరే విశ్వమును పాలించే మహారాజులగు రంగరాడ్వల్లభులు కదా!

సృష్టికిఁ గారకుండవయి చూపిననే చిదచిత్స్వరూపముల్
వ్యష్టిగ నామరూపముల బాగుగ వీక్ష యొనర్ప వీలగున్
దృష్టికిఁ గానరాక భువిఁ ద్రెళ్ళెడి విత్తుల రూపరేఖలో
వృష్టి యొకింత లేక యెటు పేర్కొన వీలగు రంగనాయకా! 4

తా॥ నీవీ సృష్టికిఁ గారణరూపుఁడవై చూపిననేకదా? వేరువేరుగా నామ రూపములతో చూచుటకీ సృష్టిలో వీలుపడును, అదెట్లనగా, దృష్టికి చూడ వీలుఁ గాక మట్టిలో మట్టిగా కలిసియున్న విత్తుల రూపములు వాని నామములు వాన పడినగాని స్వరూపములు సంతరించుకొని మొలిచి పెరిగి ఇదిఇదియని నిర్ణ యింప వీలుకాదు శ్రీరంగనాయకా!

ఇదమిత్థమ్మని ముక్తకంఠముగ మిమ్మేమిన్కు రూపించు మూ
ర్తిదమౌ పీఁచును టెంక కొబ్బరియు నారేళంబుగా నైనటుల్
చిదచిత్తత్వవపుర్విశిష్టవిభవశ్రీఁ గూరు నద్వైత సం
పద నొప్పారు భవత్స్వరూపమని నే భావింతు రంగేశ్వరా! 5

తా॥ ఇది యిట్లని మీతత్వమును సంపూర్ణముగా మిమ్ముల ఏ వేదము గూడ నిరూపించలేకున్నను నేను మాత్రము పీఁచు టెంక కొబ్బరి మూఁడు కలిసి నారికేళముగా మూర్తీభవించినట్లు మీరుగూడ జడచేతనములగు ప్రకృతిపురుషుల అంగములుగాఁ జేసికొనిన తత్వముల మూఁడింటి నేకతత్వముగా నొనరించు కొని చిదచిత్తులతోఁగూడిన అద్వైతరూపులుగా నున్నారని భావించుచున్నాను రంగనాథా!

విను తనగర్భమందుఁ బ్రసవించుచునే యఖిలాండకోటి న
త్యణువయి సూదిబెజ్జమున సంచితరీతి వసించి వెల్గున
ట్లణువున కంటె నీవణువు వయ్యు మహత్తున కంటెనున్ మహ
త్తనఁగఁ బ్రకాశ మొందెదవు యార్తజనావన! రంగరాడ్వరా! 6

తా॥ ఆకాశము తన గర్భములో అఖిల బ్రహ్మాండముల ప్రసవించి ధరించుచునే అత్యణు రూపము నొంది ఆ యాకాశమే సూది బెజ్జములో నొదిఁగి యొప్పారి నట్లు నీవు అణువునకంటె అణువుగా మహత్తుకంటె మహత్తుగా ప్రకాశమొందుచున్నావు. నీవే ఆర్తుల రక్షించు, రంగనాథ ప్రభో!

వసుమతిఁ బ్రాణికిన్ విషయవాసనదాహ మదెంతఁ గ్రోలినన్
బ్రశమన మొందునే? నదులు బార మహార్ణవ, మింధనాదులన్
మెసవఁ గ్రుశాను, వాత్మల నమేయతఁ గొంచు యముండు తృప్తితో
మసలఁగలారె? వాసనలు మానుట లెట్టులు? రంగరాడ్వరా! 7

తా॥ భూమిలో నీ ప్రాణికి విషయ వాసనల దాహ మది యెంత అనుభవించినను తీరునది కాదు గదా! ఎన్ని నదులు పారుచు వచ్చి తనలోఁ గలిసినను సముద్రమునకు, ఎన్ని కట్టెలు వేసినను అగ్నిహోత్రమునకు, ఎన్ని ఆత్మల నంత మొందించినను యమునకు తృప్తి యున్నదా? అట్లే ఈ వాసనలు తీరు నెట్లు? రంగనాథా!

శ్రీయుతమూర్తి! యాకొలిమిఁ జేరిచి బాగుగ కాచి తీయుచో
నాయసపిండమం దనల మారయ లోపల బైట నుండున
ట్లాయఖిలాండకోటులకు నంతరమందున బాహిరమ్మునన్
మీ యునికిం గనుంగొనెద మేచకవిగ్రహా! రంగనాయకా! 8

తా॥ సంపత్కరమైన రూపముగల ఓ రంగనాథా! కమ్మరివాని కొలిమిలో వేసి బాగా ఎఱ్ఱగా కాచి తీసిన ఇనుపముద్దలో లోపల వెలుపల అంతట అగ్నిహోత్రము వ్యాపించి యుండునట్లు అఖిల బ్రహ్మాండముల లోపల వెలుపలు మీ నివాసమును సర్వవ్యాపిగా నేను గుర్తించుచున్నాను. ఓ నీలమేఘ శ్యామల మూర్తీ! రంగనాథ ప్రభో!

చక్కెర నీటిలోఁ గలిసి సత్వరమే తన రూపె లేనియ
ట్లొక్కెడఁ దానదృశ్యమయి యొప్పును నయ్యది వహ్నితప్తమై
చక్కని రూపుఁ దాల్చునటు స్వామి! తిరోహితుఁడైన నిన్ను తా
మక్కజమౌ తపస్సుల మహర్షులు కాంతురు రంగనాయకా! 9

తా॥ శర్కర నీళ్ళలోఁ గలిసిన తత్క్షణమే తన రూపమును గోలుపోయి అదృశ్యమయి యుండియు అగ్నిచే ఆ నీరు ఇగిరిపోవునట్లు తప్తము చేసిన తిరిగి కనబడినట్లు అదృశ్యుఁడవైన నిన్ను తపస్సనెడి అగ్నితో తాపపెట్టి రూపవంతునిగా మహర్షులు చూతురుకదా, రంగనాథా!

బాలిశులందునున్ సతము ప్రాజ్ఞులలోవలె నుందు వీవు నో
యేలిక! వారి పాపతతు లెప్పుడు నిన్ను స్పృశింపలేవు జ్యో
త్స్నాళియు నాతపమ్ములును తామవి కర్దమరాశి దోఁగ నం
దాలు నశించునే? మలినమైచనునే? ప్రభు! రంగనాయకా! 10

తా॥ రంగనాథా! నీవు మూర్ఖులగు పాపుల లోపలఁ గూడ జ్ఞానులలో నున్నటులే యుందువు. కాని వారి పాపము లెన్నడు నిన్ను స్పృశించలేవు. వెన్నెల, ఎండ పవిత్రమగు భూమిపై వ్యాపించినట్లే బురదఁమీద గూడ వ్యాపించినను ఆ వెన్నెలయైనను ఎండయైనను మలినముఁ జెందుచున్నావా?

పుట్టుకతోనె స్వార్థ మది పుట్టుక నొందెను నా యెడందలో
నట్టులె మేనితో నదియు హాయిగ వృద్ధిని జెందునెందు నీ
పుట్టి పెరుంగు మేను జరవొంది క్షయింపఁగ సాగెఁ గాని మిన్
ముట్టఁగ స్వార్థమో పెరిగిపోవుచునుండెను రంగనాయకా! 11

తా॥ నేను పుట్టినప్పుడే నాలో స్వార్థముఁగూడ పుట్టినది. దేహము పెరుగుచున్న కొలఁది అదియు పెరుగుచున్నది. ముసలితనము రాగానే ఈ శరీరము తాను క్షీణించుచున్నది. కాని, స్వార్థము మాత్రము దేహముతోపాటు క్షీణించక దినదినాభివృద్ధిఁ జెందుచున్నది శ్రీరంగనాథప్రభో!

వరుసన్ వర్షము లేగుచున్న కొలఁదిన్ వాఃపూరకుల్యాస్ఫురత్
సరసీ జీవనముల్ ప్రశాంతగతి నిష్పంకమ్ములై సాగు ను
ర్వ్వరపై మామక జీవనాంచితగతుల్ వర్షమ్ము లెన్నేగినన్
బరఁగున్ సంసృతిపంకసంకరములై పద్మాక్ష! రంగేశ్వరా! 12

తా॥ రంగనాథా! క్రమముగా వర్షములు (వానలు) వెనుకఁబట్టుచున్న కొలఁది నీటితో నిండిన కాలువల చెరువుల నదులలో నున్న జీవనములు (నీళ్ళు) ప్రశాంతముగా తమలో నున్న పంకము (బురద)ను లేకుండా చేసికొని పరిశుభ్రముగా ప్రవహించుచున్నవి. కాని వర్షములు (వత్సరములు) నాకెన్నేగినను నా జీవనములో అనగా బ్రదుకులో సంసార పంకము (పాపము) ఎక్కువ కలిసి సంకరమైపోవుచున్నది - ఎట్లు?

వటదళశాయి! బాలకుఁడవై యొక లీలగ నేల గీత ల
స్ఫుటగతి గీసి మల్ప నవి చోద్యముగాగ ఘుణాక్షర క్రియన్
పటములు గాఁగ మానుదుటి భాగ్యపు వ్రాతలు గాఁగ విశ్వపున్
బటుదరసృష్టి వృద్ధి లయ భాగములై మను రంగరాడ్వరా! 13

తా॥ ఓ వటపత్రశాయీ! రంగనాథా! నీవు బాలకుండవై విలాసముగా పుల్ల తీసికొని నేలపై గీతలు అడ్డదిడ్డముగా గీయుచు ఆడుకొనుటలో ఆ గీతలలో ఘుణాక్షరన్యాయముగా మా నుదుటివ్రాతలు రూపుదిద్దుకొనుచుండుటే కాక ఈ విశ్వపు సృష్టి స్థితి లయములుగా నవి మారుచున్నవి అనఁదోఁచును.

అరయఁ త్రివర్గసౌఖ్యముల కాత్మశరీరములన్ వ్యయించఁగా
దొరకొని వంటకట్టెలకు ద్రుంచితి కల్పతరుప్రకాండమున్
మరియొక జన్మఁబొంది తమమందిరమున్ దరియంగ వత్తు నం
చరసెద నప్డు మానవత నందుట తథ్యమె? రంగరాడ్వరా! 14

తా॥ నిజము విచారించిన నేను ధర్మార్థకామములనెడి త్రివర్గసౌఖ్యము కొఱకై నా శరీరము నంతయు ఆత్మశక్తి నంతయు వ్యయపరచుకొంటిని. ఇది వంటకట్టెల కొఱకై కల్పతరుకాండమును బద్దలుగా కొట్టినట్టులున్నది. మరొక మానవజన్మలో భగవంతుని చేరు మార్గమునకై శ్రమింత మనుకొనినచో వచ్చెడి జన్మయది తాను తప్పకుండా మానవజన్మయే యనుట లేమి నిశ్చయము శ్రీరంగనాథా!

బంగరు మీ చరిత్రమున భాసిలు సద్గుణ రత్నరాసులో
నింగి వెలుంగు తారకలు నే గణియింపఁగ లేను వాని, సన్
మంగళమూర్తి! మీ చెడుగుణమ్ములు లెక్కకు నందవెందు లె
క్కంగొన నొక్కటేనియును గన్పడకుండుట రంగరాడ్వరా! 15

తా॥ రంగనాథా! మీ చరిత్ర మనెడి బంగారములో మీ సద్గుణములను రత్నరాసులు పొదిఁగినట్లున్నవి. అవి ఆకాశములో తారకల వలె లెక్క బెట్ట రానన్నిగా నున్నవి. ఓ మంగళమూర్తీ! అట్లే మీ చెడ్డగుణములు కూడా లెక్కకు అందరానట్లున్నవి. ఒక్కటి కూడా చెడుగుణము లేకపోయెను. ఇక లెక్క పెట్టుట లెట్లు?

మరణముఁ జెందు వ్యక్తి చనె మమ్ముల వీడి యటంచు నేడ్తురీ
నరులిల, నాత్మ యెందు నవినాశికదా! తను వెందు మార్పునుం
బొరయును గాని నాశమును బొందు నెటుల్ ఘట మద్ది భిన్నమై
వరుసగ మట్టియై వరలు వందుర నేటికి? రంగరాడ్వరా! 16

తా॥ ఒక వ్యక్తి మమ్ముల వీడి పోయి చనిపోయినాఁడని యేడ్చెదరు. ఈ మానవులెంత మూఢులు. ఆత్మ తాను వినాశ మొందునది కాదు. శరీరము మార్పుఁ జెందక తప్పునది కాదు. ఇక నాశముఁ జెందుటెట్లు? ఒక కుండ పగిలి ముక్కలై క్రమముగా ఇంకను చిన్న ముక్కలై తుదకు మట్టియై మట్టిలోనే ఉంటుంది. ఆ పదార్థము నాశమైనదని ఏడు పెందులకు?

దాసుఁడ నౌచు నేను తమ దాపున నున్ననె వెల్గుఁగాదె, స
ర్వేశ! భవత్ప్రభుత్వపరివిస్తృతమౌ విభవమ్ము సొమ్మునై
మీ సరసన్ వసించెద నమేయప్రభావ! త్యజింతువెట్లు? నన్
పూసలతోనె సూత్ర మది పొల్చు స్రజమ్మయి రంగనాయకా! 17

తా॥ ఓ రంగనాథా! నేను మీదాసుఁడనై మీవద్ద నున్ననేకదా, మీప్రభుత్వ వైభవము మరింత విస్తరించి వెల్గును? కావున నేను మీ సొమ్మునై మీవద్దనే యుండెదను. నన్నెట్లు పారవేసికొనెదరు? నావంటి పూసలెన్నో దారమువగు నీలో గ్రుచ్చఁబడిననే కదా, నీవనెడి దారము తాను హారత్వమును బొందునది.

అవనిన్ విత్తు నొకండు విత్త నది వేలై వెన్ను నంటున్ వెసన్
దవులం బొప్పఁగఁ బుణ్యపాపకృతు లీదాసుం డొనర్పన్ దమిన్
వ్యవసాయాత్మకకర్మసంగ మిడి మత్ప్రారబ్ధమై యంతటన్
భవబంధ మ్మిడి వెన్నునంటి కుడుపున్ నన్నట్టె రంగేశ్వరా! 18

తా॥ ఒక విత్తును విత్తిన అది వెన్నువేసి వేల విత్తులై యొప్పారును. అట్లే ఈ దాసుఁడు అనేక జన్మల సంబంధముతోఁ జేసిన పుణ్యపాప కార్యములు వ్యవసాయములో నాటిన విత్తు వెన్నునంటి వేల విత్తులైనట్లే కర్మ సంగముతో నున్న నా పుణ్య పాపములును ఒకటికి వేలై వెన్ను (నీవు) నంటి పాసి పోనివై నన్ను నుభవింపఁ జేయునుగదా, రంగనాథా!

కర్మకు నీవలిప్తుఁడవు, కర్మలు జన్మలు నీవి దివ్యముల్
కర్మకు నేను బద్ధుఁడను కన్గొన నొక్కట నేయి జిడ్డు తాఁ
జర్మము నంట తౌడు నిడి చక్కఁగ శుభ్రమొనర్చనౌను నో
శర్మద! జిహ్వనై కుడువ సబ్బున రుద్దు పనేల? రంగరాట్! 19

తా॥ రంగనాథా! నీవు కర్మకు అంటనివాఁడవు. నీ కర్మలు మరియు జన్మలు విలక్షణమైనవి. నేను కర్మ బద్ధుఁడను. నేయి జిడ్డు చేతుల నంటును. ఆ చేయిని తౌడు సున్నిపిండి వేసి కడుగుకొననగును. రుచి సుఖమునిడు జిహ్వపై నేయిపడిన అది తినిన ఆ జిహ్వను సబ్బుతో తౌడుతో శుభ్రమొనర్చు అవసరము లేదుగదా!

నన్ను ననన్యచింతఁగొని నమ్మి భజించిన వాని నేను నా
కన్నులఁ గన్నువెట్టికొని కాచుచునుందును రేబవళ్ళు నం
చన్నవి విస్మరించితివె? యమ్మను నమ్మినచంటిబిడ్డనే
నన్నెము పున్నెముం దెలియ నన్నెటు బ్రోతువొ రంగాధ్వరా! 20

తా॥ అనన్య భక్తితో నన్ను నమ్మి సర్వదా నన్ను భజించు వానిని నేను కన్నులలో కన్ను పెట్టుకొని రేఁబవళ్ళు కాపాడుచుందునని గీతలో నీ వన్నమాట మరచితివా, రంగనాథా! నేను నీవు తల్లివని నిన్ను నమ్ముకొని యున్న చంటి బిడ్డను అన్నెము పున్నెము తెలియని వానిని నన్ను నీ వెట్లు సంరక్షించెదవో? తెలియరాకున్నది.

నాలుగునాళ్ళ జీవితము నా ప్రభు కర్పణసేతు నంచు నం
దా లొలుకన్ మనోజ్ఞగతి నవ్వుచు నాత్మసమర్పణార్థులౌ
పూలయెడంద మీదు పదపూజకె వాసన లొప్ప నామనం
బేల వెలార్చు తుచ్ఛవిషయేంద్రియవాసన రంగరాడ్వరా! 21

తా॥ నాలుగు రోజులుండి పోయే నా జీవితమును నా ప్రభువైన భగవానుని కర్పింతునని అందముగా నవ్వుచు ఆత్మ సమర్పణముఁ జేయుటకు వచ్చు పూల హృదయాలలో మీ పాద పూజ జేయు వాసనలే ఆ సువాసనలుగా నొప్పారుచున్నవి. కాని నా మనస్సను పుష్ప మేటికో తుచ్ఛములైన విషయ వాసనల విరఁజిమ్ము చుండును, రంగనాథస్వామీ!

శ్రమపడి లక్ష్య మంట విసరన్ వడి నిల్వక పర్వులెత్తి, హ
స్తమునకు నందకుండఁ జను చంచలకందుక మీమన మ్మనన్
జెమరుచు చేతి వ్రాతవలె చెప్పిన దప్పుడె విస్మరించు చుం
డు మతియు వీని నమ్ముట లెటుల్ దయఁజూడవె రంగరాడ్వరా! 22

తా॥ శ్రమచేసి లక్ష్యమునకు తాకునట్లు విసరినను అచట నిల్వక పరుగులు పారుచు చేతికందకుండు చంచలముగా పోవు చెండు నా మనస్సు. ఇఁక చెమట పెట్టు చేతివ్రాత వలె ముందు వ్రాయుచు పోగా వెనుక నుండి చెమటలతో చెరుపుచు వచ్చునట్లు చెప్పిన జ్ఞానము నప్పుడే మరచు నా బుద్ధి స్వామీ! వీని నమ్ముట లెటులు? దయ నాపై ప్రసరింపఁజేయవే రంగనాథా!

నేనొక పక్షినై యెగసి నీకడకుం బరతెంచ నెంచినన్
దానది నీవికుంఠభువిదర్శన మబ్బునె నేను మీనమై
కానగ వత్తు నిన్ననినఁ గన్బడు నెట్టులు క్షీరవార్ధియున్
నే నిను గాంచ రంగపురి నిల్చితె సత్కృప రంగరాడ్వరా! 23

తా॥ నేనొక పక్షినై యెగసి నీ వద్దకు రాఁదలఁచు కొన్నను తానా వైకుంఠ లోకము దర్శనము దొరుకునా? నేనొక చేపనై నిన్ను చూచుటకు పయనించి వత్తమన్న ఆ పాల సముద్రమైనను కనబడునా? స్వామీ! రంగనాథ ప్రభూ! నేను నిన్ను దర్శించుకొన సులభముగా వీలుపడునని తలంచి రంగపురిలో నిల్చిపోయితివా, తండ్రీ!

విత్తము తోడ గెల్చుటకు వీలెది నిన్ను రమాధినాథునిన్
సత్తను జూపి గెల్తుమనఁజాలుదుమే నిను విశ్వపాలు వి
ద్వత్తు వెలార్చి గెల్చుట లబద్ధము నిన్ బరతత్వరూపునిన్
బత్తి ననన్యముం గన నవశ్యము వశ్యుఁడ వీవు రంగరాట్! 24

తా॥ లక్ష్మీనాథుఁడవగు నిన్ను విత్తముతో గెలువ తరమా? బలముతో నిను గెలుతుమనిన విశ్వమంతటికి దొరవగు నిన్ను గెలుచుటలు కల్ల. విద్యావిజ్ఞానములఁ జూపి నిన్ను గెల్తుమనిన పరతత్వస్వరూపుని నిన్ను వేదములే చెప్పలేవు. నేనెంత? అర్థబలముతో అంగబలముతో విద్యాబలముతో నిన్ను ఎన్నడును గెల్వలేము. అనన్యభక్తికే నీవు తప్పక వశుఁడ వగుదువు, శ్రీరంగనాథా!

భిన్నమతాల జాతులకు భేద మెటున్నను నిర్గుణుండుగా
నెన్న పరాత్పరుం డొకఁడె, యెప్పుడు తా సగుణత్వ మొందుచో
భిన్నవిభిన్నరూపముల వెల్గును; పక్షుల రంగులేవి యే
నెన్నఁగ గ్రుడ్లరూ పొకటె, ఏర్పడు పిల్లలు వేరె రంగరాట్! 25

తా॥ వివిధ విభేదాలు గల జాతులు మతాలు ఏవి ఎట్లున్నను నిర్గుణ రూపముతో నున్న దేవుడవైతే అందరికి నీవొక్కడివే. సగుణరూపముతో దర్శనమివ్వఁ దలచిన అనేకరూపాలుగా సాక్షాత్కరించెదవు గ్రుడ్లరూపముఁ జూచిన రూపములేక అన్ని గ్రుడ్లరూ పొక్కటే, రూపములున్న పక్షుల రూపులు భిన్నముకదా! శ్రీరంగనాథా!

చక్కదనాల మో మెద విశాలము, జానువు లంటు బాహువుల్
చెక్కిన శిల్పమ ట్లొడలు చేరెడు చేరెడు కండ్లు నవ్వినన్
చుక్కల నీను పల్వరుస సొంపులు వంపులు దీరు ముక్కు, మీ
కెక్కడ దృష్టి సోకునొ యొకించుక గాంచిన రంగరాడ్వరా! 26

తా॥ చక్కదనములన్ని ఒక్క దిక్కునకు వచ్చినట్లున్న నీ ముఖము, మోకాలు వరకు వ్రేలాడు దీర్ఘబాహువులు, చెక్కిచేసిన శిల్పవిగ్రహమువంటి ఒడుపైన దేహము, చేరలంత కండ్లు, నవ్వినపుడు చుక్కల చేరువలె కనఁబడు పలువరుస, సొంపులు బయల్పడు నట్లుగా వంపులు దీరియున్న నీముక్కు--ఇట్లు వర్ణిస్తూ కనురెప్ప వాల్చక మిమ్ము చూచిన మా దృష్టి నీకు సోకునేమో స్వామీ! రంగనాథా!

శ్రీరాజిల్లు లసద్భుజాంతరతటిన్ జెల్వారు శ్రీకౌస్తుభా
కారంబుల్ గన పూర్వశైలతటసాక్షాద్భూతబాలార్కశో
భారక్తిం గలిగించు దాసనయనాబ్జశ్రీవికాసప్రభా
పూరంబుల్ ప్రవహింప నాదు కయిమోడ్పుల్ రంగనాథప్రభో! 27

తా॥ లక్ష్మీదేవితో నొప్పు సుందరవక్షస్థలము ఒప్పారు నీ కౌస్తుభమణిని గాంచిన తూర్పు దిశలో సాక్షాత్కరించిన బాలసూర్యుని రక్తిమను గలిగించుటే కాక దర్శించు దాసుల నేత్రకమలముల వికసింపఁజేయు కళలను ప్రవహింపఁ జేయుచున్నది. అట్టి నీ వక్షస్థలమునకు నాకేల్మోడ్పు లర్పింతు రంగనాథా!

తిలకమదమ్ము క్రొంజెమరు తేమ నొకించుక జాఱ దానితో
నలికమునందు ముంగురులు నట్టిటు దాఁగురుమూఁతలాడఁ గుం
డలమణికాంతి గండముల నాట్య మొనర్చుచు సుస్మిత ద్యుతిన్
వలపులఁ గూడఁ గన్దొవ కృపాబ్ధిని వీడుచు నాడు రంగరాట్! 28

తా॥ తిలకముగా సవరించిన కస్తురిచుక్క చిరుచెమటల తడికి ఒకింత జారఁగా ఆ ఫాలతలముపై ముంగురులు అట్టిటు వ్రాలి దాఁగురుమూఁతలాడఁగా, కుండలముల మణికాంతి చెక్కులపై నాట్యమాడుచు చిరునవ్వు లొలికించు వలపులఁ గుమ్మరింపఁగా నీ కనుదోయి దయాసముద్రములో ఈఁదాడుచున్నవి రంగనాథా!

చక్షుశ్శ్రోత్రవిభుండు తావకవపుస్సౌందర్యసారామృతం
బక్షీణంబగు కాంక్ష హెచ్చ ద్విసహస్రాక్షిప్రభాలోకనన్
నిక్షేపంబటు గ్రోలి తృప్తిఁదనర న్నేనంచు వేమోములన్
వీక్షింపం జనుదెంచు భక్తజనుల న్వేరీతు లూరించెడిన్. 29

తా॥ ఆదిశేషుఁడు నీ శరీరసౌందర్యసుధలను తరుగని కోరికతో రెండు వేల కంటి చూపులతో పెన్నిధిని వలె గ్రోలుచు ఎన్నటికిని నాకు తృప్తి కలుగుచు లేదని వేయిమోములతో, నిన్ను వీక్షింప వచ్చిన భక్తులను వేయిరీతుల ఊరించుచున్న ట్లగపడు రంగనాథా! అనంతకాలమునుండి అనంతుఁడు నిన్ను దర్శించుచు తృప్తినొందఁడే? ఇట్లే దర్శించిపోవు మా భగవదనుభవమెంత ప్రభూ!

ఉదరదయామృతోదధి మహోర్మికలై వళులొప్ప వానిపై
ముదమగు తారహారముల ముద్దగు నుర్వులు పర్వులెత్త సొం
పుఁ దనరు సుళ్ళరూ పమరు పొక్కిలితో నయనాబ్జజీవన
ప్రదమయి యుంట దాని నెడఁబాయవు దృక్కులు, రంగరాడ్వరా! 30

తా॥ ఉదరమనెడి దయాసముద్రములో అలలై వళులొప్పఁగా వానిపై ఆడుచుండు ముత్యాలహారములో అలలపై తెల్లని నురువులై ముద్దుగా పర్విడుచుండఁగా చక్కని పొక్కిలి (బొడ్డు) సుడివలె కనబడఁగా భక్తుల కన్నులనెడి కమలములకు జీవనముల (కమలముల రక్షించఁదగిన నీరు) నొసంగునదై యుండుట నా చూపులు నిన్నెడఁబాయఁ జాలవు రంగనాథా!

హస్తివిపన్నివార! కరియట్టులె నే భవసాగరమ్మునన్
నిస్తులమోహదాహమున నీచమమత్వజలగ్రహగ్రసన్
మస్తకయుక్తి జ్ఞానలవమాత్రవిహీనుఁడనై చరింతునే
హస్తయుగమ్ము నెత్తి బహుళార్తినివేడెద, రంగరాడ్వరా! 31

తా॥ ఏనుఁగు ఆపదను నివారింపజేసినవాఁడా! ఓ శ్రీరంగా నేను గూడ ఏనుఁగు వలెనే సంసారమనెడి సరస్సులో తులలేని మోహమను దప్పితో మమత యనెడి మొసలిచే తలబట్టి యీడ్వఁబడిన వాఁడ నగుట వివేకములేనివాఁడనై చరించుచున్నాను. నా రెండుచేతుల నీకు నమస్కరించు చున్నాను. ఆర్తితో వేడు కొనుచున్నాను రక్షింపుము రంగరాజా!

సౌందర్యార్ణవదుగ్ధమున్ స్మరసుమాస్త్రవ్రాతముల్ బిట్టు నా
నందో బ్రహ్మ యటన్న నాద మొలయన్ ద్రచ్చన్ భవద్రూపపా
త్రం దీపించు సుధాభిధాననవనీతస్నిగ్ధరాకాశశిన్
కందోయిం గల తారకల్ వలచె నే గాదందునా? రంగరాట్! 32

తా॥ సౌందర్యసముద్ర మనెడి పాలను మన్మథుని బాణము లనెడి కవ్వము "ఆనందో బ్రహ్మ" అనెడి నాదమ్ము చుట్టఁగా తరచి తీసిన వన్నెరూపపాత్రలో ప్రకాశించఁగా నీ వదనచంద్రుని నా కన్నులనెడి తారకలు వలచి వచ్చి దరిఁజేరి పోజాలకున్నవి. చంద్రుని తారకలు (కంటిపాపలు) వలచుట సహజము. నేను కాదనుటెట్లు ప్రభూ. శ్రీరంగనాథా!

మోహనరూప కల్పలత మొగ్గలు పూవులు విచ్చు రూపుతో
స్నేహ మొనర్చు గాత్రరమ శిల్పకళాంబుధి ద్రచ్చ వారిజో
ద్వాహకసుస్మితాననము దర్పకునైనను చిన్నబుచ్చ, ది
గ్వాహినులం దపాంగతతి కైరవమాలలఁ గూర్చు రంగరాట్! 33

తా॥ మోహనకరమగు రూపమనెడి కల్పలత మొగ్గలు పూవులు విచ్చి నట్లు స్నిగ్ధతను శోభలతో శరీరము శిల్పకళాసముద్రమును తరచి తీసిన సార మట్లుండఁగా కమలము వికసించి నట్లున్న చిరునవ్వుతోఁ గూడు మొగము మన్మథుని వంచన సేయఁగా దిక్కులలో చూపుల శోభలు కలువపూల మాలలుఁ గ్రుచ్చినట్లు పంక్తులుఁ దీర్చుచుండఁగా నొప్పు ఓ చక్కని రంగనాథ స్వామీ!

సౌందర్యావని కెల్ల మారజనకస్థామ్ము నీ పొట్టఁ దా
నం దూగాడెడి హారహీరమణిసంతాన మ్మజాండోత్కరా
లం దీపించు నుడుచ్ఛటాన్వితవినీలవ్యోమసీమాకృతిన్
గందోయిం గనిపించె విశ్వసృజునిం గన్నయ్య రంగేశ్వరా! 34

తా॥ నీ పొట్ట సౌందర్యప్రపంచమునకు సీమాభూమి, మన్మథుడు పుట్టిన చోటు దానిపైఁ దూగాడు హారములలోని వజ్రవైడూర్యాదికరత్నములు బ్రహ్మాండములపై నల్లని యాకాశములో తారకల సమూహము ప్రకాశించు చున్నట్లు కందోయికి కనిపించుచున్నవి. బ్రహ్మదేవునే నీ పొట్ట తాను కన్నది కదా, రంగనాథా!

ధరణిన్ దారసుతాలయార్థఘనతాద్రవ్యమ్ముల న్నమ్ముచున్
పరసౌఖ్యంబులె లేవటంచు మమతన్ బాధం బడున్ మూఢుఁడే
నరణిం దాను స్తనంధయుండు జననీస్తన్యమ్ములం గ్రోలుచున్
మరి వేరొండు పయోధర మ్మలరుటన్ భావించఁడో రంగరాట్! 35

తా॥ ప్రపంచములోని భార్యాబిడ్డలను గొప్పఁదనమును ధనములను నమ్ముకొని పరలోకసుఖములే లేవనుచు మమతతో వివేకహీనుఁడై బాధపడును. ఈ జీవుఁడు ఒక చంటిలోని తల్లిపాలను గ్రోలుచు రెండవప్రక్క పయోధరము వేరొకటి కలఁదని చంటిపాప భావించకున్నట్లు ఉండును గదా, రంగనాథా!

అరయ నుదుంబరావనిరుహమ్మవు నీవ విరాట్స్వరూప! యా
తరుఫలరాజి విశ్వముఖదర్శితదివ్యదజాండకోటి, త
త్ఫలపరిదీప్త కీటక వితానమె ప్రాణిచయమ్ము పూయకే
యలరు ఫలాప్తి నీతలఁచి నంతనె రూపిలు సృష్టి రంగరాట్! 36

తా॥ నీవొక మేడిచెట్టువు. ఓ విరాట్స్వరూపా! ఆ చెట్టు ఫలములే సకల బ్రహ్మాండములు. ఆ ఫలములలో దీపించు కీటక సమూహమే ఆ బ్రహ్మాండముల వెలుఁగుచుండు ప్రాణికోటి. పూయకుండనే కాచెడి కాయలు సంకల్పంతోనే నిర్మింపఁబడు బ్రహ్మాండములై రూపొందినవి రంగనాథస్వామీ!

జాయాపుత్రమమత్వబంధ మిదు నీసంసారము న్నమ్మువాఁ
డో యెందున్ శ్రమలొందు దీనుఁడగుఁ దానోడుం బ్రపంచాజిలో
నీ యంఘ్రిద్వయ మాశ్రయించు నెడలన్ దీనుండు ధీరుండగున్
శ్రేయోదాయకమౌ పరార్థసుఖముల్ చెందున్ సదా రంగరాట్! 37

తా॥ భార్యా పుత్రులపైన గల మమతతో తనను గట్టివేయు ఈ సంసారమును నమ్మికొని యుండువాఁడెప్పుడు కష్టముల పాలై ప్రాపంచిక యుద్ధములో దీనుఁడై తానోడి పోవును. నీ పదయుగము నాశ్రయించిన వాఁడో దీనుఁడైనను ధీరుఁడగును. శ్రేయస్సును గూర్చు పరలోక సుఖములఁ జెందును శ్రీరంగనాథా!

చదువదియో పరార్థసుఖసౌధముఁ జేర్పఁగ బోధసేయుచున్
విధి సదసద్వివేకముల వేమరుఁ జెప్పుచు దారిఁ జూపినన్
చదివియు దాని నాచరణ సల్పని పండితుఁడన్న చేతిలో
సదమలదీప ముండి వృధ సల్పెడి యంధుఁడు, రంగరాడ్వరా! 38

తా॥ పారమార్థిక సుఖ సౌధమునకు దారి చూపించుచు సదసద్వివేకముల విధిగా బోధించునదే చదువు. ఆ చదువులు చదివి దానిలోని ధర్మముల నాచరణలో పెట్టఁజాలని పండితుఁడన్ననో చేతిలో దీపముఁ బట్టుకొనిపోవు అంధుఁడు గదా, రంగనాథాప్రభూ! ఆ దీప మది ఇతరులకు అవసరపడునదే కాని తనకై యవసరపడదు గదా!

అర్థమునెంతఁ గూర్చినను నజ్ఞుఁడ నైతిని జన్మ స్వార్థతన్
వ్యర్థముగా గతించెఁ బరమార్థము నుంత గడింప దేహమే
సార్థకమయ్యె ఘోరభవసాగర మీదఁగఁ నావఁ జిక్కె వే
దార్థములేమొ తెల్సినటు శాంతి లభించెను రంగరాడ్వరా! 39

తా॥ అర్థమును (ధనమును) ఎంతఁ గూర్చినను జన్మసార్థకముఁగాక వ్యర్థముగా గతించెను. పరమార్థమును కొంచెమేని గడించినచో జన్మసార్థకమైన దయ్యెను. సంసారసాగరము నీఁదుటకు ఓడ చిక్కెను. వేదార్థము లేవో తెలిసి నట్లు మనస్సుకు శాంతి లభించెను రంగనాథా!

ఇసుకను చక్కెరం గనఁగ నేకవిధమ్మునఁ గానిపించు నా
యిసుక జలమ్ములం గరుఁగ దేండ్లకొలందిగ నాని పొత్తు తా
పొసఁగిన యంత నీరమయి పోవును చక్కెర మానవాళిరూ
పసమత నుండనేమి? హరిభక్తిరతుల్ స్థితులయ్యె! రంగరాట్! 40

తా॥ ఇసుకను శర్కరను చూచినచో రెండును ఒకే విధముగా గనిపించును. ఆ యిసుక మాత్రము నీటిలో నేండ్లకొలఁదిగా నున్నను కరుగక అట్లే యుండెను. శక్కర మాత్రము నీటితో పొత్తుగలసి నంతనే కరఁగిపోయి నీళ్ళు అయిపోయెను. రూపము లందరివియును మనుజులవే. అందు హరిభక్తిలో కరిగి పోయెడివారు మధురమగు చక్కెరవంటివారు రంగనాథా!

ఫలమది కుళ్ళిపోయి తన ప్రక్కల ప్రక్కల నున్న బుట్టలో
పలఁగల పండ్ల నెల్ల సహవాసగుణాప్తిని కుళ్ళఁజేసిన
ట్లిలపయి నేను నట్టులె నిహీనగుణంబులఁ ద్రెళ్ళ నాదు మి
త్రుల పతితాత్ములం సలిపి రూపరజేసితి రంగరాడ్వరా! 41

తా॥ ఫల మొకటి తాను కుళ్ళిపోయి బుట్టలో తన ప్రక్కప్రక్కల నున్న పండ్ల నన్నిటిని సాహచర్యగుణముతో కుళ్ళ జేసినట్లే ప్రపంచములో నేను గూడ చెడుగుణములతో నశించుచు నా మిత్రులను గూడా పతితులను జేసి నశింపఁజేసినాను రంగనాథప్రభూ!

ఉన్నతమౌ మహాపదవి నుండి యిదే యొక స్వర్గసీమ యం
చెన్నగ నేనె యందలి మహేంద్రుఁడ నంచుఁ దలంచుచుంటి నా
యున్నత పీఠి వీడఁ దలనొక్కెడ వీడు శిరోజముం బలెన్
నన్నెవ రడ్గరైరి యవినాశపదమ్మిడఁ గొల్తు రంగరాట్! 42

తా॥ ఉన్నత పదవిలో నుండి అదే ఒక స్వర్గమని భావించుచు అందలి మహేంద్రుఁడ నేనేనని విఱ్ఱవీఁగు చుంటిని ప్రభూ! ఆ ఉన్నత పీఠము విడిపోయి నప్డు తలనుండి విడిపోయిన వెంట్రుకవలెఁ జూచి నన్నెవరును అడుగరైరి. అందులకే నీదగు నశించని పదమును నాకిమ్ము శ్రీరంగా!

తరుణికి నాథుపై నటులె తల్లికిఁ బుత్రునిపైనె చిత్త మె
ప్డిరవుగ నుండియున్ వరుస నెల్ల పనుల్ పొనరింతు రెట్టులో
సరసిజనాభ! నాకటులె స్వాంతము నీపయినుంచి సంసృతిన్
నెరపెడి శక్తిఁ గల్గఁ బొరి నీ పదభక్తి నొసంగు రంగరాట్! 43

తా॥ యువతికి తన నాథునిపై మనస్సుండియును, తల్లికిఁ దన చిట్టి బిడ్డపైనే ఎప్పుడును చిత్తముండియు క్రమముగా ఇంటి పనులెల్ల చేసికొనుచు నెట్లుందురో అట్లే ఓ కమలనాభా! నా మనస్సును గూడా సదా నీపై నుంచి సంసార కార్యక్రతువుల నిర్వహించెడి నీ పదభక్తి నిమ్ము.

కర్మ మొనర్చు పట్ల నిను గాంచమి నేనధికారి నంచు నా
ధర్మము వీడి దుఃఖిలితి దాసుఁడ నంచుఁ దలంతు నిప్డు నీ
మర్మ మెరింగి నిన్ దెలిసి మత్సరమున్ విడి సౌఖ్య మందితిన్
నిర్మమతన్ గదా జగతి నిర్మలముక్తి ఘటించు రంగరాట్! 44

తా॥ కర్మలు చేయునప్పుడు నిన్ను తెలియక నేనే అధికారినని ధర్మ రహితుఁడనై దుఃఖించితిని. ఇపుడు నీకు దాసుఁడ ననెడి మర్మమును దెలిసికొని నీ గొప్పతనమును గుర్తెరింగి మమతల వీడి మాత్సర్యమును బోనాడి కర్తవు నీవే కర్మాధికారము నీదే యనుకొని నిర్లిప్తుఁడనై సుఖముగా నుంటిని ఈ నిర్మమత్వమేకదా ముక్తి ఘటింపఁ జేయునది ఓ రంగనాథా!

కర్ణములందుఁ బ్రాకృతికగాథల నూరక నూరిపోయు నా
దుర్ణయశాలురం గలిసి దుస్తరబద్ధుఁడనై నశించితిన్
కర్ణుఁడు శల్యు సారథినిగాఁ గొని యాత్మవినష్టి నొందె నో
పూర్ణమహత్వ! నిన్ సఖుని బొంది నరుండు తరించె రంగరాట్! 45

తా॥ కర్ణములలో ఊరక ప్రాకృతవిషయములనే నూరిపోయు నీతిబాహ్యుల చెలిమిచేత బద్ధుఁడనై నశించితిని. కర్ణుఁడు శల్యుని సారథిగాఁ జేసికొని ఆత్మనాశము నొందినట్లు నిన్ను సఖునిగాఁ జేసికొని నరుఁడు తాను తరించెనుగదా రంగనాథా!

ఒక్కెడ సర్వజీవతతి నున్నది నీవె యటంచు గొల్చు నీ
చొక్కపు భక్తుఁ డాపదల స్రుక్కియు శీలము వీడకుంట తా
నెక్కువ వాసికెక్కు మెఱుఁగెక్కును గాదె పసిండిగిండి మేల్
చెక్కడ మొంద పోగరల చెక్కుల నొక్కు లెసంగి రంగరాట్! 46

తా॥ నీ వొక్కఁడవే సకలజీవులలో నున్నవాఁడ వని నిను గొల్చుచుండు నీ భక్తుఁ డాపదలలో చిక్కియు శీలము వీడనివాఁడై వన్నెవాసిం గాంచి కీర్తి కెక్కును. పసిడి భృంగారము చక్కని చెక్కడము నొంద పోగరలతో నొక్కఁబడి చెక్కఁబడుట సహజమేకదా రంగనాథా!

భవహరమౌ త్వదీయమృదుపాదసమాశ్రయణం బొనర్చియే
నవధియె లేని సంసృతిమహాబ్ధి తరింపఁగ జంక నేలరా?
సువిబుధసేవ్యవిష్ణుపదసుందరసీమఁ జరించు పక్షికిన్
మివులు మహాబ్ధిదాఁట భయమే? వరదాయక! రంగనాయకా! 47

తా॥ పాపహరమైన నీ పాదముల నాశ్రయించినవాఁడు అవధిలేని సంసారసాగరమును దాఁటుటకు భయము జెందనేల? దేవతలచే సేవింపఁబడు రంగనాయకా! విష్ణుపద(ఆకాశ)సీమలలోఁ జరించు పక్షికి సముద్రము దాఁటుటకై భయమెందులకు? ఓ వరదాతా! రంగనాథా!

సరసిజనాభ! మాయ, యఘసంయుతు నన్ను స్పృశించుఁ గాని నీ
దరిఁ బరతెంచి నిన్నొకటఁ దాకఁగ నేకరణిన్ సమర్థమౌ!
ఖరకరు కాంతిసంతతులఁ గప్పి యదృశ్య మొనర్చు మేఘ మా
తరణిప్రదీప్తిబింబమును దాఁకఁగఁజాలునె? రంగనాయకా! 48

తా॥ రంగనాథా! పాపములతో కూడుకొనిన నన్ను మాయ తాను స్పృశించును గాని నిన్ను తాకుటకై శక్తి గల దెట్లగును? సూర్యుని కాంతుల మేఘము దాచఁగలదేమో కాని సూర్యుని దాకి జీవనముతో మనగలదా?

కోసెడివారికైనఁ దను గొట్టెడివారికి నైనఁ బెంచ నీర్
వోసెడివారికైనఁ దరువుల్ సమపద్ధతి నీడనిచ్చు నీ
దాసులు ద్వేష మూడ్చి సమతంగని మేలొనరింత్రు వైరమున్
గోసెడివాఁడె వైష్ణవుఁడగున్ దగ నంటిని రంగనాయకా! 49

తా॥ వృక్షములు తమను కోసెడివారికైనను గొడ్డలితోఁ గొట్టెడి వారికైనను పెంచుటకు నీరు పోసెడివారికైనమ సమముగా నీడనిచ్చుచుండును. అట్లే నీ దాసులు వైష్ణవులు ద్వేషరహితులై శత్రువునకును మేలుచేతురు. రంగనాథా! వైరమును గోసినవాఁడే వైష్ణవుఁ డగునుగదా రంగనాథా!

భవము తరింపఁ జేయఁగఁ గృపామతి నిచ్చితి వింద్రియాళిఁ దా
మవియొ మమత్వముం బెనిచి యాత్మకె బంధనకారకమ్ములౌఁ
బ్రవిమలరూప! నాల్కఁ గుడుపన్ దంతములీయ నవ్వియే
తవిలి ప్రమాదతన్ గఱచుఁ దద్రసనన్ దెరువెద్ది? రంగరాట్! 50

తా॥ సంసారమునుండి తరించుటకై ఇంద్రియా లన్నిటి నొసంగితివి. అవియొ మమకారమును బెంచి ఆత్మకే బంధనకారులైనవి. ఓ పవిత్రమైన స్వరూపము గలవాఁడా! నాల్కను తినబెట్టుటకు పండ్లునిచ్చిన అవి ప్రమాద వశమున ఆ నాల్కనే కరిచి కష్టపెట్టుచుండెను. ఇంక ఉపాయమెయ్యది రంగ నాథస్వామీ!

చదివిన వన్నియుం బ్రకృతిశాస్త్రములే భవదీయతత్వ మా
చదువులతోడనే తెలియ సాధ్యముఁ గామిని నీవె లేవనున్
సదమలతేజ! భూమి మని సాధ్య మదెట్లగు నీఁత నేర్వకే
యుదనిధి నున్న శౌక్తికసముజ్వలమౌక్తిక మొంద రంగరాట్! 51

తా॥ రంగనాథా!చదివిన వన్నియు భౌతికశాస్త్రములే.నీ తత్వమా ప్రాకృత శాస్త్రములచే తెలియకుండుటచే నీవే లేవందురు. ఓ నిర్మలమగు తేజస్వరూపుఁడా! కేవలముగా భూమిఁమీద మాత్రమే నడువ నేర్చినవానికి ఈఁతనేర్చి సముద్రములో మున్గిననే కాని లభించని ముత్యము లెట్లు దొరుఁకగలవు?

బొమ్మను నమ్మి యింతకును బొమ్మ నొసంగిన యమ్మ వీడి, తా
నిమ్మహి నాడుచుండు శిశు వించుక నాఁకలిబాధపెట్ట నా
బొమ్మను వీడి యమ్మ యని బోరున నేడ్చెడి రీతి మేటి క
ష్టమ్ములు దాపురించునపు డజ్ఞుఁడు నిన్ గని యేడ్చు రంగరాట్! 52

తా॥ ఒక శిశువు బొమ్మను నమ్మియాడుకొనుచు బొమ్మనిచ్చిన యమ్మను మరచి యుండును. ఆకలి బాధపెట్టినపు డాబొమ్మను విడిచి "అమ్మా" అని యేడ్చు విధముగా, అజ్ఞాని కష్టములు దాపురించినపుడు నిను గురించి యార్తుడై యేడ్చును గదా శ్రీరంగనాథా!

నిశలు పవళ్ళు సంసరణనీరధిలోన షడూర్మిమాలికా
వశత నడంగి రాగరసవార్ధిఁ జెలంగెడి దారపుత్రన
క్రశతమహాగళగ్రసితరమ్యవివేకుఁలరైన మాదృశుల్
పశువులు నీదు దర్శనసుభాగ్యముఁ గల్గునదెట్లు? రంగరాట్! 53

తా॥ రాత్రింబవళ్ళు సంసారసముద్రములో, ఆకలి, కోరిక, మోహము, దుఃఖము, ముసలితనము, మరణము అను షడూర్ములు విజృంభించ, వాని తాకిడికి అణఁగిపోయి మమత యను నీటితో నిండిన యాసముద్రములో భార్య బిడ్డలనెడి నూర్ల మొసళ్ళనోళ్ళతో మ్రింగఁబడిన వివేకము, గల పశువును నేను. నాకు నీ దర్శనభాగ్యము చిక్కునా రంగనాథా!

అఘమూలంబయి కర్మకాండమయి కామాకారశాఖాశిఫా
లఘురూపంబయి భ్రాంతిపర్ణసుమనోలంకారమై వైషయా
నిఘసాద్యల్పఫలాఢ్యమౌ భవమహానీపాగ్ర మందుండి దే
వ! ఘనాపజ్జలధి న్మునింగితి ననుం బాలింపవే రంగరాట్! 54

తా॥ పాపమే వేరులై, కర్మమే బోదెయై కోరికలె కొమ్మలై యూడలై భ్రాంతియే ఆకులై పూవులై విషయవాసనలే ఫలములై అల్పసుఖములతోఁ గూడిన ఈ కడిమి చెట్టు కొమ్మలనుండి ఆపద యనెడి సముద్రమున మునిఁగితిని, నన్ను పాలింపవే రంగనాథా!

స్వామీ! వేరొక దిక్కుఁ గాంచనిఁక నా సర్వస్వము న్నీవె, నే
కామాంధుండను గాన నిన్నిదినముల్ గానంగ లేనైతి నిన్
ధీమాంద్యంబున జవ్వనంపు మదిరం దీపించు మైకమ్ముతో
నీమైఁ దోఁచు జరాభరా ప్తి నెటకో యేగెన్ ప్రభూ! రంగరాట్! 55

తా॥ స్వామీ రంగనాథా! నాకు వేరొక దిక్కులేదు. ఇక నా సర్వస్వమూ నీవే. నే కామాంధుండను గావున బుద్ధిమాంద్యముచే నిన్ని దినములనుండి నిను గాంచలేనైతిని. యౌవనమను కల్లుత్రాగి మత్తెక్కి పడియుంటిని. ఆ మైకము తాను నా శరీరమునందు ఆవేశించిన ముసలితనముతో నెచటికో పరువిడిపోయినది రంగనాథా!

వనితల వ్రాలుచూపులకు వ్రాలుచు గాళుల భ్రూవిలాస న
ర్తనలకు నాట్యమాడుచు స్మితస్ఫురదాననపద్మసద్మబం
ధనమునఁ బ్రాణపంచకమదభ్రమరాళి బలిం బొనర్చు యౌ
వనమదిరాప్రమత్తతలు వ్యర్థగతిన్ దిగజారె రంగరాట్! 56

తా॥ స్త్రీల వాలుచూపులకు వలచి వారి పాదాలపై వ్రాలుచు వారి బొమఁ దీవియలెట్లాడిన నా కనుసన్నలలో నట్లాడుచు, వారి నవ్వుముఖము లను పద్మ ప్రసూనబంధనములలో పంచప్రాణము లనెడి మదించిన తుమ్మెదల బలిచేయు చుంటిని, ఈ బలిసేతకు కారణమైన యౌవన మనెడి మదిర(కల్లు)మత్తు. చూచు చుండఁగానే వ్యర్థముగా దిగజారిపోయెను గదా రంగనాథా!

వేడుక వచ్చినాఁడ పృథ్వీతలయాత్రకుఁ జూచుచుండఁగా
మూఁడవ జాముమించెఁ దుదముట్టెను దెచ్చిన రొక్క మెల్ల యీ
నీడ యదేమొ? యడ్డె పుడమిం బొడవై నడయాడసాగు, దాఁ
గూడఁగఁ బోవునో తిమిరకూటనిగూఢనిశీథి రంగరాట్! 57

తా॥ ఉత్సాహముతో పృథ్వీతల మను తీర్థయాత్రకు వచ్చినాను. చూచుచుండఁగా వార్ధక్య మనెడి మూఁడవజాము మించినది. వెంటఁదెచ్చిన ఆయుర్దాయ మను విత్తమంతయును వ్యయమైనది. సాయంకాలపు నా నీడ పొడవై నదై అంధకార బంధురమగు చీఁకటిలోఁగలియుటకు పోవుచుండెనో యనునట్లుండెను. నా జీవిత సమయకమిఁక కొంచెమే మిగిలియున్నను నీ స్మరణ సేయలేనైతిని రంగనాథా!

అరుసముతోఁడ భార్యయని యాత్మజుఁడంచును నెన్ని యెన్నియో
బరువులు మోసి మోసి కడు వంగెను క్రుంగెను మూఁపులున్ జరా
శరధితరంగభీకరవిసార మనన్ ముడుతల్ వడెన్ గళే
బరమున మృత్యుభోగ్యమయి పండెను వే తలకాయ రంగరాట్! 58

తా॥ సంతోషముతో భార్య బిడ్డలు అనెడి బరువులను మోసి మోసి నా భుజములు చాల క్రుంగినవై నడుము వంగిపోయినది. ముసలితన మనెడి సముద్రములోని భయంకరములైన తరంగములవలె ఈ శరీర మంతట చర్మము ముడతలు పడినది. మృత్యువునకు రుచిఁ గూర్చునట్లు నా తలకాయ పండి పోయినది. ఐనను నే నిన్ను స్మరించనైతిని రంగనాథా!

పురుషుఁడ వీవు తక్కు జనముల్ నిజ మారయ స్త్రీలు మాయని
ద్దుర నొగి మున్గియున్న మము దుర్మదులన్ గనువిప్పొనర్చి ని
ర్భరకరుణాకటాక్షములఁ బాలనసేయుదు వీవ, మాకు దు
ష్కర మది "పెట్ట" మేల్కొలుపు గానముఁ బాడునదెట్టు? రంగరాట్!

తా॥ నీ వొక్కఁడవే పురుషుఁడవు. నిజము విచారించిన తక్కిన జనము లందరును స్త్రీలనియే చెప్పవలయును. ఏలయన, మాయా నిద్రతో మునిగి మద మత్తులమై పడియున్న మాకు కనువిప్పు నొనర్చి నీ నిర్హేతుక కరుణాదృష్టితో మమ్ము మేల్కొలిపి రక్షించువాఁడవు నీవొక్కఁడవే. మేమది చేయఁజాలము రంగనాథా! ఆడుకోడిపెట్టల వంటి మేము పుంజువంటి పురుషోత్తముఁడవగు నిన్ను వలె మేల్కొల్పు గానము పాడఁగలమా?

ధర నశియించు వస్తుసముదాయముపైఁ గల కోర్కులెన్ని యెం
దరయఁగఁ ద్రుప్పుపట్టి చెడు నల్పములై మనుతుచ్ఛలోహముల్
వరద! యనశ్వరమ్మగు భవత్పదసంగతిఁ దేలు కోరికల్
నిరతము త్రుప్పులేక మను నిస్తులహేమనిభాలు రంగరాట్! 60

తా॥ ప్రపంచములో అశాశ్వతములై నశించు వస్తువులపైఁ గల వాంఛ లన్నియు నిజము విచారించినచో త్రుప్పుపట్టి చెడిపోవు తుచ్ఛలోహముల వంటివి. వరదుఁడవగు ఓ రంగనాథా! నశించని మీ పాదసేవ చేయు కోరికలు, ఎప్పుడును త్రుప్పు పట్టి నశించని విలువైన బంగారము వంటివియే కదా!

కండబలమ్ముతోడ వెలిఁగల్గెడి శత్రులఁ గెల్చు కంటెనున్
గుండెబలమ్ముతోడ వినిగూఢత లోఁగల శత్రుషట్కమున్
చెండెడివాఁడె వీరుఁడని చెప్పఁగ నొప్పును, కామ మూడ్వ వే
రొండొక శత్రు వుర్వి నిఁక నుండుటలెట్లు పొసంగు? రంగరాట్! 61

తా॥ వెలుపల నున్న శత్రువులఁ గండ బలముతో గెల్చుట కంటెను గుండె బలముతో హృదయములో దాఁగియున్న కామ,క్రోధ, మోహ,లోభ, మద మాత్సర్యము అనెడి యార్గురి నంతశ్శత్రువులను చంపెడి వాఁడే ప్రపంచములో నిజమైన వీరుఁడని చెప్పవలయును. ఈ ఆరుగురు శత్రువులకు మూలమైన కామమును గెల్చిన ప్రపంచములో మాకు మరియొక శత్రువుండుట పొసఁగునెట్లు శ్రీరంగనాథా!

మిగిలిన దేవతాతతికి మీకును భేద మదేమి? యన్న నో
నిగమవిహార! వార లవనీప్రజనేఁచు నధర్మశీలు రీ
వగతి యనన్ వరాలిడిరి వ్యాఘ్రముపై దయఁబూని రెక్కలన్
దగులుచునట్లు మీరొ యవి ధ్వంస మొనర్తురుగాదె రంగరాట్! 62

తా॥ వేదములలో విహరించువాఁడా, ఓ రంగనాథా! మిగిలిన దేవతలకును మీకును నొక గొప్ప భేదమున్నది. మిగిలిన దేవతలు ప్రజలను బాధ పెట్టు క్రూర రాక్షస ప్రవృత్తి గల వారలు. మీరేగతియని ప్రార్థించినచో పులులపై దయఁబూని వానికి రెక్కలు ప్రసాదించినట్లు నిర్విచారముగా నా రాక్షసులకు దివ్యశక్తులు సమకూడునట్టి వరములు ప్రసాదించెదరు. అట్టి వరములను మీరు అదనెఱింగి ధ్వంసము చేయుదురు గదా రంగనాథా!

సారాసారవిచారముం దెలిసి యీ సంసారమున్ రోసి, ని
స్సారంబైన సతీసుతాలయవపుస్సంబంధముం గోసి, సు
శ్రీరమ్యంబగు నీ పదాబ్జయుగళిం జింతింపఁగా నోడు; స్వీ
యారోగ్యంబిడు నౌషధ మ్మెటుల రుచ్యంబై మనున్ రంగరాట్! 63

తా॥ నిత్యమేది యనిత్యమేది యని గుర్తెరింగి అసారమై యశాశ్వతమైన యీ సంసారమును రోసి, ఆలుబిడ్డలతోఁగల శరీరసంబంధమును తెగఁగోసి, సంపత్కరములును సుందరములును అయినట్టి మీ పాదయుగళిని చింతించుటకు వెనుకఁ బోవును. ఆరోగ్యప్రదమైన యౌషధ మెప్పుడైన రోగికి రుచించునా? రంగనాథా!

వేదమయుండు సర్వగుఁడు విష్ణువు వీడి తదన్యదైవముల్
మేదిని గొల్చువారికి సమేయదముక్తిఫలమ్ము చిక్కునే?
బోదెకు క్రిందనుండు తరుమూలమునన్ జల మీయకుండ నా
మోదత వృక్షశాఖలకు మూర్ఖత నీరిడ నౌనె? రంగరాట్! 64

తా॥ వేదమయుఁడును సర్వత్ర వ్యాపించి యుండువాఁడగు విష్ణువును విడిచి ఇతరదైవములను సేవించువారికి ముక్తిఫలము లభించునా రంగనాథా! బోదెకు క్రింద నుండు వేరుకు జలము పోయక తక్కిన కొమ్మలఁ దడుపువారికి ఎచ్చటనైనా ఫలప్రాప్తి గలుగునా? అది మూర్ఖత్వము కాదా?

ఎడఁద దశేంద్రియాల్పవిషయేచ్ఛలకున్ వశమై చెలంగినన్
బడి నశియించు సంసృతివిపత్కరజాలమునందు నెందు నా
యెడఁద సుధీవివేకవిషయేచ్ఛలలో విహరించ సంసృతిన్
విడువఁగఁ జేయు బ్రహ్మపదవిం గని ముక్తిని బొందు రంగరాట్! 65

తా॥ హృదయము దశేంద్రియవిషయసుఖములకు వశమై యుండుచో సంసార మను విపత్కరమగు వలలోఁ బడి నశించకుండునా? అదే హృదయము సద్బుద్ధికి సంబంధించిన సద్విషయములయందు విహరించినచో సంసారబంధమును విడిపించు బ్రహ్మపదవిని గాంచి ముక్తిని పొందదా రంగనాథా!

కనుట ప్రధాన మంత్రు భువిఁ గాంచినవెల్ల నశించు నంచుఁ దా
మనుకొన రెప్పుడేని హృదయమ్మున నీ భవబద్ధబుద్ధులై
మనమున నాటఁ జెప్పు శ్రుతిమంత్రగతార్థరహస్యసంగతుల్
వినుటె ప్రధాన మందురు వివేకధనుల్ వరదాత! రంగరాట్! 66

తా॥ వరప్రదాతా రంగనాథా! సంసారపాశములఁ గట్టఁబడిన బుద్ధి గలవారు కనునట్టి వస్తువులెల్ల నశించునవే యను జ్ఞానము లేనివారలై, కనుటయే ప్రధానమందురు. సదసద్వివేకముగలవారు మనస్సు కెక్కునట్లుగా నుపదేశించు వేదప్రతిపాదితములగు మంత్రముల మంత్రార్థముల వానిరహస్యముల వినుటయే ప్రధానమని జ్ఞానధనమే ధనమని భావింతురు కదా!

ఐహికవస్తుసంతతులు హానియు వృద్ధియుఁ గల్గి యెందునున్
దేహికెదో కళంకమును దెచ్చును చందురు చంద మొప్పఁగన్
శ్రీహరిపాదపద్మముల చింతన హానియు వృద్ధిలేకయే
దేహికి నిష్కళంకతను దెచ్చు రవింబలె రంగరాడ్వరా! 67

తా॥ రంగనాథా! ఇహలోకమునకు సంబంధించిన వస్తుసమూహములు పెరుగుట విరుగుటలు గలవియై వాని నాశ్రయించిన దేహికి హానివృద్ధులు గల చంద్రుని వలెనే ఏదో కళంకము నాపాదించునుగదా! శ్రీహరిపాదపద్మ చింతనములు ఏ హానియు వృద్ధియును లేని సూర్యుని వలెనే తమ నాశ్రయించినవారికిని నిష్కళంకతయు మరియు మిక్కిలి ప్రకాశమును చేకూర్చును గదా!

కుతుకము తోడ రక్తములఁ గ్రోలును క్రొవ్వులి గోవుఁ జంపుచున్
సతతము నాల పాలనము సల్పుచు పాలను గ్రోలు భూసురుం
డతులిత దైవభావమున నాసురశక్తి మృతమ్ముఁ గ్రోల, సం
తత మమృతమ్మునే యుభయతారకమై చనఁ గ్రోలు రంగరాట్! 68

తా॥ రంగనాథా! క్రొవ్వుపులి ఉత్సాహముతో గోవును చంపి రక్తములను పానము చేయును. బ్రాహ్మణుఁడో గోవు నొక దైవభావముతో పూజించి పెంచుచు పాలను మాత్రమే క్రోలును. ఇట్లు రాక్షసప్రకృతి మృతాహారమును భుజింపఁగా దైవీప్రకృతి తనను రక్షించుచు గోవును గూడ రక్షించుచు నొప్పారు క్షీరమువంటి యమృతమును పానము చేయును గదా! పులి గోవును చంపి తిని తాను మాత్రమే బ్రదికిన, బ్రాహ్మణుడు పాల గ్రోలుచు తనను గోవును రక్షించుచుండుట లతని కర్మ ఉభయతారకము కదా!

నల్లనిమేను నీరములు నవ్వులు ఫేనము, నేత్రమీనముల్
చల్లని పాణిపాదములు సంచలితోరుతరంగసంగతుల్,
వెల్ల నఖాలు ముత్తెములు విద్రుమ మోష్ఠము, నాభి చక్రమై
యుల్లసిలన్ దయాబ్ధి వయి యొప్పుచు నుందువు నీవు, రంగరాట్! 69

తా॥ శ్రీరంగనాథా! తమ నల్లని మేను సముద్రోదకము కాఁగా మీ నవ్వులా సముద్ర జలములపైఁ దేలియాడు నురుగులు కాఁగా మీ నేత్రము లందు కదలియాడు చేపలుగా, కదలియాడు హస్తపాదములు అందు చలించు తరంగములు కాఁగా, మీ హస్తపాదముల నఖములు తామా సముద్ర మందలి ముత్యములు కాఁగా దేవరవారి అధరము ప్రవాళ లతగా తమ నాభిసుడియై యొప్పుచుండగా మీరొక దయాసముద్రముగా సాక్షాత్కరించుచున్నారు.

నీ పదసీమ దండవిధి నిర్భరులై పడియుండువారి సు
శ్రీపద మంటి యాశ్రయణసిద్ధిని మద్భర మెల్లవారె నా
ప్రాపని యెంచి సంసరణవార్ధిని నే తరియింతు నావ, తా
నో పయిఁ దేలి యాశ్రితులనుం దరిఁ జేర్చును గాదె రంగరాట్! 70

తా॥ ఓరంగనాథా! మీ పాదసన్నిధిలో దండాకారముగా నిర్భరులై పడియుండు వారి శ్రీపదముల సమాశ్రయణ మొనర్చి నాకు వారే దిక్కని తరింతునని దృఢవిశ్వాసము గల్గియున్నాను. పడవ తాను సముద్రముపైన తేలియాడుచు తన నాశ్రయించిన వారి నందరిని గూడా తరింపఁజేయుటకు సమర్థవంతమై యుండును గదా!

తామె వెలుంగనౌ నొరులు ధాత్రి వెలుంగఁగ రా దటంచునున్
వ్యోమ పథమ్ము నంటి ముద మొందెడి తారలు స్వార్థులం బలెన్
సోముఁడు తావెలుంగుచును సోదరవిశ్వమునుం బ్రకాశిలన్
కామదుఁ డౌచు త్యాగి వలె కాంతిలు చుండును గాదె రంగరాట్! 71

తా॥ శ్రీరంగనాథా! ప్రపంచములో తామే ప్రకాశించవలెఁ గాని మరొకరు ప్రకాశించరా దను స్వార్థపరులవలె ఆకాశవీధిలో తారలు నవ్వి యాడుచున్నవి. నేను ప్రకాశించుటలే కాక సోదర ప్రపంచమును గూడ వెలిగింపఁ జేయవలె నను త్యాగివలె జనుల కోరికలను దీర్చు చంద్రుఁడు నిరంతరము హాని వృద్ధు [illegible]చున్నాడు గదా!

తామె వెలింగి విశ్వవసుధన్ వెలిగింపఁగ లేని తారకల్
వ్యోమమునందు కోటులుగ నున్నను లాభమదేమి? స్వామి! తా
సోముని భాతి నీజగతి శోభిలఁ జేయును సద్గురుండు తత్
సోమునకుం బ్రకాశమిడు సూర్యుఁడ వీవే కదయ్య రంగరాట్? 72

తా॥ శ్రీరంగనాథా! తామే ప్రకాశించుచు విశ్వమును ప్రకాశింపఁ జేయలేని తారక లను స్వార్థపరులు కోట్లుగా నున్న ప్రయోజనమేమి? ప్రభూ! శ్రీరంగా! చంద్రునివలె వెలింగి ప్రపంచమును సద్గురుండు వెలిఁగించువాఁడు గదా! ఆ సద్గురువునకును చంద్రునకు సూర్యుఁడు ప్రకాశమిచ్చుచున్నట్లే దేవరవారు తాను తరించి జగమును తరింపఁజేయు శక్తి నొసంగుదురు కదా!

భోగులు త్యాగులంచు నిలఁ బొల్చెడి మానవజాతి యంతయున్
రాగవిరాగసంగతుల రాజిలు చుందురు గాదె, వీరిలో
భోగుల జీవనమ్ము విషపూరితమై పరుఁ జంపు, ఆ ఘన
త్యాగుల జీవన మ్మమృతధారి భువిన్ బ్రతికించు రంగరాట్! 73

తా॥ శ్రీరంగనాథా! ప్రపంచములోని మానవజాతి యంతయును, మమతాబంధముచే మరియు వైరాగ్యముతో కూడుకొనినవారై క్రమముగా భోగులని త్యాగులని రెండువిధములుగా నుందురు కదా! అందు మమతాబంధము గల భోగులు విషపూరితులై పరులఁ జంపి తాము బ్రతుకఁ దలంతురు. మరియు వైరాగ్యసంపన్నులగు త్యాగులు ఘన(మేఘ)జీవనమ్ము గల్గి, అమృతధారులై తమ జీవనము నొరులకిచ్చి బ్రతికింతురు కదా!

ప్రభవ మొదల్ క్షయాంతముగ భాసిలుచుండెడి కాలమానమో
విభవము లొప్ప ప్రాణులవి విస్తృతకాలమహార్ణవమ్ములో
గబగబ బుద్బుదమ్ము లయి కన్బడు నాడు నడంగు సంతత
మ్మిభవరదా! క్షయ మ్మడఁచి ఏలవె? ముక్తి నొసంగి రంగరాట్! 74

తా॥ శ్రీరంగనాథా! కాలమాన మంతయు "ప్రభవ" పుట్టుకమొదలుకొని "క్షయ" నాశముతో అంతమగునదే కదా! మన జననమరణములను దెల్పుట కీకాలత యేర్పడినను కాలమొక మహార్ణవము వలె అనంతమైనదే కదా! ఈ అనంతకాలార్ణవములో నీటిబుడగలవలె నిరంతరము గబగబ పుట్టి కనబడి విభవ మొప్పఁగా కొంతకాలము నటించి క్షయించి అదృశ్యమగును గదా! ఓ కరివరదా! నాశ మెరుంగని ముక్తిపద మొసంగి నన్ను పరిపాలించు దాతవు నీవే।

తల్లి యొనర్చు పాకవిధి తండ్రి యొనర్చెడి కర్షకశ్రమల్
పిల్లఁ డెరుంగకున్న సరివేళకు భోజన మబ్బకుండునే
వెల్లగు జ్ఞానకర్మలు లభింపమి నేమి గురుప్రసాదమౌ
సల్లలితప్రపత్తి యది చాలదె ముక్తి నొసంగ రంగరాట్! 75

తా॥ ఓ శ్రీరంగనాథా! పసిబిడ్డ తల్లిచేయు వంట విధానము మరియు తండ్రి సేయు ధాన్యమును పండించుటకై శ్రమించు "కృషి" వ్యవసాయపు కష్టనష్టము లేమియు తెలియకున్నను సమయమునకు భోజనముఁ జిక్కకుండునా? అట్లే సాధకులకు సాధనములగు జ్ఞానకర్మల రహస్యములు విధానములు తెలియకున్నను ఉపాయోపేయములు నీవేయను గురువు లిచ్చు ప్రపత్తి మార్గము ఒక్కటే ముక్తి నిచ్చుటకు సరిపోదా?

చీకటిఁ బోలు నజ్ఞ దశ చిన్నని దీపమునై వెలుంగుచున్
ఈ కుతలమ్ము నేనె వెలిఁగించితి నంచు నహంకరించితిన్
వేకువ లంటి జ్ఞానగతి వెల్గు నహస్కరుఁ గాంచి యాతఁడే
లోకము వెల్గఁ జేయునని లొంగుచు వెల్వెలఁ బోదు రంగరాట్! 76

తా॥ శ్రీరంగనాథా! చీకటిని బోలు అజ్ఞానదశలో నేనొక చిన్నదీపమునై వెలుంగుచు, ఈ ప్రపంచమును నేనే వెలిఁగించుచున్నానని అహంకారము నొందితిని. వేకువ వంటి జ్ఞానదశలో సూర్యుని కాంతితో వెల్గు ప్రపంచమును గాంచి ఈ యహస్కరుఁడే యీ ప్రపంచమును వెలుగించువాఁడని తెలిసి సూర్యుని ముందు వెలుఁగ లేని దీపమువలె వెలవెలఁ బోయితిని గదా!

నిర్భరమాయదౌ మహిమ నిన్ స్పృశియించఁగ లేదు నన్ననన్
దుర్బలుఁ డంచు నెంచి తన దౌర్బలసంహతి పీడ వెట్టెడిన్
దుర్భగలోహపిండమును త్రుప్పు స్పృశించును గాని శుద్ధమౌ
కర్బుర మంటుచున్ జిలుము కార్ష్యముఁ గూర్చున దెట్లు? రంగరాట్!

తా॥ శ్రీరంగనాథా! మావంటి యాత్మలు భరింపరాని యా మాయా మహిమ మది నిన్నేమాత్రము నంటఁ జాలదు. దుర్బలుఁడనైన నన్ను మాత్రము తన బలపరాక్రమములచే నాక్రమించి విపరీతముగా పీడపెట్టుచున్నది. వికారములఁ బొందు ఇనుమును "త్రుప్పు" "చిలుము" స్పృశించునుగాని చొక్కమగు బంగారమును త్రుప్పు స్పృశించి నల్లఁదనమును గలిఁగించి నశింపఁ జేయలేదు కదా స్వామీ!

హరిణ మటుల్ ధనాశ హృదయమ్మును లాగును బుద్ధి తానునుం
బరవశయై యటే చనును బాయక లక్ష్మణువోలె నింద్రియా
లరసి దశాస్య చందము నిజాత్మ హరించును మా కుటుంబదు
ర్భరశ్రమ లెల్ల రామవనవాసమెయౌఁ గదె? రంగనాయకా! 78

తా॥ శ్రీరంగనాయకా! సీతను లేడివలె ఈ ధనాశ నా హృదయము నాకర్షించుచున్నది. బుద్ధి కూడ సీతచే నాజ్ఞాపింపఁబడిన లక్ష్మణుని వలెఁ బరవశయై యటే పోవుచున్నది. ఇది పొంచి దశేంద్రియములు దశవదనుఁడగు రావణుని వలె నాహృదయగతమగు ఆత్మను హరించి బంధము చేకూర్చును. ఓర్వఁగరాని నా కుటుంబశ్రమలన్ని శ్రీరామవనవాసమే కదా!

రాముఁడు మాయలేడిఁ గొని రా వనవీధులనేఁగ లక్ష్మణ
స్వామిని రాముఁ డాపదల వర్తిలె పొమ్మని తిట్టి పంపు నా
భూమిజ రాము వీడు దశఁ బొందెను, భాగవతాపచార మ
ట్లే మము హర్యనుగ్రహవిహీనులఁ జేయదె? రంగరాడ్వరా! 79

తా॥ రంగనాథా! రామచంద్రస్వామి మాయలేడిని గొని వచ్చుటకునై పర్ణశాల విడిచి వనవీధుల కేగినప్పుడు లక్ష్మణస్వామిని గాంచి సీతాదేవి రాముఁ డాపదలలోఁ జిక్కుకొనినాఁడు పొమ్మని లక్ష్మణుని అపార్థముఁ జేసికొని తిట్టి పంపినది. ఆ పాపవశముననే సీతకు రామవియోగకష్టములు ప్రాప్తించినవి. అట్లే మమ్ముఁ గూడ భాగవతాపచారము శ్రీహరి యనుగ్రహమునకు దూరులనుగాఁ జేయకుండునా?

పేరునకే యశోకవనపేశలతల్ విన సొంపు సీతకై
కూరిన శోకసంతతులు కోటుల కెక్కువ లట్టె మాకు సం
సారమునందునం గలుగు సారము నెంచఁగ నేతిబీరయై
ధారుణి బంధహేతువయి తామనుచుండును రంగరాడ్వరా! 80

తా॥ శ్రీరంగనాథస్వామీ! అశోకవన మను పేరు మాత్రము వినుటకు వీనులకు సొంపుగా సుకుమారముగా నున్నది. కాని యందు సీత తానుండి పొందిన శ్రమలు కష్టములు కోట్ల కెక్కువలుకదా! అట్లే మాకుఁ గూడ సంసార మను పేరు "సమ్యక్సార"మని వీనుల విందుగా భాసించును కాని మేము సంసారములో మమతాబంధములోఁ బడి యనేక కష్టముల ననుభవించు చున్నాము. నిజముగా సంసారమను పేరు "నేతిబీర" వలె నామమాత్రమే కదా!

పానీయంబని యెండమావులకునై పర్వెత్తు లేడిం బలెన్
హీనంబౌ విషయాదులం గుడువఁగా నేతెంచు బద్ధాత్ముఁడున్
తానోశాంతి విదూరుఁడై సతము బాధం జెందు సంసారపా
రీణుండై నశియించు నీచుఁడయి మారీచుం బలెన్ రంగరాట్! 81

తా॥ శ్రీరంగనాథా! మంచినీళ్ళని భ్రమించి యెండమావులకు పరుఁగెత్తు లేడిపిల్లవలె అత్యంతహీనములైన విషయాదుల ననుభవింపఁగా నేతెంచు బద్ధాత్ముఁడు తాను శాంతిసౌఖ్యముల కెంతో దూరముగా నుండి నిరంతరము బాధపడుచు సంసారమునందుఁ జిక్కి, నీచుఁడైన మారీచుని వలె నశించును గదా!

వసుధ కళత్రపుత్రపరివారము, సీతకుఁ దాము లంకలో
మెసవఁగ కందమూలముల మేకొని యిచ్చెడి రాక్షసాంగనా
విసరము వోలె నెందు రఘువీరునికన్న ప్రపంచభోగముల్
పసఁ గలవంచుఁ జెప్పుచును బ్రహ్మపద మ్మెడఁబాపు రంగరాట్! 82

తా॥ శ్రీరంగనాయకా! ఈ ప్రపంచములో భార్యాపుత్రాదులు తాము సీతకు లంకలో చుట్టుఁజేరి బాధించుచుఁ గందమూలఫలములు రాముని సహవసతి కన్నను అత్యంతభోగ్యములని చెప్పుచు తినుమని యిచ్చు భయంకరరాక్షసాంగనలవంటివారే కాదా! ప్రాపంచికభోగములు భగవదనుభవము సాటి ఏనాటికైనా యగునా?

ఖలుఁడగు రావణుం దునిమి కంధి తరింపఁగఁజేసి నిన్ను స్వ
స్థలిఁ గొనిపోవు రాముఁడని జానకిఁ గాంచి కపీంద్రుఁ డన్నటుల్
బలిమి నహమ్ము దున్మి భవవార్థి తరింపఁగఁజేసి తత్పర
స్థలిఁ గొనిపోవు శౌరి యని సద్గురు మంత్రముఁ దెల్పు రంగరాట్! 83

తా॥ శ్రీరంగనాథస్వామీ? సీతను గాంచి హనుమంతుఁడు! "తల్లీ! దుర్మార్గుఁడైన రావణుని చంపి సముద్రమును దాఁటించి నిన్ను అయోధ్యకు శ్రీరామచంద్రప్రభువు కొనిపోవు" నని నిజమును చెప్పినట్లే మా ఆత్మలకు శ్రీసద్గురు వొసంగు మంత్రము తాను గూడ 'ఓ బద్ధాత్మా! నిన్ను బాధవెట్టు అహంకారమును నశింపఁజేసి సంసారసముద్రమును దాఁటింపఁజేసి ఆ పరమ పదము శ్రీమన్నారాయణుఁడు మిమ్ము కొనిపోవు'నని తెల్పును కదా!

పావని లంక సీత దరి వచ్చి వచించు విశిష్ట భాషణల్
శ్రీవిభుఁ గూర్చి సద్గురుఁడు చేతనునిం దరియింపఁ జేయు సం
భావనజేసి తెల్పు వరభాగవతాదిపురాణశాస్త్రముల్
ద్రావిడసత్ప్రబంధగతతత్వరహస్యప్రబోధ రంగరాట్! 84

తా॥ రంగనాథస్వామీ! నాఁడు శ్రీ ఆంజనేయస్వామి లంకలోని సీతాదేవి సమీపమునకు వచ్చి ధైర్యము సంతోషము కలుగునట్లుగా చెప్పిన మాటలవలెనే సద్గురువు అస్మదాదుల దరికి విచ్చేసి భారత భాగవత భగవద్విషయ భాష్యాది పురాణ శాస్త్ర గ్రంథములు తెల్పు తత్వరహస్య ప్రబోధము లుండును గదా!

మారుతి జానకీసతికి మంజులముద్రిక నీయ నామె తాఁ
గూరిమి రాఘవుండు నను గొంచరుఁగన్ జెర వీడు నంచు నో
రూరఁగ తృప్తిఁగొన్నటు గురూత్తముఁ డార్ద్రిత తాపముద్రలన్
గూరఁగఁ జేయ శ్రీపతిని గూడుట తథ్య మటందు రంగరాట్! 85

తా॥ శ్రీరంగనాథా! శ్రీ అంజనేయస్వామి సీతాదేవికి మనోహరమైన రామాంగుళీయక ముద్రను దెచ్చి యిచ్చిన నామె తాను తన విభుఁడగు శ్రీరామ చంద్రస్వామి తనను గొనిపోగలఁడు, నా చెరవీడు నని ధైర్యముతో నుండి తృప్తిఁగాంచి నటులు, గురూత్తములు కరుణతో లభింపఁ జేయు తప్త ముద్ర లును తప్పక శ్రియఃపతి సన్నిధి లభించఁ గలదని యాత్మఁ దలచుటే కదా!

హనుమకు సీత రాఘవున కర్పణ చేయఁగ శీర్షరత్నమున్
గొనుమని యీయ "ధన్యతను గొంటిని నే"నని యెంచి నట్లులే
మనసగు సద్గురుం డిడిన మంత్రమహామణి మాకుఁ జిక్కనం
తనె తరియించె జన్మ యిల ధన్యత చేకురె నందు రంగరాట్! 86

తా॥ శ్రీరంగ నాయకా! ఆంజనేయునకు సీత శ్రీరామ చంద్రున కొసంగు మని శిరోమణి నొసంగిన శ్రీ అంజనేయస్వామి నేను ధన్యుడ నైతినని భావించి నట్టే ఇష్టమగు సద్గురుం డిడిన తిరుమంత్ర మను మణి మాకు లభించెను, మా జన్మ తరించెను మాకు ధన్యత చేకూరెను అని ముముక్షువు భావించుటలు కాదా!

నిరతము భీతిఁ గొల్పు రజనీచరకాంతల మధ్య సీతనున్
వెఱవకు మంచుఁ దేర్చెడి విభీషణు పుత్రి విధమ్మునన్ మహా
పరుషపు సంసృతిన్ వివిధబాధలఁ జెందెడి మాకు సత్త్రజిన్
దురితహరమ్ము భాగవత దుర్లభమైత్రియె కాచె రంగరాట్! 87

తా॥ శ్రీరంగరాజా! నిరంతరము భయపెట్టు రాక్షసస్త్రీల మధ్య సీతను గాంచి భయ మింతయు వలదు అని ఓదార్చు విభీషణుని పుత్రిక యగు త్రిజట విధమ్మున మహాభయంకరమైన సంసారములో అనేకబాధలఁ బొందు మాకు ఓదార్పుగా జ్ఞానవిషయము నుపదేశించు భాగవతమైత్రి గూడా సంతతిచే కదా!

శత్రుల రావణాదులను సంహరణం బొనరించ నా మహీ
పుత్రిక రాముఁ గూడికొనిపోయి యయోధ్య సుఖాప్తిఁ గాంచిన
ట్లాత్రముతోడ నేను నితరాంతరదైవతపాళి వీడి మీ
స్తోత్రము సేయు భక్తతతితో మిము గూడి సుఖింతు రంగరాట్! 88

తా॥ శ్రీరంగనాథా! రావణాదిశత్రులను సంహరించిన పిదప నా సీతాదేవి శ్రీరామచంద్రుని గూడికొని పోయి అయోధ్యలో సుఖముగా నున్నట్లు నేను ఇతర దేవతలను, ఇతర సాధనములను, ఇతర మంత్రములను పారఁదోలి మీ భక్తులతోఁగూడి మీ సన్నిధిఁజేరి సుఖ శాంతులతో నుందును.

ఆరయ లోఁతుగాను మతి నారసి చూచిన గాని నాకు నీ
వో రసరూప! కానబడి యెందును నూహకు గోచరించ వీ
ధారుణి నెందు లోఁతుగను త్రవ్వినవే రసరూపమైన యా
నీరముఁ గాంచనౌఁ గదర నీరజలోచన! రంగనాయకా! 89

తా॥ శ్రీరంగనాథా! ఇంద్రియములకు అతీతమై బుద్ధికి నెంతో సూక్ష్మముగా జ్ఞాననేత్రముతో విచారించిననే గోచరించు రసరూపము నీది అట్లే రసరూపమైన జలములు ఈ భూమి నెంతో లోఁతుగా త్రవ్వినవే నేత్రపర్వముగా దర్శించుటకు వీలగును కదా!

ఉదధి తరంగ సంహతుల నుక్కిరి బిక్కిరియై మునుంగు చా
ర్తిఁ దనరు వాని కెం దవలి తీరముఁ జేర్చెడి వాఁడె కావలెన్
పదవులు నన్న వస్త్రములు భాగ్యము లిత్తు మటన్న నేల? మో
క్షదుఁడవు నీవె కావలె సశక్త సురాధము లేల? రంగరాట్! 90

తా॥ శ్రీరంగస్వామీ! సముద్రతరంగములలో మునుఁగుచు నుక్కిరి బిక్కిరియై ఆర్తిఁ జెందువాని కెందును వానిని తీరమునకుఁ జేర్చెడివానిదే అత్యవసరమైనట్టు సంసారసముద్రములో మునుఁగు మాకు పదవులు భాగ్యములు అన్నవస్త్రములిచ్చెదమనువారేటికి? మోక్ష మొసంగి తరింపఁజేయు నీవే కావలెను కదా!

తానీ భూమియు నాకసమ్ము దిశలున్ స్తంభమ్ములున్ కుడ్యముల్
నానావస్తు వితానముల్ ధరణిలో నాచేతఁ జూడంబడున్
గానీ నన్ గనలే వ దెట్లొ యటులే నన్ గాంతు వీవో! హరీ!
నేఁ గో నిన్ గనలేను నిన్ గనెడి కన్నే యిమ్ము రంగేశ్వరా! 91

తా॥ శ్రీరంగనాథా! ఈ ప్రపంచములో భూమి ఆకాశము దిక్కులు స్తంభములు గోడలు మొదలగు అనేకవస్తువులు నాచేఁ జూడఁబడును గాని నన్ను చూడలేవు. అట్లే నీవు నన్ను చూడఁ గలవుఁ గాని నేను నిన్ను చూడలేక పోవుచున్నాను. కావున నీవు దయతో నిన్ను జూడఁగల కన్ను నే అనగా జ్ఞానమునే ప్రసాదించుమా!

ఆకాంశం బది శాంతమై వివిధ వర్ణాకార రేఖాఢ్యమై
తాకున్ భూమికి వంగి వ్రాలు నదిగో! దర్శించవే మన్నటుల్
నాకున్ దేహము తోడఁ గూడి మృతిఁ సున్ వార్ధక్య రోగాదులున్
సోకున్ నేను నశింతు నంచు వగతున్ క్షుద్రుండ రంగేశ్వరా! 92

తా॥ శ్రీరంగనాథా! ఆకాశము శాంతమగు నాకారము గలదియై అనేకములగు రంగులు గలదియై రూపములుఁ గలదియై సుందరమైన స్వరూపము గలదియై భూమిపైకి వంగి వ్రాలి తాకుచున్నది. అదో! చూడుము నిజమో కాదో! అని ఒక అజ్ఞాని పలికినట్లు నేను కూడ ఆత్మరూపుఁడనగు నాకును దేహముతో పాటుగా ముసలితనము చావు రోగాదులు సోకును, నేను నశింతును అని భయపడు క్షుద్రుఁడనైన అజ్ఞానిని శ్రియఃపతీ! నన్ను కరుణించుము.

అడవిం బోయెడివారు కొంద రొకపై యాత్మీయులన్నెంచు చో
క్కఁడు లేఁడేమని తన్నుఁదా మరచి లెక్కల్ వెట్టు నొక్కొక్కఁడా
జడుఁడౌ భ్రాంతుఁడు స్వస్వరూప గత విజ్ఞానం బిటుల్ తెల్య కె
క్కడ తత్వజ్ఞుఁడుఁ గాఁగలండు చెపుమా కంజాక్ష! రంగేశ్వరా! 93

తా॥ శ్రీరంగేశ్వరా! అరణ్యములో ప్రయాణము చేయువారు కొంద రొకటిగా పయనించుచు తమవారందరు వచ్చుచున్నారా అని లెక్కించుచు తనను గణించుట మరచి ఒక్కఁడు తక్కువగా ఉన్నాడు అని ప్రతివాఁడట్లే తనను తాను మరచి యెంచుచు ఆర్తిని చెందినట్లు భ్రాంతిం బొందు జడుఁడు స్వస్వరూప విజ్ఞానము లేకుండా తత్వము గుర్తెఁగినవాడెట్లు కాగలుగును? ఓ పద్మాక్షా! తెలియఁజేయవే!

అగ్నియొ పాత్రనుండి కయి నంటిన గాల్చును పాత్ర కాల్చె నం
చజ్ఞతఁ బల్కుచుందును మదాత్మ గతంబయి శక్తి వీవు సం
మగ్నత నుండ కర్త వయి, మత్కృత మీపను లన్ని యందునే
భగ్నమతిన్ నినుం దలఁపఁ బాయు నహంకృతు లెట్లు? రంగరాట్! 94

తా॥ శ్రీరంగనాథా! క్రాఁగిన పాత్రలో నున్న అగ్ని కాల్చుచుండఁగా పాత్ర కాల్చెనని అజ్ఞానముతోఁ బల్కుచున్నాఁడను. అట్లే నా యాత్మలో నున్న శక్తివై నీవే యన్ని పనులు నెరవేర్చుచుండఁగా ఈ పనులకు కర్తను నేనే యనిబుద్ధిహీనుఁడనై పల్కుచుంటిని. నీవే యీ పనులన్ని యొనర్చుటకు మూలకారణుఁడవని తెలియను. ఇట్టి నా యహంకారమెట్లు పాసి చను స్వామీ!

అనలము పాత్ర నుండి చన నయ్యది కాల్చక యున్న నగ్నియే
చనె నిఁక పాత్ర కాల్చుటకు శక్తము కాదను తత్వబుద్ధిఁ దె
ల్యును నిఁక నట్లె నీ కరుణ లోపము నందిన కార్యవిఘ్నముల్
పెనగొన నీ వినా యిల చలింపదు పూరియు నందు రంగరాట్! 95

తా॥ శ్రీరంగనాయకా! పాత్ర చల్లారి యగ్ని పాత్ర నుండి నిష్క్రమించిన పిదప ఇందులో నగ్ని చల్లారిపోయినది. ఇంతవరకు పాత్రలోనుండి అగ్నియే కాల్చినది పాత్రకు కాల్చు శక్తి లేదు అని నిజమును తెలిసినట్లే నీ కరుణ లోపించి కార్యములో విఘ్నపరంపర లెదురైనపుడు పరమాత్ముని కృప లోపించిన గడ్డిపోచయును గదలదు. కావున ప్రతి పనికి కర్తయు నతఁడే యని యనుచుండును.

వింతగు నీ మనఃప్రకృతి విస్తృతమౌ తన జ్ఞానశక్తితో
చెంతఁ గలట్టి వస్తువులఁ జెప్పు ఘటంబు పటం బిదం చయ
స్కాంతము లోహముం బలె సుసాధ్య మిదందు స్వభావశక్తి ని
ట్లింతగ జ్ఞానశక్తి యను నియ్యది భ్రాంతిఁ గదయ్య రంగరాట్! 96

తా॥ రంగనాథస్వామీ! విచిత్రమైన యీ మన స్వభావము విస్ఫుటమైన తన జ్ఞాన శక్తితో సమీపముఁ గల వస్తువుల నిది ఘటము ఇది పటము అని అయస్కాంతము లోహమును వలె పరిచయము చేయును గాని యాత్మ యను నది వేరొకటి లేదందును. అయస్కాంతములో నున్న స్వభావ శక్తిని జ్ఞాన శక్తి యనుట లాశ్చర్యము కదా!

అరయ కాంతప్రస్తరమొ యా యసిపిండమునే గ్రహించుఁ దా
వేరొకదాని నంటదు రవిప్రభ యట్టులు నీవౌ సర్వమున్
ఏరుపడంగఁ జేయు పరమేశ్వరరూపుఁడవైన జ్ఞాత వం
చేరు గ్రహింత్రౌ నిన్ను నదియే కదె తత్త్వవిమర్శ రంగరాట్! 97

తా॥ విచారించి చూచిన సూదంటురాయి యొక ఇనుమునే గ్రహించుగాని తక్కిన విదమరిచిచెప్పు జ్ఞానము నేల కలిగి యుండదు? కావున నిది స్వభావ శక్తియై అదియు నినుము వరకే పరిమితమై యున్నదని తెలియవలెను. రంగనాథా! నీవో సూర్యునివలె నీవస్తు విది యీ వస్తు విది యని పరమేశ్వరుఁడవగు జ్ఞాతవలె ఏర్పాటు సేయు వాఁడవని గ్రహించును గదా! ఇట్టిదే నిజమైన విమర్శ యగును.

అరయ నింద్రియాళి విషయాప్తసుఖాకృతు లంచు నమ్మినన్
ఖరరిపుషట్కదుర్భరముఖమ్ముల కమ్మెను నన్ను నట్టులే
ధరణి కళత్రసోదరసుతప్రకరమ్మును నస్మదీయ మం
చు రహిఁ దలంప జన్మమరణోగ్రభవాంబుధి ముంచు రంగరాట్! 98

తా॥ శ్రీ రంగనాథ ప్రభో! ఇంద్రియములు నాకు విషయ సుఖము లొసంగు ఆప్తులని నమ్మితిని. అవి నన్ను నమ్మించి కామ క్రోధలోభమోహ మద మాత్సర్యము లను అరిషడ్వర్గమునకు అమ్మివేసి మోస మొనర్చెను. ఆ విధముగనే భార్యబిడ్డలు అన్నదమ్ములు మొదలగు బాంధవులు నా వారని నమ్మి వారి సేవ చేసిన వారు నన్ను జనన మరణ రూపమగు సంసార సముద్రమున ముంచిరి గదా!

ఉదధిని దేలియాడు నురు వూర్మిలపైఁ బయినంటుఁగాని తా
నుదధి లోతులం గల సముజ్వలరత్నములంటఁ జాలునే
పదిపది జన్మమృత్యువులఁ బాల్పడు జీవుఁ డదెట్లు జన్మము
క్తిప నిగమాంతతత్వమును దెల్యగఁ జూలును దాను రంగరాట్! 99

తా॥ శ్రీరంగనాయకా! సముద్రముపైఁ దేలియాడు నురుగులు అలల పైననే తేలియాడును గాని అట్టడుగున నున్న సముద్రములోని ముత్తెముల నంటలేవు. అట్లే పదేపదిగ జన్మ మృత్యువు లను తరంగములపైఁ దేలియాడు జీవుఁడు జన్మముక్తి నొసంగు వేదాంతతత్వరహస్యములఁ దెలియఁ జాలఁడు కదా!

కాలిన వస్త్ర మెట్లుడికి క్రమ్మర ధారణముం బొనర్పఁగా
వీలు నొసంగదో యటులె విజ్ఞులఁ దాల్చిన జ్ఞానవహ్నిప్ర
జ్వాలితమౌ శరీర మది జన్మల కక్కఱరాక ముక్తిసం
పాలకసత్సమాశ్రయణ సన్నిధిఁ గ్రాలును రంగరాడ్వరా! 100

తా॥ శ్రీరంగా! ఎట్లు కాలిన వస్త్రము తిరిగి కట్టుటకు ముట్టుటకు అక్కఱరాదో అట్లే తత్వజ్ఞులగు ప్రపన్నులఁ దాల్చిన జ్ఞానాగ్నిచే దగ్ధమైన శరీరము తానది తిరిగి జన్మల నెత్తుటకు కర్మసంబంధము కాలిపోయినది కావున అక్కఱరాక ముక్తిపదసన్నిధిని సమాశ్రయించి యొప్పును గదా!

ప్రథితసముద్రసంగతతరంగములే జనియించి సాగుచున్
నిధనము నొందు; సంద్రమది నిశ్చలతన్ మనియుండు నెప్పుడ
వ్విధి ప్రకృతిప్రభూతపరివేష్టితప్రాణిచయమ్మె డిందు మూ
లధనముఁ బోలు నీ ప్రకృతి లావరు నెట్టులు? రంగరాడ్వరా! 101

తా॥ శ్రీరంగనాథా! ప్రఖ్యాత మగు సముద్రపు తరంగములే పుట్టి సాగుచు పోయి, అస్తమించును గదా! సముద్రము తాను చలనము లేక యెప్పటి వలె నొప్పియుండును. అట్లే యీ ప్రకృతినుండి పుట్టిన ప్రాణులే కొంత కాలము జీవించి నశించును. మూలధనము వలె నున్న యీ ప్రకృతి లేకుండఁ బోవునది అసలే కాదు అని తెలియవలెను.

చిత్తము శుద్ధి చేయునది శ్రీహరి నామ నిరంతర స్మృతుల్
మత్తత దాని నేమరిన మానస మంటి చరించు దుర్గుణాల్
చెత్తయు నాఁచునున్ సరసిఁ జేరఁగనీక కరాన ద్రోసి కిం
చిత్తును నాప తిర్గి యట చేరవె నాఁచును పాఁచి రంగరాట్! 102

తా॥ శ్రీరంగనాథ ప్రభో! చిత్తమును నిర్మల మొనర్చునది నిరంతరము సాగు శ్రీహరి నామ స్మరణములే కదా! ఆ నామస్మరణము మరచితినా ఈ మనస్సులో దుర్గుణములు నిండి చరించును. అట్లే సరస్సులో నాఁచును జేరనీయకుండా ఎప్పుడును చేతులతో వానిని త్రోసివేయ వలెను గాదా! కొంచెము సేపు చేతుల నాపిన తిర్గి వెంబడే నాఁచు వ్యాపించుటలే కదా!

అజ్ఞానం బది రాజ్యమేలిననె కాదా కామ క్రోధాదులున్
విజ్ఞానాప్తవివేక హారులగుఁ బృథ్విం జీఁకటుల్ మూఁగినన్
ప్రజ్ఞాచక్షువు మూసివైచి ధన సర్వస్వమ్మునుం దస్కరుల్
ఆజ్ఞం బెట్టుచు కొట్టి దొంగిలిదురో యజ్ఞేశ! శ్రీరంగరాట్! 103

తా॥ శ్రీరంగనాథా! అజ్ఞానము బుద్ధిలో రాజ్య మేలిననే కదా! విజ్ఞానముతో లభించు వివేకమును కామ క్రోధాదులు హరించును. అట్లే పృథ్విపై చీకట్లు వ్యాపించిననే కదా! ప్రజ్ఞానేత్రమును మూసి దొంగలు ధన సర్వస్వమును దొంగిలించెదరు ఇవ్వనిచో కొట్టి ఆజ్ఞలో పెట్టి కొనిపోవుదురు.

యుక్తాయుక్త వివేకరాహితిని నీచోద్యోగయై యన్యసం
సక్తాత్మన్ జరియించు జారిణియొ భ్రష్టస్వీయసద్వర్ణయౌ
నిత్యానిత్యవివేకరాహితిని నే నింద్యాత్మ సంస్కారినై
యత్యంతం బితరాంత రాశ్రితుఁడ మోక్షానర్హుఁడన్ రంగరాట్! 104

తా॥ శ్రీరంగనాథా! మంచి చెడ్డల వివేకముఁ గోలుపోయినచో నీచమైన వ్యభిచార వృత్తిలో జొచ్చి కులట అన్య స్పర్శగల్గి తన జాతిగౌరవమునే గోలుపోవును. అట్లే నిత్యానిత్య వివేకవిహీనత్వము వల్లనే కదా! నేను నిందింపఁదగిన ఆత్మ సంస్కారము గలిగి ఇతరాంతరసాధనాంతరమంత్రాంతర, దేవతాంతరముల నాశ్రయించి మోక్ష ప్రాప్తికి అనర్హుఁడనై పోవుదును.

ఆధుల కిల్లు, వ్యాధులకు సంగడిసంత, దరిద్రబాధకున్
బా దఘకార్య సంతతికి ప్రాణము, నాశయవిఘ్నరాశికిన్
మేదిని నాటపట్టు, తలమించిన భారము, నారకమ్ముకున్
బోఁదగ రాచబాట భవభూరిభర మ్మెటుఁ ద్రోతు రంగరాట్! 105

తా॥ శ్రీరంగనాథ ప్రభో! ఈ సంసార భారము ఇది తాను చింతలకు ఇల్లు. రోగముల అంగడి సంత. దరిద్ర బాధకు పాదు. పాపసంతతులకుఁ బ్రాణము సదాశయముల వినాశమునకు ఆటపట్టు. తలకు మించిన భారము, నరకమునకుఁ బోవుటకై రాజమార్గము. ఈ సంసార భారము నెట్లు జన్మ జన్మలకుఁ దొలఁగించఁ గలవో స్వామీ!

ఆరయ కర్మ చేయుట నహంకృతి బుద్ధియుఁ దత్ఫలాప్తిలోఁ
గూరు మమత్వబుద్ధి వెదఁ గూడఁగ నీయక సర్వకాలముల్
కూరిమి మీర దాస్యమతిఁ గొల్చుచు భాగవతాళిసేవలో
తీరిక లేక కర్మములదే పనిసేయుటె ముక్తి! రంగరాట్! 106

తా॥ శ్రీరంగస్వామీ! కర్మ మొనర్చుటలో అహంకారము, కర్మ ఫలములపై మమకారమును హృదయములో నెప్పుడు జేరనీయక కర్మను భాగవతదాస్య మను కైంకర్యములో నియమించి నిష్కామముగా కర్మలాచరించుటే ముక్తి మార్గము కదా!

అధిపతి కెందుఁ దత్ఫలము నర్పణ సేయుచు పాలికాపు తా
విధవరొ! నా పొలమ్మ పయి వేఁబడి నీదగు నెడ్లు సస్యముల్
ముదముగ మేయుచుండె నని మూర్ఖు నొకన్ వెస మందలించిన
ట్లు ధరణి నా యహం మమతలుం గనఁ బేరుకె కాదె రంగరాట్! 107

తా॥ శ్రీరంగా! పాలికాఁపు "పాలేరు" తన కృషిఫలితము నంతయును భూమికామందుకుఁ జెందఁ జేయుచు, తాను కాపలాకాయు చేనిలో ఒక మూర్ఖుఁడు దొంగచాటుగా ఎడ్ల మేపుచుండగాఁ గాంచి అరే విధవా! నా పొలముపైఁబడి నీ యెద్దులు మేయుచున్నవి తొలఁగించుమని మందలించుటలో నా చేను అనినపుడు గల అహంకారము మమకారము పేరుకే కదా! అట్టి అహం మమతలు బాధా హేతువులు కావు స్వామీ!

తా సోహమ్మని స్వస్వరూపము నెదన్ ధ్యానించి కైవల్యసం
వాసం బొందుటె మోక్షమౌ ననుట సంభావ్యమ్మె శేషాకృతిన్
దాసోఽహమ్మని భక్తిమార్గమున భక్తవ్రాతముల్ నీకె తా
మో సేవల్పొనరించి శ్రీహరిపదమ్ముం గాంచరే రంగరాట్! 108

తా॥ రంగనాథా! ఈ ఆత్మ తాను ''సోహం'' అని తన స్వస్వరూపమును ధ్యాన మొనర్చి కైవల్య ప్రాప్తిని బొందుట పూర్ణ మోక్ష మనిపించుకొనదు. అది భావ్య మసలే కాదు. శేషత్వముతో ''దాసోఽహ'' మని భక్తులు ప్రపన్నులు నీకే కైంకర్య మొనర్చు చుండుటే పూర్ణమోక్ష మగు వైకుంఠమును బొంది నిన్ను సేవింతురు కాదా శ్రీ రంగనాథా!

## శ్రీ రంగ స్తవరాజము సంపూర్ణము

# స్తవరాజ పంచశతి

శ్రీ మదలర్మేల్మంగా సమేత శ్రీ వేంకటేశాయనమః
శ్రీమతే రామానుజాయనమః

## శ్రీ వేంకటేశ్వర స్తవరాజము

శ్రీలక్ష్మీరుచిరాననోత్పలశశీ! శ్రీవత్సచిహ్నాంకితా!
నీలాంభోజమనోజ్ఞగాత్రవిలసచ్ఛ్రీ రేజపత్రేక్షణా!
బాలార్కప్రతిభాసమానవదనాపధ్వాంతనిర్వాపణా!
త్రైలోక్యాభయదానభద్రకరముద్రా! వేంకటాద్రిప్రభూ! 1

తా॥ వేంకటేశ్వరా! శ్రీలక్ష్మిమనోజ్ఞముఖమను కలువకు చంద్రుఁడవైన వాఁడా! శ్రీవత్సమను నల్లనిమచ్చ వక్షమునఁగలవాఁడా! నీలమేఘమువంటి సుందరశరీరమున నొప్పారు కమలపత్రములవంటి కన్నులు గలవాఁడా! బాలసూర్యుని వలె ప్రకాశించు మోముతో ఆపద లను చీఁకటులఁ బాపువాఁడా! ముల్లోకముల కభయ మొసంగు కరముద్ర గలవాఁడా!

శ్రీకరశేషశైలవరశృంగతటోద్భవభక్తకల్పకా
నోకహసుస్మితాంచితమనోజ్ఞప్రసన్నకృపావలోకనా
నేకసుమాభిరామ! యఘనిర్హరణాభయహస్తపద్మది
వ్యాకృతి! దాసవాంఛితనిజాంఘ్రిఫలప్రద! వేంకటేశ్వరా! 2

తా॥ సంపత్కరమైన శేషగిరిశిఖరప్రదేశమున నుద్భవించిన భక్తుల పాలిటి కల్పవృక్ష మైనవాఁడా! చిరునవ్వులతోఁ గూడిన మనోజ్ఞములగు ప్రసన్నమైన కృపాదృష్టులనే అనేకపుష్పములతో నొప్పుచు పాపములఁ బాపు అభయహస్తపద్మముల దివ్యాకారములుగలవాఁడా! దాసులు కోరుకొను నిజపాదము లను ఫలములుగలవాఁడా! వేంకటేశ్వరా!

శ్రీరమణీ మణి ప్రణయ చిత్తసరోరుహ భృంగ! మార వి
స్తార ధనుర్విముక్త శతపత్ర ప్రవర్షదపాంగ! భక్తి కూ
పార నిమగ్నచిత్త నిజభక్తవరేక్షణ! చాతకోల్ల స
న్నీరద సుందరాంగ! రమణీయ కళాంగజ! వేంకటేశ్వరా! 3

తా॥ శ్రీదేవి యొక్క చిత్తకమలమున వసించు తుమ్మెదరూపైనవాఁడా! మన్మథుని ఎక్కిడిన ధనుస్సునుండి విడివడిన కమలపత్రములవంటి కృపాకటాక్షములు గలవాఁడా! భక్తిసముద్రములో మునిఁగిన స్వంతభక్తుల చూపు లనెడి చాతకములకు మేఘమువంటి సుందరశరీరము గలవాఁడా! దివ్యకళలచే మన్మథుఁడైనవాఁడా! వేంకటేశ్వరా!

శ్రీదయితా మనోహర! విశిష్ట గతి న్నిను బాడు నా చతు
ర్వేద నినాదముల్ విపులవిశ్రుత దార్శనిక ప్రమాణ సం
వాదములున్ చతుర్ముఖ శివ ప్రముఖాఖిల భక్తకోటి మీ
పాదములే శరణ్య మని పల్కుచునున్నవి వేంకటేశ్వరా! 4

తా॥ లక్ష్మీనాథా! చక్కని రీతిలో నిన్ను బాడు ఆ నాల్గు వేదముల ధ్వనులు విశ్రుతి కెక్కిన వివరముగల ప్రమాణములగు దర్శనముల సంవాదములును, బ్రహ్మ శివుఁడు మొదలుగాఁగల భక్తసమూహము మీ పాదములే శరణమొందఁ దగినవని రక్షకములని పల్కుచున్నవి వేంకటేశ్వరా!

శ్రీధరణీ మనోహర! యశేషత నిన్గొనియాడ నోడరే
వేద పురాణశాస్త్ర కృతి వీథుల శర్వపితామహాదులం
చే దిగులొందనేల? జలమెల్లయుఁ ద్రావక నీదు పాదగం
గోదక మాత్మతర్షమును నోసరఁ జేయదె వేంకటేశ్వరా! 5

తా॥ శ్రీదేవీభూదేవులకు భర్తవైనవాఁడా! వేదపురాణశాస్త్రచర్చలతో హరబ్రహ్మాదులుఁ గూడ నిను గొనియాడ నోడిపోరా? యని నేను భయపడు టేల? దప్పినార్చుకొనుటకు గంగోదకమంతయుఁ ద్రాగవలసిన అవసరమేమున్నది? వేంకటేశ్వరా!

నీదు పదమ్ములం గడుగు నీరము లౌటనె కాదె గంగ బ్ర
హ్మాదిసురల్ నుతింప గరళాశను డౌదలఁ దాల్పఁ గల్మష
చ్ఛేదకమై, భగీరథవిశిష్టతపఃఫలసారమై, ప్రజా
మోదకరంబునై, సగరముక్తిదమై మను వేంకటేశ్వరా! 6

తా॥ ఓ వేంకటేశ్వరా! నీ పాదములు కడుగుకొను నీళ్ళగుటవల్లనేకదా! గంగను బ్రహ్మాదిదేవతలు పొగడుట, విషము గళమున ధరించు శంకరుడు తల ధరించుట, పాపముల నశింపఁజేయు శక్తి కలదగుట భగీరథు తపస్సుతోఁగాని భూమికి దిగిరాకుండుట, ప్రజామోదమును బొందుట సగరులకు ముక్తిప్రదమై యొప్పుట గల్గి యున్నది గదా!

పాదయుగంబు కల్పతరుపల్లవపుష్పకృతంబు, స్వచ్ఛగం
గోదకసన్మరందకృతయోగిజనేక్షణభృంగసమ్మదో
త్పాదకరంబు, నిత్యనిజభక్తమహోగ్రభవాబ్ధితారక
శ్రీదవహిత్రయుగ్మమయి, చెల్వమరున్ ధర వేంకటేశ్వరా! 7

తా॥ మీ రెండు పాదములు కల్పవృక్షము యొక్క చిగుళ్ళను పూవులను మెదిపి చేయఁబడినవి. అందలి తేనెయే గంగోదకము. దాని గ్రోలు తేంట్లు నీ భక్తిసల్పు యోగిజనుల నల్లని చూపులు. ఆ తేనె వారికి మోదమిచ్చును. నీ రెండు పాదములు నీ భక్తుల ఘోరసంసారసముద్రమును దాఁటించు జంట ఓడలై శోభిలును వేంకటేశ్వరా!

సుందరరూప! నీదు పదశోభలఁ గ్రోలెడి కంటిపాప లిం
కెంద రదేమి చెప్పినను నెందును గాంచవు; తల్లి చన్నులన్
విందులు గ్రోలు పాప లవి వీడు మటన్నను నేద్వకుండఁగా
నుందురె, తావకాంఘ్రి విడ నొప్పదు నా మది వేంకటేశ్వరా! 8

తా॥ ఓ చక్కదనాల వేంకటేశ్వరా! నీ పాదాల సౌందర్యమును గ్రోలు కంటిపాపలు ఇంకెంద రెన్నివిషయాలు జెప్పినను వానివైపుఁ గాంచవు. తల్లి చనుబాలు త్రాగు చంటిపాపలు వానిని విడిపించిన నేద్వకుండఁగా నుందురెట్లు? ఆ విధముగానే నా హృదయము మీ పాదధ్యానము విడఁజాలదు.

దివిభువులన్ బదద్వయి మితిం దగఁ గొల్చు త్రివిక్రమాకృతీ!
భవదమలాంఘ్రియుగ్మమును బాయక కొల్చెడి భక్తకోటి వై
భవయుతభుక్తిముక్తు లనఁ బాణితలామలకంబులై చనన్
రవిశశిదివ్యదీధితుల రాజిలకుండునె? వేంకటేశ్వరా! 9

తా॥ దివి భువులను రెండడుగుల మేరకుఁ గొల్చు ఓ త్రివిక్రమా! వేంకటేశ్వరా! మీ యడుగు దోయిని గొల్చు భక్తులును మహావైభవముతో నొప్పారు భుక్తి ముక్తులు వారికి కరతలామలకములై పోవ సూర్యచంద్రుల వలె దివి భువుల వెలిగించుచు నుండరెట్లు?

నవసంధ్యారుణశోభలన్ బదము క్రిందం ద్రొక్కి సుస్నిగ్ధకై
రవనీలాంబుజముల్ పదాలఁ బడుచున్ రాఁజేయు నక్షత్రవై
భవసర్వస్వము గోట మీటు నని మీ భవ్యాంఘ్రికిన్ దృష్టిదో
షవినిర్ముక్తి కిడున్ నివాళి పదభూషల్ వేంకటాద్రిప్రభూ! 10

తా॥ సంజ కెంజాయల పదాల క్రిందఁ ద్రొక్కిపట్టుచు, సుందరములగు కమలముల కలువల కాళ్ళబడి రాఁజేయుచు చుక్కల శోభలను గోట మీటుచు ప్రకాశించు మీ పాదాలకు దృష్టిదోషము తగులకుండా మీ నవరత్నములు పొదిగిన పాదభూషణములు తమ సహజములగు కదలికలతో నివ్వాళు లర్పించు చున్నవి గదా ఓ వేంకటేశ!

హరి! యుష్మన్మృదుగుల్ఫయుగ్మరమణీయాకారరేఖాద్యుతుల్
హరియించున్! హరినీలసన్మణిమనోహారిప్రభాపూరమున్
మొరయించున్ సుమరాళమంజులగుణామోఘశ్రుతుల్ చారునూ
పురమంజీరవిభూషణధ్వనుల నెప్డున్ వేంకటాద్రిప్రభూ! 11

తా॥ హరీ! వేంకటేశ్వరా! మీ చీలమండల అందాల రూపురేఖలు ఇంద్రనీలమణుల కాంతిసంతతుల హరియించుచున్నట్లున్నవి. అందలి నూపురములు, మంజీరములు (పాజెవులు - కాళ్ళకడియములు) అమోఘములైన వేద నినాదము లొనర్చు కలహంసల జంటలు కలహించుచున్నట్లున్నవి కదా!

కమఠముపైన మందరనగ మ్మటు జంఘిక లంఘ్రు లంటుచున్
గ్రమగతి మంథన మ్మొలయఁగా జనియించు సుధారసమ్ము నా
నమరఝరిన్ సృజింపఁ గనకాంబరడంబరచారుతాబ్ధిలో
సుమశరముద్గరమ్ము లన శోభిలు చున్నవి వేంకటేశ్వరా! 12

తా॥ కూర్మావతారముపైన మందరగిరి పర్వత శిఖరము వెలింగినట్లు మీదగు మీగాళ్ళపైన పిక్కలు శోభిలుచు మీ సౌందర్య సముద్రపు టడుగుఁదట్టి ఆనందామృతమ్మును ద్రచ్చుచున్నవా యనునట్లు సురగంగల సృజింపఁ గనకాంబర మను సువర్ణ సముద్రములో మన్మథుని ముద్గరమ్ము లనఁగా విరాజిల్లు చున్నవి వేంకటేశ్వరా!

శ్రీసతి తావకీనమృదుశ్రీపద సేవ లొనర్ప నేర్పుమై
నోసరకన్ పదాబ్జముల నొత్తఁగ జంఘికలన్ మనోజ్ఞతన్
భాసిలు తత్సతీపరమపావనదివ్యకరారుణాంగుళుల్
భాసురమేఘసంతతులఁ బర్వుఁ దటిద్గతి వేంకటేశ్వరా! 13

తా॥ లక్ష్మీదేవి మీ మెత్తని పాదాల నొక్కింత నేర్పుతో నొత్తుచుండఁగా మీ పిక్కలపైఁగదలియాడు ఆమె పరమ పవిత్రమైన కోమలములైన ఎఱ్ఱని వ్రేళ్ళు గాంచిన ప్రకాశించెడి మేఘమండలములో పర్వెత్తు మెఱుపు తీఁగలై కనఁబడుచున్నవి కదా వేంకటేశ్వరా!

కోమలగూఢజత్రువులకున్ బయి నొప్పెసలారు నూరువుల్
శ్రీమహితంబులై మరియు శ్రీలలనా సహితంబులై లసత్
భూమహిళాయుతంబయి విభూతుల రెంటికి మీర లొక్కరే
స్వాము లటంచు నిబ్బువిని జాటుచు నుండెను వేంకటేశ్వరా! 14

తా॥ వేంకటేశ్వరా! ఉభయ లోకముల దొరా! సుకుమారములై ఎముకలు తేలి లేకుండా నున్న మోఁకాలి కీళ్ళకుఁ పైన నున్న తొడలు సంపత్కరములై లక్ష్మితోఁ గూడుకొన్నవై భూదేవితోఁ గూడ ప్రకాశించునవై ఈ లోకమునకు మరియు పరలోకమగు పరమ పదంబునకు ఈ రెండు విభూతులకు దొరలు మీరేనని ఈ ప్రపంచము నిండ చాటుచున్న వనఁ జెల్లును.

ఊర్వశి తావకీనరుచిరోరుతటమ్మునఁ బుట్టుటం గదా!
సర్వజనమ్ములుం బొగడు చక్కనిచుక్క యన న్వెలింగె దు
ర్గర్వము మీర రంభ తమ కాళులకున్ సరి రాదలంచి యా
యుర్వి శిరమ్ము క్రిందగుచు నొప్పగ నిల్చెను వేంకటేశ్వరా! 15

తా॥ ఊర్వశి మీ చక్కని తొడలనుండి పుట్టట వల్లనే గదా సర్వజగత్తులు పొగడు నటువంటి చక్కని చుక్కగా ప్రకాశించుచున్నది. అది గాంచి రంభ గర్వముతోఁ గూడినదియై మీ పాదములకు సరి రాఁ దలంచినదియై మీ శ్రీపాదముల సౌందర్యమునకు సరిరాలేక తలక్రిందులు నొనర్చి (రంభ)అరటి వృక్షమై దిగులుపడి నిల్చిపోయెనో? స్వామీ వేంకటేశ్వరా!

ప్రావృట్కాలవినీలనీరదశరీరా! తార్క్ష్యపృష్ఠోపరిన్
శ్రీవామామణి నంకమం దిడి నభస్సీమన్ బ్రయాణించుచో
సౌవర్ణాభరణా ప్తహీరసవిధాంచత్సన్మసారమ్ముగాన్
సేవింతున్ మహనీయవిగ్రహుని నిన్ శ్రీవేంకటాద్రిప్రభూ! 16

తా॥ తొలకరి మబ్బుల వంటి నల్లని సుందరమైన శరీరము గలవాఁడా! గరుత్మంతుని మూఁపుపైన లక్ష్మీదేవిని తొడపై కూర్చుండఁ బెట్టుకొని ఆకాశ మార్గములోఁ బ్రయాణించు సమయమున బంగారునగలోఁ బొదిగిన వజ్రమునకు సమీపములో నున్న ఇంద్రనీలమణిని వలె మీ మహనీయ విగ్రహము సేవ సాయించును గదా వేంకటేశ్వరా!

విష్ణుకళా త్వదీయకటి విశ్వవిహారసమస్తభూతవ
ర్ధిష్ణువు జీవకోటిపరివేష్టితరాజదజాండపిండమం
దోష్ణకరంబు హాటకసముజ్జ్వలవర్ణదుకూలకాంతిభ్రా
జిష్ణు వటంచు స్వాంతమునఁ జింతన చేసెద వేంకటేశ్వరా! 17

తా॥ వైష్ణవకళలతో నొప్పువాఁడా! మీ కటిభాగము (మొల) విశ్వమంతటిలో విహరించే సమస్తభూతములఁ బెంచునదియు, సమస్తబ్రహ్మాండములపై పొదిగి వెచ్చదనము నిచ్చునదియు, (కోడి పిల్లలను సేయుటకు ముందువలె) పచ్చని బంగారు కాంతుల నీను పీతాంబరములచేఁ బ్రకాశించునదై యున్నది కదా! యని హృదయములో మిమ్ము భావింతును శ్రీవేంకటేశ్వరా!

హరినీలాభమ్మృదూదరావని గభీరావర్తనాభీహ్రదాం
తరసంజాతమనోహరాబ్జసుఖసద్మంబందు వాగ్భర్త బం
భరమై వేదమరందపానరతి నున్మత్తుండనై సేయు సు
స్వరసామశ్రుతిఁ దృప్తిఁ గాంతువె పరేశా! వేంకటాద్రిప్రభూ! 18

తా॥ ఇంద్రనీలమణివర్ణముఁ బోలు మెత్తని మీ యుదరప్రపంచములో లోతుగానుండి సుడులు దిరిగిన మీ నాభీసరస్సులో బుట్టిన సుందరమగు కమలమను ఇంటిలో నా బ్రహ్మదేవుఁ డొక తుమ్మెదయై వేదసార మను తేనె పానము సేయుచు నున్మత్తుని వలె నుండి చేయు సామగానశ్రుతిని సంతోషించుచున్నావా! వేంకటేశ్వరా! పరమునకు దొరయైనవాఁడా!

కౌస్తుభరత్నచంద్రసువికాసకమై సరసప్రపూర్ణమై
నిస్తులహీరమౌక్తికవినిర్మితనిర్మలహారపూర్ణమై
శస్తనవాంబుదద్యుతివిసారిభవత్సుహృదబ్జపీఠిఁ దా
విస్తృతి వెల్గ నబ్ధి యని వీడదు నిన్ రమ వేంకటేశ్వరా! 19

తా॥ కౌస్తుభరత్న మనెడి చంద్రునితోఁ గూడినదియై రసస్వరూపమైనదై హారములతో వెలుంగు తులలేని వజ్రవైడూర్యాదినవరత్నములతోఁ గూడినదై, ప్రశస్తమైన తొలకరి మేఘవర్ణములో నుండునదై విశాలమైనదై యుండుటచే ఇది నా తల్లి యిల్లగు సముద్రమే యని భ్రమపడి లక్ష్మీదేవి నిత్యము నీ వక్షమును విడనాడకుండునేమో? వేంకటేశ్వరా!

అతులితరామణీయకమహార్ణవ మందునఁ బుట్టి రత్నసం
తతులను జుట్టిలక్ష్మి కయిదండల నండగ నుండి వేదసం
గతిఁ గొను నీ గళంబు వరకంబువుకే సతతంబు సద్గుణ
ప్రతతులఁ జెప్పుచుం బ్రణవపాఠము నేర్పదె? వేంకటేశ్వరా! 20

తా॥ తులలేని సౌందర్యసముద్రములోఁ బుట్టి అందలి రత్నసమూహముతోఁ జుట్టుముట్టఁబడి, లక్ష్మీదేవికరకమలములలో ఆటవస్తువుగా నలరి, వేదములను పఠించుచుండు నీ కంఠము శంఖమునకే (పాంచజన్యము)(గుణము) ధ్వనించుటలు నేర్పుచు ఓంకారపాఠక్రమముల వల్లెవేయుటను చెప్పుచున్నది కదా వేంకటేశ్వరా! అనఁగా నీ కంఠము శంఖమును మించిన సుందరత గలది సుమా!

శ్రీప! స్వభక్తషట్పదసుసేవ్యభవద్వదనారవిందసం
దీపితమంజులాధరము నిస్తులభాగ్యరమానురాగని
క్షేపము, దంతపంక్తులు విశిష్టశుచిస్మితకుందకుట్మలా
క్షేపకకాంతి నాశ్రితుల సిల్గుటిరుల్ దునుమాడు శ్రీపతీ! 21

తా॥ ఓ శ్రీపతీ! నీ భక్తులను తుమ్మెదలకు సేవింపఁ దగిన నీ ముఖ కమలము నందు ప్రకాశించు సుకుమారమైన అధరము (క్రిందిపెదవి) తులలేని భాగ్యముఁ గల లక్ష్మీదేవి యొక్క ప్రేమనిదానము గదా! ఆ పలువరుస తెల్లని శ్రేష్ఠమైన నగవుల మొల్లమొగ్గల నాక్షేపించుచున్నది. ఆ దంతముల నగవు కాంతి నీ భక్తుల కష్టముల రూపమున నున్న అంధకారమును తరిమివేయు చున్నది గాదా!

భాసురభ్రూయుగమ్ము సుమబాణుని దివ్యశరాసనమ్ముగా
నాసికయున్ స్మితమ్ము నటనాంచదపాంగము లయ్యనంగ బా
ణాసనముక్తచంపకసుహారకృతార్జునమల్లికాంబుజ
ప్రాసములై జగన్నయనపర్వములై మను వేంకటేశ్వరా! 22

తా॥ నీ బొమదోయి మన్మథుని ధనుస్సుగాఁ బ్రకాశింప నందు దానినుండి విడిఁబడిన సంపెంగ మొల్లమొగ్గల గుత్తి కమలపుష్పముల ననుకరించుచు అందు అనఁగా బొమదీవె క్రింద నీ నాసిక చిరునవ్వు నటించు క్రేగంటి చూపులు మన్మథుని పూలబాణాల జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి వేంకటేశ్వరా!

నీటగు పద్మరాగహరినీలహరిన్మణి హీరతారసత్
కూటమహోజ్జ్వలార్ఘ్యమణిగుంఫితమై పదియారువన్నె మే
ల్హాటకరత్నదీప్తిఁ దనరారు కిరీటము ప్రాఙ్నగాగ్ర స
ద్వాటి జనించు భాస్కరుని భాతి వెలుంగిడు వేంకటేశ్వరా! 23

తా॥ స్వచ్ఛమైన పద్మరాగములతో నింద్రనీలమణులతో వజ్రములతో ముత్యములతో పొదుగఁబడిన నీ మేల్మి పైడికిరీటమును గాంచ నీ నల్లని తనువుపై అది తూర్పుకొండ శిఖరాగ్రముపై సగము మాత్రమే ఉదయించిన సూర్యబింబమువలె వెలుఁగుచున్నది వేంకటేశ్వరా!

నిండగు చెల్వపుం గొలని నీరజశోభల నొప్పు నేత్రముల్
మండితరత్నదర్పణసమద్యుతిఁ గ్రాలు కపోలపాళి నీ
రెండలు గాయ, కర్ణభృతహీరమసారరుచిప్రపూరస
త్కుండలయుగ్మ మర్యమవిధుప్రభ లీనెడి వేంకటేశ్వరా! 24

తా॥ సౌందర్యసముద్రములో వికసించిన కమలముల వలె ప్రకాశించు నీ కన్నులును, మణిదర్పణములవలె నున్న నీ చెక్కులు, వానిపై వజ్రముల నీలమణుల కాంతులతో ప్రకాశించు చెవులలో వెల్గు కుండలములు నీరెండఁ గాయుచు సూర్యచంద్రులవలె ప్రకాశించుచు మనోజ్ఞముగా నున్నవి ఓ వేంకటేశ్వరా!

నీలకలావిలాసముఖనీరజ! చందనమార్గబిందుశో
భాలలితోర్ధ్వపుండ్రయుతఫాల మపారకృపారసాబ్ధిలో
బాలశశాంకుఁడై యెసఁగఁ బల్మరు నాట్యములాడు ముంగురుల్
మేలములాడుఁ జంద్రరతమేఘకదంబము వేంకటేశ్వరా! 25

తా॥ నల్లని కళల మొగముతో నొప్పు ఓ శ్రీనివాసా! శ్రీగంధము కస్తూరి గూర్చి నిర్మించిన నిల్వునామముతో నొప్పు నీ నొసలు కృపారససముద్రములోఁ బుట్టిన పిల్లచంద్రుని బింబమై యొప్పార దానిపై నాట్యాల నొనర్చు ముంగురులు బాలచంద్రుని గప్పి యాడు మేఘమాలల వలె శోభల నీనుచున్నవి గదా!

మానుగ శేషపీఠమున మాసతి భూసతి చేరి కొల్వఁగా
జానువు లంటు హస్తములు చారుమదేభకరాభశోభలై
కానఁబడన్ ద్వదీయసువికాసవిలాసకృతావతారముల్
మానసగోచరమ్ములగు మార్గముఁ జూపవె వేంకటేశ్వరా! 26

తా॥ ఆదిశేషుఁ డనెడి మృదువగు పీఠముపైన శ్రీదేవి భూదేవి చేరి సేవ లొనర్చుచుండఁగా మోకాలివరకు వ్రేలాడు హస్తములు మదించిన ఏనుఁగు గున్న తొండములవలె ప్రకాశించుచు కనఁబడఁగా అత్యంతవిలాసముల నీను నీచే ధరింపఁబడిన అనేకావతారరహస్యములు నా మనస్సునకు గోచరమగు మార్గముల నుపదేశింపవే వేంకటేశ్వరా!

సురుచిరదృక్సరోజముల సూనశరుం బ్రసవించు మించు శ్రీ
హరియగు శ్రీనివాసు ప్రణయామృతపూర్ణమనస్సరోవర
స్ఫురితతరంగడోలికల సొంపుగఁ దూఁగెడి రాజహంసిసుం
దరి యలమేలుమంగఁ గొని దర్శన మీయవె వేంకటేశ్వరా! 27

తా॥ క్రేఁగంటి చూపుల నీను నేత్రకమలములలో మన్మథుని ప్రసవించు మెఱపుఁదీవె, శ్రీహరియైన శ్రీనివాసుని ప్రేమామృతపూర్ణహృదయసరోవర తరంగము లనెడి ఊయెలల పైన అందముగా తూఁగియాడు రాజహంసి యగు సుందరి శ్రీఅలమేల్మంగతోఁ గూడి సొంపుగా దర్శన మీయవే శ్రీనివాసా!

బాహువు లొప్పు దేవరకుఁ బంచశిరోరగదివ్యశోభకున్
దోహదమై వినీలమృదుదోర్యుగ మందున శంఖచక్రముల్
మోహనమౌ శిరోమణులఁ బోలును జానువు లంటి వ్రేలు మీ
బాహుయుగంబునం దమరు పద్మగదాదులు వేంకటేశ్వరా! 28

తా॥ దేవర బాహువులు ఐదుతలలు గల ఫణులవలె శోభల నీనుచున్నవి. ఆ నల్లని బాహువులలో, శంఖచక్రములు సర్పముల శిరస్సులపై ప్రకాశించు మణులవలె ప్రకాశించుచున్నవి. ఇంకను మీ బాహువులలో పద్మము, గద మొదలగు ఆయుధాలు మిక్కిలి శోభల నీనుచున్నవి శ్రీవేంకటేశ్వరా!

పరమపదమ్మునం దలరు భక్తజనాళికి దర్శనమ్ము దు
ష్కరమగు ధారుణి న్వసతిగాఁ గొన నిర్జరపాళి దూరమౌ
సురనరతిర్యగాళి దయఁ జూడఁగ నుండెద నందుబాటులో
తిరుమల నంచు నీ కొలువుఁ దీర్చితివా యిట వేంకటేశ్వరా! 29

తా॥ పరమపదములో నీవుంటే భక్తజనులకు దర్శనమిచ్చుట దుర్లభ మనియు, మరి భూమిపై నుంటే దేవతాదులకు దర్శనమొసంగుట చాల కష్టమని తలంచి; నరులకు, సురలకు, పశు, పక్షి, మృగాదులకు దర్శనమొసంగుటకు అందఱికి అందుబాటులో నుండు పద్ధతిలో తిరుపతి కొండపై వసించినావా వేంకటేశ్వరా!

తావక దివ్య మంగళ సుధామయ విగ్రహ దర్శనమ్మునన్
బావన మయ్యె జన్మ భవబంధము లూడె, మహోఘవార్ధికిన్
నావ లభించె, ఘోరమగు నారకబాధ నశించె, ముక్తికిన్
ద్రోవ జనించె నిన్ను కనుదొన్నెలఁ ద్రావెద వేంకటేశ్వరా! 30

తా॥ నీ దివ్యమంగళవిగ్రహమును దర్శించుటవల్ల నా జన్మ పావనమైనది. సంసారబంధములు తమంత తాము ఊడిపోయినవి. పాపసముద్రము తరింపఁగాఁ జక్కని ఓడ లభించినది. భయంకరమగు నరకబాధ నశించినది. ముక్తికి త్రోవ దొరికినది. ఇట్టి నీ సౌందర్యము నా కన్నులనే దొన్నెలతోఁ దనివిదీరఁ ద్రావువాఁడను శ్రీనివాసా!

నలువ శయింప సోమకుఁడు నాలుగు వేదములన్ హరించి యా
జలనిధిలోన దాఁగిన ఝషమ్మయి వానినిఁ బట్టి చంపి మిన్
కులజుని కిచ్చినా వటులె కొల్పడు జ్ఞానము నాకొసంగి సం
సరణమహాబ్ధి నిస్తరణశక్తి నొసంగవె వేంకటేశ్వరా! 31

తా॥ బ్రహ్మదేవుఁడు పడుకొని యుండగా సోమకుఁడను రాక్షసుఁడు నాల్గు వేదముల హరించి సముద్రములో దాఁగుకొన్న చేప రూపు ధరించి వాని బట్టి చంపి ఆ వేదములు తిరిగి బ్రహ్మ కొసంగితివి. అట్లే నేను అనేక జన్మల నుండి పోఁగొట్టుకొనిన ఆత్మజ్ఞానము నాకిచ్చి సంసారసముద్రమును దాఁటఁగల శక్తి నొసంగవే వేంకటేశ్వరా!

అమరజనావనార్థము మహామృతపాన మొసంగ వార్ధిలో
కమఠమ వౌచు మందరనగమ్మును మూఁపునఁ దాల్చినాఁడవే
కుమతి ననాదికర్మకుల గోత్ర భరమ్ము కరమ్ము నోర్చి న
న్నమరుని జేసి బ్రోవ బరువా? కరుణామయ! వేంకటేశ్వరా! 32

తా॥ దేవతలను రక్షించుటకు అమృతపానమును వారికిచ్చుటకు సముద్రములోఁ దాఁబేలువై మందరపర్వతభారమును మూఁపుపై దాల్చినాఁడవే! అట్లే ఈ దుర్మార్గునికి అనాదినుండి సంప్రాప్తించు కులగోత్రభారముల అత్యంతము శ్రమపడి మోసి నన్ను జరామరణరహితమైన ముక్తి నొసఁగి బ్రోవవే వేంకటేశ్వరా!

ఆదివరాహరూపమున నబ్ధిని మున్గి కలంగు నట్టి యి
మ్మేదిని ముస్తె చంచమున మేదుర దంష్ట్రిక నుద్ధరించినా
వే? దురితాబ్ధిలో మునిఁగి యెంతయు వందురుచుంటి నన్ను నో
శ్రీ దయితా! సముద్ధరణఁ జేయవె పాయక వేంకటేశ్వరా! 33

తా॥ ఆదివరాహరూపముఁ దాల్చి సముద్రములో హిరణ్యాక్షునిచే ముంచఁబడిన యీ భూమిని తుంగగడ్డ వలె నీ తెల్లని కోరపై నెత్తి ఉద్ధరించినాఁడవు. అట్లే పాపసముద్రములోఁబడి మునిఁగి యెంతయో బాధపడుచుంటిని. ఆ నా ప్రకృతిని సముద్ధరించఁ దప్పక నన్ను కాపాడవే వేంకటేశ్వరా!

నరసింహాకృతితో హిరణ్యకశిపు న్నాశంబుఁ గావించి శ్రీ
వర! ప్రహ్లాదుని దావకీనపదసద్భక్తాగ్రగణ్యున్ దయా
పరతన్ బ్రోచితి వాసురీప్రకృతి తద్భంగిన్ శ్రమల్వెట్టుఁ ద్వ
చ్చరణాహ్లాదుని నన్ను బ్రోవవదె? శ్రీశా! వేంకటాద్రిప్రభూ! 34

తా॥ శ్రీనరసింహావతారమును దాల్చి హిరణ్యకశిపుని జంపి నీ పాదభక్తులలో మొదటివాఁడగు ప్రహ్లాదుని దయతోఁ గాపాడినావు. అట్లే ఆసురీ ప్రకృతితో నిరంతరము బాధపడు నీ పాదభక్తుని నన్ను రక్షించ వెందులకు ఓ వేంకటేశ్వరా!

అల బలిచక్రవర్తి త్రిపదావనినీయఁ ద్రివిష్టపమ్ములన్
గొలిచి త్రివిక్రమాకృతి నకుంఠగతిన్ దదహంకృతిన్ రసా
తల మడఁగారఁ ద్రొక్కితివి తద్గతి మామక దుష్టగర్వమున్
బలిఁగొని నీ పద మ్మొసఁగి పావను జేయవె వేంకటేశ్వరా! 35

తా॥ నాఁడు బలిచక్రవర్తి మూఁడడుగుల భూమి నిచ్చిన మూఁడు లోకములను కొల్చుకొని వాని యహంకారమును పాతాళలోకము అడఁగిపోవునట్లుగా త్రొక్కితివి. అట్లే నాదగు అహంకారమును గర్వమును బలిగాఁ గొని నీ పదము నొసంగి నన్ను పావను జేసి ఏలుకొనవే శ్రీవేంకటేశ్వరా!

పరశువు కేలఁ దాలిచి యపారవిపక్షకులక్షయమ్ముగా
నిరువదియొక్క మారులు నిహీననృపాలురఁ జెండి యివ్వసుం
ధరను జయించి మించితివి తద్గతి నా మది నాక్రమించి స
చ్చరితము రూపుమాపు రిపుషట్కముఁ ద్రుంపవె వేంకటేశ్వరా! 36

తా॥ పరశువు కేలఁ దాల్చి పరశురామమూర్తివై అత్యంతముగా శత్రుకులము వినాశము పొందఁగా నిరువదొక్కమారులు నీచులగు నృపాలుర క్షత్రియాధములఁజెండివైచి యతిశయించితివి. అట్లే నా బుద్ధి నాక్రమించి యున్న నా సచ్చరిత్రను నశింపఁ జేయుచున్న కామక్రోధాదుల నశింపఁజేయ వెందులకు వేంకటేశ్వరా!

దశవదనుండు జానకిని దస్కరణ మ్మొనరించి యేఁగ నా
పశువును సంహరించి సతి బంధవిముక్తి నొనర్చినా వహో!
దశరథరామ! నన్నటులె దర్ప మెలర్ప దశేంద్రియమ్ములున్
వశ మొనరించె నేల భవబంధముఁ బాపవు? వేంకటేశ్వరా! 37

తా॥ దశవదనుఁడగు రావణుఁడు జానకిని దొంగిలించుకొని పోఁగా ఆ పశువును చంపి సతియైన సీతకు బంధవిముక్తిని చేకూర్చినాఁడవు. ఓ దశరథరామ! నా ఆత్మ నట్టులే దశేంద్రియములు తమ వశ మొనర్చికొని బంధించినవి. ఏల నా యీ బంధమును నశింపఁజేయవు వేంకటేశ్వరా!

కురుసభ దుస్ససేనుఁడతి క్రూరతఁ జీరలు లాగువేళ, దు
ర్భరగురుదుఃఖతప్త యయి ద్రౌపది కృష్ణ యటంచు వేడ నం
బరముల నక్షయమ్మొసఁగి మానముఁ గాచితి వట్టులే జరా
మరణభయాతిరిక్తతను మండితుఁ జేయవె వేంకటేశ్వరా! 38

తా॥ కౌరవ సభలో దుశ్శాసనుఁ డతిక్రూరముగా ద్రౌపది చీరలనొల్చుచుండఁగా ఆమె భరింపరాని దుఃఖవేదన గలదై ఆర్తిగొని 'హా!కృష్ణా!' యని యాక్రందన మొనర్పఁగా అక్షయ వస్త్రముల నొసంగినాఁడవు. ఆమె మానముఁ గాపాడినావు. నాకటులే జరామరణములు లేని అక్షయశరీరము ననుగ్రహించి దయజూడవా వేంకటేశ్వరా!

సర్వజ్ఞుండవు సర్వసాక్షి వయయో! స్వామీ! జగన్నాథ! యీ
యుర్విన్ ధర్మపథమ్ములన్ నడపఁగా నూహించి భక్తాళికిన్
నిర్వాణమ్మొ నొసంగ సర్వసమతన్ నిర్మించి బుద్ధాకృతిన్
నిర్వేదమ్మును బాపి యేలితివి తండ్రీ! వేంకటాద్రి ప్రభూ! 39

తా॥ సర్వజ్ఞుండవు, సర్వసాక్షివైన బుద్ధరూపుఁడవైన ఓ జగన్నాథా! ఈ ప్రపంచములో ధర్మమును సర్వ సమతను నిల్పి భక్తులకు నిర్వాణము నొసంగిఁ బ్రోచితివి. జరామరణ జన్మాది బాధల ప్రజకుఁ బాపి కాపాడినావు. ఓ తండ్రీ! నీవే ఆ బుద్ధాకృతివి వేంకటేశ్వరా!

కలినిఁ గరాళహేతిఁ గొని కాపురుషాధమజాతులందరిన్
బలిఁగొనఁ గల్కిరూపి వయి, వైదికధర్మమి నుద్ధరింపఁగా
వెలసెద వంట, నా హృదయవీథుల నట్లె నధర్మతండముల్
కలఁతలు వెట్టు వాని నెటు ఖండన జేతువొ వేంకటేశ్వరా! 40

తా॥ కలికాలములో భయంకరమగు ఖడ్గమును బూని, దుష్టజాతుల నన్నింటిని చెండివైచుటకు కల్కిరూపమును ధరించి వైదిక ధర్మాలను రక్షింపఁగా నవతరించెదవట. అట్లే హృదయ ప్రపంచములో అధర్మ తండములు నన్ను కలఁత వెట్టుచున్నవి. వాని నే రీతిగా ఖండింతువో వేంకటేశ్వరా!

జలఫలపత్ర పుష్పమధు సంతతిఁ గైకొని పూజసేయఁగా
దలఁచితి స్వర్ణనిష్కరజత ప్రవిదీప్త ధనాళి గాదెలో
పలనిడి నీ ఋణమ్ములను బాపఁగ నెంచితి భూసతీ రమా
లలనలు నీదు భార్యలని లక్ష్యమొనర్పక వేంకటేశ్వరా! 41

తా॥ పత్రమో పుష్పమో ఫలమో జలమో గైకొని, నీ పూజ సేయ నెంచితి. కాని ఇవన్నియు భార్యయైన భూదేవి ఇచ్చినవే యని తెలియఁ జాలనైతిని. అట్లే వెండి, బంగారు నాణెముల నగల తీసికొని నీ గాదెలో వేయఁ దలఁచితిని. కాని ఇవి నీ భార్య యగు లక్ష్మీదేవి ఇచ్చినవే యని మది విచారించ నైతిని. కావున నీకు సమర్పించ నా దనునది నా యొద్ద ఏమిలేదు శ్రీ వేంకటేశ్వరా!

అన్యుల మోసగించుటకునై నిజవిద్య నశక్తుఁ గాంచి దౌ
ర్జన్య మొనర్ప బాహుబలసంపద నాశలఁ బెంచి దీప్తసౌ
జన్యము గోలుపోవుటకె చాల ధనమ్ము గడించువాఁడ నే
ధన్యత నొంద నీ చరణదాస్యముఁ గోరను వేంకటేశ్వరా! 42

తా॥ ఇతరులను గాంచి మోసము చేయుటకు విద్యను, అట్లే ఆశక్తులను దౌరన్య మొనర్చి నొప్పించుటకు బాహుబలమును అట్లె, ఆశలఁ బెంచి సౌజన్యము గోలుపోవుటకు చాలా ధనమును సంపాదించ నుంటిని కాని, లోకోపకారమునకై కాదు. ఇన్నిటి నార్జించి ధన్యత నొందుటకు నీ చరణ దాస్యమును గోరనైతిని వేంకటేశ్వరా!

కలుషితబుద్ధి నింద్రియసుఖప్రతతిం గలకాల మెన్ని తే
ప లనుభవించినన్ విషయవాసన లింకను హెచ్చు, సంసృతి
ప్రళయపయోధి క్షారజలపాన మొనర్చిన దప్పి తీరునే
ఖలుడఁను పాదతీర్థ మొసఁగన్ వలె శ్రీకర! వేంకటేశ్వరా! 43

తా॥ చెడుబుద్ధితో నింద్రియ సుఖముల నెన్నింటినో ఎన్నిమారు లనుభవించుచున్నను ఇంకను విషయ వాసనలు హెచ్చుచున్నవే కాని తృప్తిఁగూరుట లేదు. సంసార సముద్రములోని విషయవాసనలనెడి ఉప్పునీరు నెంతఁ ద్రావినను దప్పి తీరు ననెడి మాట కల్ల. నీ పాద తీర్థ మైన గంగా పానమును కోరిన కాని దప్పి తీరదు గదా వేంకటేశ్వరా!

మానస మందు నా దురభిమానము పో దెవరెన్ని జెప్పినన్
జ్ఞానము రాదు, కర్మ యన సాధ్యము గా దెద భక్తిలేదు, నీ
ధ్యానము నిల్వఁ బోదు, భవదారుణదావశిఖార్తజీవనో
ద్యానుఁడ నీదు చల్లని పదమ్మును నమ్మితి, వేంకటేశ్వరా! 44

తా॥ మనస్సులోని దురభిమానము పోదు. ఎవరెన్ని జెప్పినను జ్ఞానము రాదు. కర్మకాండ నాచరించుట నా వలన కాని కష్టతరమైన పని. భగవంతుఁడ వగు నీపై భక్తిలేదు. నీ పాద ధ్యానము చంచల హృదయములో నిల్వఁబోదు. సంసార దావాగ్నితో దగ్ధము కావింపఁ బడుచున్న జీవిత మనెడి ఉద్యాన వనము గల్గి యున్నాను. నీ చల్లని పదముల నమ్మితి చల్లార్పవే స్వామీ వేంకటేశ్వరా!

కుటిలత దుర్జనుండ నయి కూడఁ బవిత్రుని యట్లు పృథ్విలో
నటన మొనర్చి సజ్జనుల నమ్మిక పుట్టెడు నట్లొనర్తు నే
నిటువలె సేయుటంతయును నీవు హృదంతర మందు నుండి య
న్నిటి గమనింతు వంచెరుఁగ వంచన పొందితి వేంకటేశ్వరా! 45

తా॥ కపటబుద్ధి నగు నేను దుర్జనుఁడనై గూడా పృథ్విలో పవిత్రుని వలె నటించి సజ్జనులకు నమ్మిక పట్టున ట్లొర్చితిని. నా యీ కపటవర్తనము నంతయు నా హృదయములో నుండి నీవు చూచుచున్నావని తెలియును. మోస పోయితిని. నన్నెట్లు క్షమింతువో వేంకటేశ్వరా!

ధనగర్వంబునఁ గొన్నినాళ్ళు యువతీ తారుణ్యభోగాఢ్య యౌ
వనగర్వంబునఁ గొన్నినాళ్ళు పదవీ ప్రాశస్త్య గర్వాహతిన్
ఘనవిద్యాకులపుత్రమిత్రవసుధాగర్వాంధతన్ మిమ్ము నే
కనులం గానక యుంటి నస్థిరసుఖౌఘప్రాప్తి శేషాద్రిపా! 46

తా॥ కొన్నాళ్ళు ధనగర్వముతో, యువతులతో రతిసుఖభోగాలతో కొన్నాళ్ళు, యౌవనగర్వముతో కొన్నాళ్ళు, ఉన్నతపదవి నధిష్ఠించి యున్నాననే గర్వముతో విద్యాగర్వముతో కొన్నాళ్ళు. గొప్ప మిత్రులు గలరనే గర్వముతో నిన్నే కన్నుల గానకుంటిని. అస్థిరసుఖసంపదల నమ్మి కొనిన దుర్మార్గుఁడ నేను వేంకటేశ్వరా!

బాల్యము స్వప్నసమ్మితజపాకలికాకృతి నేఁగెఁ జిత్తచాం
చల్యము గొల్పి యౌవనవసంతమునున్ మధుపానమత్తతా
తుల్యతనేఁగె, వార్ధకము దోచెనయో క్షణమాత్ర పుష్పని
ర్మాల్యము రీతి జీవనసుమ మ్మెపుడర్పణ జేతు శ్రీపతీ! 47

తా॥ బాల్యము స్వప్నతుల్యముగా దాసనపుమొగ్గ వలె రెన్నాళ్ళుండి పోయినది. కల్లు ద్రాగిన మత్తువలె నాల్గు గడియ లుండి చిత్తమును చలింపఁ జేసి యౌవనము గతించినది. ముసలితనము ముడిచి విడిచిన పువ్వువలె క్షణ మాత్రములో వచ్చి పైనఁబడినది. ఇంక నే నెప్పుడీ జీవిత మనే సుమమును (పువ్వును) నీ పాదపూజలో నర్పింతును వేంకటేశ్వరా!

కలిలో నీ సరి దైవతం బెచటనుం గానంగ రాఁడంచు భూ
వలయం బంతట డప్పుఁ గట్టుకొని తేవం జాటఁగానేల? తి
ర్మల సర్వోన్నతపీఠ మీయ నతిప్రేమన్ భక్తలోకమ్ము నీ
చరణాబ్జమ్ముల స్వర్ణవృష్టి గురిపించన్ వేంకటాద్రిప్రభూ! 48

తా॥ కలికాలములో నీ సమానుఁడగు దేవుఁడు లేఁడు లేఁడని ప్రపంచ మంతట డప్పుఁ గట్టుకొని చాటి చెప్పవలసిన పనేమి? తిర్మలయే నీకు సర్వ దేవతల కంటె మహోన్నతపీఠ మిచ్చినది. మిక్కిలి ప్రేమతో భక్తలోకము నీ చరణకమలముల వద్ద బంగారు వర్షము గురిపించుచున్నది. అదే నీ పర్వాత మునకు సాక్షి శ్రీవేంకటేశ్వరా!

భామ యెడంద మోహమధుభాసితకాంచనకుంభయుగ్మమై
కామతమోంధకారములుగా తలలెత్తు కుచమ్ము లంటి య
న్నా మొదలేమొ యాత్మపతనప్రతి నాదట స్తన్యపాయినై
యీ మహిఁ జచ్చి పుట్టు మతిహీనుఁడ నైతిని వేంకటేశ్వరా! 49

తా॥ ఆడదాని యెడఁద మోహ మను మదిరతో నొప్పుచున్న బంగారు కుండల జతతో కామాంధకారముల తలలెత్తఁ జేయుచున్నదా యనునట్లున్న కుచద్వయము నంటి మొదలేమొ యాత్మనాశము గొనితెచ్చుకొని తరువాత వాటి నంటి చనుబాలు ద్రావుచు ఈ ప్రపంచములో చచ్చి పుట్టు బుద్ధిహీనుఁడ నైతిని శ్రీవేంకటేశ్వరా!

శయ్యాభోజనసౌఖ్యసంగతుఁడనై సంతుష్టచిత్తుండనై
నెయ్యం బొప్పఁగ రేఁబవళ్ళు దినముల్ నిశ్చింతగాఁ బుత్తు నే
నయ్యారే! మృతి నిత్యసన్నిహితమై యాకొంచు నేతెంచె, నో
యయ్యా! దాని నెఱింగి నీ స్మరణ సేయన్ వేంకటాద్రిప్రభూ! 50

తా॥ షడ్రసోపేతముగా భోజనము సేయుట, పట్టుపరుపులలో హాయిగా నిదురించుట లనెడి సౌఖ్యములలో మైమరచి సంతోషపరవశుఁడనై ప్రేమతో రాత్రింబవళ్ళు జీవితపు దినములన్ని నిశ్చింతగా గడుపుచుంటి. ఇంతలోనే ఔరా? మృత్యువు నిత్యము సమీపించుచు ఆకలిఁగొని అరుదెంచినది. దానిని తెలిసిగూడ ఓ వేంకటేశ్వరస్వామీ! నీ స్మరణ నామజపము చేయలేనైతిని.

తనువును యౌవనమ్ము నల దారసుఖార్థము ధారవోసితిన్
ధనమును పుత్రమిత్రమమతాసుఖసంగతికై వ్యయించితిన్
మనమును నింద్రియ ప్రియ ప్రమాద వినోదముకై లయింతు వా
క్కును సహితమ్ము నీ భజనకుం గయిసేయను వేంకటేశ్వరా! 51

తా॥ నా తనువును నా యౌవన మంతా భార్యాసుఖము కొఱకే ధారవోసినాను. నా ధనము నంతయు పుత్రుల యొక్క మిత్రుల యొక్క మమకారముతో నేర్పడిన వారి వారి సుఖాల కొఱకై వ్యయపరచినాను. నా మనస్సు నెప్పుడు ఇంద్రియప్రియసుఖాల ప్రమత్తతc గూర్చు వినోదాలకై లయింపజేసితిని. కడకు వాక్కునైనా నీభజనకై వినియోగించ లేనైతిని స్వామీ వేంకటేశ్వరా!

కొమ్మలపై రమించు పెను కోతి మన మ్మతిచంచలమ్ము గే
హ మ్మరివర్గషట్కమున కౌర దశేంద్రియ సంతతుల్ లులా
యమ్ములు పల్యలాభవిషయాల్పసుఖమ్ముల మున్గ నేcగి మా
ర్గమ్మును దప్పు నెప్పగిది గమ్యముc జేర్తువా వేంకటేశ్వరా! 52

తా॥ మనస్సు కొమ్మల (స్త్రీల) పై రమించు కోతి అతిచంచలమైనది. కామక్రోధాది-అరిషడ్వర్గమునకు ఇల్లైనది. ఔరా! దశేంద్రియసమూహము అదొక దున్నపోతులమంద. అల్పవిషయసుఖా లనెడి బురద గుంటలలోనే మునుcగుటకు పోయి గమ్యమునకు మార్గమును దప్పును. ఎట్లు గమ్యమును జేర్చెదవో వేంకటేశ్వరా!

"ధర్మము నాచరింపుc డ"ని తా నుపదేశ మొసంగు నెందు దు
ష్కర్మము లాచరించుచును సత్పురుషుం బలె మామకాత్మ యో
నిర్మలతేజ! జారగతి నీచము సేయకుc డంచుc జెప్పcగా
నర్మిలి వారకాంతలకు హక్కెటు లుండును వేంకటేశ్వరా! 53

తా॥ నా ఆత్మ ఒక ప్రక్క తాను దుష్కర్మల నాచరించుచునే సత్పురుషుని వలె ప్రపంచమునకు ధర్మము లాచరించవలెనని ఉపదేశ మొనర్చుచుండును. ఓ నిర్మలతేజా! జారత్వము కడు నీచమైన వృత్తి దాని మానుకొనవలెనని చెప్పుటకు వారకాంతకు ఏమి హక్కున్నది? దానిని విని లోకము పరిహసింపదా శ్రీవేంకటేశ్వరా!

పుస్తక మంటు శబ్దముల పోలిక భూతము లొప్పు శబ్ద వి
న్యస్తములైన యర్థము లనన్ సకలాత్మలు వెల్గ నర్థభృ
న్నిస్తులమోదకారకవినిర్మలమౌ రసరూప మొందుఁ ద
త్పుస్తకసార మీవె యని బుద్ధి గ్రహింతును వేంకటేశ్వరా! 54

తా॥ పుస్తకములో నున్న శబ్దముల వలె ప్రపంచములో భూతరాశి ఒప్పియున్నది. శబ్దములలో నున్న అర్థముల వలె సకలభూతస్థితములై ఆత్మలు తామవి ప్రకాశించును. అర్థములలో నిండి ఆత్మానందము చేకూర్చు వినిర్మలమైన రసరూపమగు ఆ పుస్తకసారమువు నీవే యని నా బుద్ధిలో గ్రహించితిని వేంకటేశ్వరా!

ఏనొక ప్రక్క నా దనెడి దెల్లయు నింకొక ప్రక్క నుంతునే
దైన వరింపు మీ వనుట లర్జునుఁ డెంతొ వివేక దృష్టితో
నేనను నీవె నాకు వరణీయుఁడ వంచు జయమ్ముఁ గాంచె న
ట్లేనును నిన్నె కోరి తరియింతు భవాబ్ధిని వేంకటేశ్వరా! 55

తా॥ కృష్ణుని వద్దకు అర్జునుఁడు మరియు దుర్యోధనాదు లిద్దరును యుద్ధసహాయమునకు వచ్చినారు. కృష్ణుఁడు వారిఁ గాంచి నేనొక వైపు, నాదంతా ఇంకో వైపు ఉంచుచున్నాను. అర్జునా! నీవు నన్నైనను కోరుకొనుము. లేదా నాదనెడి యావదాస్తినైనా కోరుకొను మని వచించెను. వివేకవంతుఁడైన యర్జునుఁడు నేను అనఁబడు కృష్ణుని వరించి నాది అనఁబడు మాయను విసర్జించి యుద్ధములో తాను విజయుఁ డయ్యెను. అట్లే నేను నిన్నే వరింతును వేంకటేశ్వరా!

లీల యశోద త్రాళ్ళకు వలెన్ దమి పోతన ప్రేళ్ళవౌ ప్రబం
ధాలకు భక్తిఁ గట్టుఁబడినాఁడవు త్యాగయ భావరాగతా
ళాలకునున్ వశుండ వయినాఁడవు తద్గతి నాకు సాహితీ
లీలలు గానడోలలును లేవెటు మెచ్చెదొ వేంకటేశ్వరా! 56

తా॥ విలాసముగా యశోద త్రాళ్ళకు కట్టుఁబడినట్లే ప్రేమతో పోతన కవీంద్రుని ప్రేళులకు కట్టుఁబడినాఁడవు. అతని కావ్యాలకు కట్టుఁబడి పోయినావు. అట్లే త్యాగరాజులవారి భావ రాగ తాళ బద్ధమైన గాన తానములకు వశుండ వైనావు. ఆ రీతిగా నిను నేను కట్టివేసి వశుని జేసికొనవలెనన్న నా కటువంటి సాహిత్యలీలలు, అటువంటి గానడోలలు లేవు. నీవు నన్నెట్లు మెచ్చెదవో వేంకటేశా!

కృపణుఁడు క్రూరచిత్తుఁడు నికృష్టచరిత్రుఁడు దుష్టమిత్రుఁడున్
శ్వపచక్రియాకలాపు నెటు సత్కృపఁ గాంచుట లంచు నెంచెదే
యపుడె జనించు వత్సమలినాదిక మావులు పొట్టఁబెట్టి స
త్కృపఁ గొని క్షీరవర్షములఁ దృప్తి నొసంగవె వేంకటేశ్వరా! 57

తా॥ లోభుఁడు క్రూరమైన మనస్సు గలవాఁడు, నీచమైన చరిత్ర గలవాఁడు, దుష్టసహవాసము గలవాఁడు, చండాలుని వంటి నీచకర్మకలాపములు గలవాఁడు- వీని నెట్లు కృపతోఁ జూడ వలెనని భావించెదవా? తండ్రీ! ఆవు అప్పుడే పుట్టిన లేఁగదూడపై నున్న మాలిన్యము నంతా పొట్టఁబెట్టుకొని అనఁగా నాకివైచి నిర్హేతుక కృపతో రుచియైన క్షీరధారలతో ఆ లేగను తృప్తిపరచుట లేదా శ్రీనివాసా!

అణుగతశక్తియే యిటు లజాండమునం బరిణామశీలమై
బొనరుచు వస్తుజాలమును బొందికగా నణువుల్ వికేంద్రతన్
దనర పదార్థనాశమగుఁ దత్కృతికర్తయె లేఁడటందుఁ జే
తనగతసర్వనామపరతత్వ మెరుంగను వేంకటేశ్వరా! 58

తా॥ పరిణామశీలమైన అణుగతశక్తియే అనఁగా పరమాణువుల కేంద్రీకరణమే పదార్థాలసృష్టిచేయును. అణువుల వికేంద్రీకరణమే పదార్థనాశమునకు హేతు వగును గాని పదార్థముల నెవఁడో సృష్టించుచున్నాఁడని ఎవఁడో నాశము చేయువాఁడొకఁ డున్నాఁడనుటలు శుద్ధాబద్ధములని యందును. కాని సర్వనామ మగు (నేను) అను చేతన సాపేక్షయే ఈ సకల వస్తుజాలముల సృష్టిస్థితిలయము లకు మూలహేతు వని తెలియఁ జాలనైతిని వేంకటేశ్వరా!

చిలుకకువన్నె లందములుచిందెడికన్నులు లేడి కౌర! కో
కిలలకు గానమాధురి శిఖిప్రకరమ్ముల నాట్యభంగిమల్
పులికి మనోజ్ఞచర్మ మిడి పొందికనందములున్ వివేకమున్
గలిపి మనుష్యజాతి కిడఁగా నిను గొల్వరు వేంకటేశ్వరా! 59

తా॥ చిలుకకు వన్నెలు, అందములు జిందెడి కన్నులు లేడికి, కోకిలలకు గానమాధుర్యము, నెమిళ్ళకు నాట్యభంగిమలు, పులికి సుందరమైన చర్మము లిచ్చి వానిని లోకులతో మెచ్చింపఁ జేసినావు. పైజంతుజాలమునకు ఒకొక దానికి ఒకొకటి నిచ్చినావు కాని మనుష్యునకు అన్ని యందచందములే కాక మంచి చెడ్డల దెలియు వివేకమును గూడ నిచ్చితివి. ఐనా కృతజ్ఞుఁడై నిను గొల్చి తరింపలేఁడయ్యెను వేంకటేశ్వరా!

ప్రకట మృగేక్షణా చలదపాంగ దరస్మిత వాగ్విలాస కృత్
సకల సుఖాళి మచ్చులిడి సంసృతిజాలము వైవ మానస
మ్మొక విహగమ్ముగా భ్రమల నొంది వలందగఁ జిక్కి యేడ్చు ద
ర్పక మృగయావధీరితుఁడఁ బాహి కృపార్ణవ! వేంకటేశ్వరా! 60

తా॥ లేడివంటి కన్నులుఁ గల ఆడవారి యొక్క చంచలములైన కడ గంటి చూపులు చిరునవ్వులు సరసమైన వాగ్విలాసము లనెడి సకలసుఖాల మచ్చులిడి సంసార మను వల నొడ్డ నా మన స్సొక పక్షియై ఆ వలలోఁ బడి యేడ్చుచున్నది. నా భ్రాంతియే న న్నిట్లొనర్చినది. నేను మన్మథుఁ డనెడి వేఁట కానిచే వంచితుఁడనైతిని, కృపాసముద్రా! ఓ వేంకటేశ్వరా!

నిను నీలాంబుద దేహధారు వికసన్నీరేజ పత్రేక్షణున్
వనమాలాధరు శంఖచక్రకరు శ్రీవత్సాంకుఁ బీతాంబరున్
ముని హృద్గోచరు మామనోహరుఁ గృపాపూర్ణావతారున్ సదా
కనులన్ మూసిన విప్పినన్ గనఁబడంగా నిమ్ము శేషాద్రిపా! 61

తా॥ ఓ వేంకటేశ్వరా! శేషగిరినివాసా! నల్లని మేఘము వంటి దేహము గలవాని, వికసించు కమలపత్రమ్ముల వంటి కనులుగలవాని, వనమాలాధరుని, శంఖచక్రములు కరముల యందుఁ దాల్చువాని, శ్రీవత్సచిహ్నముఁ గలవాని, పీతాంబరము ధరించువానిని, మునుల హృదయమునకు మాత్రము తెలియు వానిని, లక్ష్మి మనస్సును హరించువానిని, కృపామూర్తిగా రూపుఁ గొన్నవానిని నిన్ను నా కనులు మూసినా విప్పినా కన రానిమ్ము.

తల్లియుఁ దండ్రి యన్నయును దైవము తోడును నీవ సద్గురుం
డెల్లరు నీవ యంటి నెద నెల్లపుడు న్నిను నమ్మియుంటి నీ
కల్ల ప్రపంచమందుఁ గల కారణ బాంధవులన్ ద్యజించి నీ
సల్లలితారుణాబ్జ పద సన్నిధిఁ గంటిని వేంకటేశ్వరా! 62

తా॥ నా తల్లి దండ్రి అన్నయును దైవము నా తోడు నీవ నా గురువు అందరును అన్నియును నీవే యంటిని. నా హృదయములో నెల్లపుడు నిను నమ్మియుంటిని. ఈ కల్ల ప్రపంచములో గల కారణ బాంధవులను విడిచి నీ మృదులమైన ఎఱ్ఱని వన్నె గల పాదసన్నిధిని పొందియుంటిని. ఓ వేంకటేశ్వరా! ఎట్లు రక్షించువాఁడవో?

శ్రీకర! శ్రీనివాస! సరసీరుహలోచన! పాపమోచనా!
ప్రాకటవైభవా! వరద! భక్తజనావన! లోకపావనా!
ఓ కరుణాసముద్ర! పురుషోత్తమ! మాధవ! దీనబాంధవా!
నా కెపు డిట్లు నిన్పొగడు నాల్క నొసంగుము వేంకటేశ్వరా! 63

తా॥ ఓ శ్రీకరా! శ్రీనివాస! కమల పత్రముల వంటి కనులు గల వాఁడా! పాపముల నుండి విముక్తిఁ బడయఁ జేయువాఁడా! దివ్యవైభవము గలవాఁడా! వరముల నొసంగువాఁడా! భక్తజనుల రక్షించువాఁడా! లోకమున నందరికన్న పవిత్రుఁడవైనవాఁడా! ఓ కరుణాసముద్ర! పురుషోత్తమ! మాధవా! దీన బాంధవా! నాకెపుడు గూడ నిన్నిట్లుఁ బొగడు నాల్క నొసంగుమా ప్రభూ! వేంకటేశ్వరా!

నీదు కృపాకటాక్షరస నిర్భరవృష్టి నపేక్ష సేయ కే
నా దగు పుణ్యకర్మములె నాకమహాసుఖసద్విశేషస
మ్మోదము లందఁ జేయునని బుద్ధిఁ దలంచితి వృష్టి లేమి ని
మ్మేదిని శుష్కసస్యకృషి మించి ఫలించునె? వేంకటేశ్వరా! 64

తా॥ నీ నిర్హేతుక జాయమాన కరుణా రస వర్షమును ధిక్కరించి నా పుణ్యకర్మములే నాకు నాకలోక సుఖ సంపదలతో నొందు సంతోషములకు గారణములని బుద్ధిలోఁ దలంచి కొని యహంకరించితిని. నిజము విచారించిన వర్షము దైవ కృప వలన పడకున్న పైరుపంటల మొలవేసి నే నెంత కష్టించిన ఆ సస్యజాలము లెండునే కాని పండవు కదా వేంకటేశ్వరా!

ఏకాంతంబున నేను నీ కయి ప్రియా! యెంతే నిరీక్షింపఁగా
వీక న్వచ్చిరి చోరు లార్గురును నా విత్తమ్ములం దోఁచఁగా
నేకాకిన్ హరి! నేను చచ్చితిని నీవే దిక్కన న్నాదు ఏ
డ్పాకర్ణించి బిరానఁ బ్రోచితివి నీవై వేంకటాద్రిప్రభూ! 65

తా॥ ప్రియుఁడ వైన వేంకటేశ్వరా! నేను ఏకాంతములో నీకై నిరీక్షించు చుండఁగా అరుగురు దొంగలు వచ్చినారు. నాదగు నీపై నున్న ప్రేమ ధనమును దొంగిలింపఁ దలపడినారు. అప్పుడు నేను నాకు వేరెవరు దిక్కులేరు నీవు దప్ప అని శరణాగతి నొనర్చినాను. అపుడు నీవు నా యేడ్పు నాకర్ణించి నీవై బిరాన వచ్చి రక్షించి పీడా విముక్తిఁ గావించినావు.

భువి యుద్యానము భూతకోటి తరువుల్ పూ లంతరంగమ్ములే
చవు లూరించు మరంద మీవె యది యాస్వాదించు తేంట్లెల్ల భ
క్తవరేణ్యుల్ పసరాకులం దినెడి నింద్యంబైన కీటంబు నే
ను విహీనేంద్రియసౌఖ్యమోది నయి యుందున్ వెంకటాద్రిప్రభూ! 66

తా॥ ఈ ప్రపంచమే ఒక యుద్యానవనము, ఈ విశ్వములోనున్న భూత జాలమే ఈ ఉద్యానవనములోని వృక్షములు. ఆ భూతకోటిహృదయములే ఆ వృక్షములపై వికసించు పూవులు. ఆ పూలలో నున్న తేనె నీవే. ఆ తేనెను గ్రోలు తుమ్మెదలు నీ భక్తులు. నేనో-ఆ వృక్షముల పసరాకులు అను ఇంద్రియ విషయాదులఁ దిను నింద్యమైన ఆకుపురుగును. ఎన్నడు భాగవతకృప గల్గి నీపై ప్రేమతో ఆనందముగా నుందునో వేంకటేశ్వరా!

జగమొక నాటకం బటులె చంద్రుఁడు సూర్యుఁడు దివ్విటీలు, రే
ల్పగళులు తీయు వేయు తెర పద్ధతు లాత్మలు పాత్ర లీ శరీ
రగతులు వేషధారణలు, రంగప్రవేశవినిష్క్రమాదు లె
న్నగ జననావసానములు, నాటకసూత్రధరా! వృషాద్రిపా! 67

తా॥ ఈ జగత్తే ఒక నాటకరంగము. చంద్రసూర్యులా నాటకరంగమున వెల్గు దీపాలు. రాత్రి పవలు అనునవి తెర వేయుట తీయుట వంటివి. ఆత్మలే ఆ నాటకపాత్రలు. ఈ శరీరములఁ దాల్చుటే వేషధారణలు. చావు పుట్టుకలు రంగముపైకి వచ్చుట తెరలోకి పోవుట వంటివి. ఆ నాటకము కంతకు సూత్రధారివి నీవే శ్రీవేంకటేశ్వరా!

అనయం బన్యుల రంధ్రముల్ వెదకి తీయంగన్ సహస్రాక్షతన్
బెను గూర్మిన్ బరనింద సల్పుటకునై పృథ్విన్ దశాస్యుండ స
జ్జన హింసల్ సలుపన్ సహస్ర భుజబాస్వద్బాణదైత్యుండ నే
నిను సేవింప నుతింప నర్చలిడఁగా సేఁజాల శేషాద్రిపా! 68

తా॥ ఎప్పుడు పరుల తప్పుల వెదకి తీయుటలో నేను సహస్రాక్షుఁడ నగు ఇంద్రుఁడను. ఇష్టముతో పరుల నిందించుటలో పృథ్విలో నే నొక దశవదనములు గల రావణాసురుఁడను. సజ్జనుల హింస పెట్టుటలో నేను వేయి భుజములు గల బాణాసురుఁ డనెడి రాక్షసుఁడను. కానీ నేను నా ముఖముతో విను తింపలేను. కనులతో నిను సేవింపలేను. చేతులతో నిన్ను అర్చింపలేను వేంకటేశ్వరా!

క్షణసంసారసుఖమ్ము పెంచ నొక మేఘచ్ఛాయ, యాద్యంత జీ
వనమో ఛిద్రఘటాంబుపూర మిఁక లబ్ధి స్వల్ప సంతృప్తి యౌ
ఘన వహ్నిం బడ వ్రేల్చు ఆజ్యహుతి, దుర్గర్వాహతిం ద్రెళ్ళ యౌ
వనమో స్వప్నము, వార్ధక మ్మరుచి దేవా! వేంకటాద్రి ప్రభూ! 69

తా॥ ఎప్పుడీ సంసారసుఖము క్షణ ముండి పోయెడి మేఘచ్ఛాయ. తుద మొదలీ జీవన మొక చిల్లి బడిన కుండలోని నీరు. ఇంద్రియసుఖాలో అగ్నిలో వ్రేల్చఁబడెడి నేతి హవిస్సు. అనఁగా సేవించుచున్న కొలఁది నధిక మగునవి. గర్వించు యౌవనమో ఒక సుందరస్వప్నము. వృద్ధాప్యమో రుచి హీనము. ఎపుడు శాశ్వతానందరూపమగు నీ భక్తి కల్గునో హరీ!

ఒరులకు భోగభాగ్యములె యుండఁగ రాదు సుఖమ్ములన్నియున్
వరలఁగఁ జెల్లు నాకె యని వంచన చేసియొ దుర్జనత్వమున్
బరపియొ లాగఁ జూతునవి, వారిని, నన్ జనక స్వరూపివై
యరసెడి నీవొ యే వ్యధల నొందెదొ కుందెదొ? వేంకటేశ్వరా! 70

తా॥ ఎన్నడు ఇతరులకు భోగభాగ్యము లుండఁగూడదు. అన్ని నాకే ఉండవలెను అను దుర్బుద్ధితో వంచన చేసియో దౌర్జన్యము నొనర్చినయో ఇతరుల సంపదల లాగుటకై యత్నింతును. వారిని, నన్ను జగత్తు కంతటికి తండ్రివగు నీవు సమముగాఁ జూతువు. వారిని నే వంచన సేయుచుండగానో దౌర్జన్యముతో దోచుకొనుచుండగానో నీ వెంతగా వ్యధల నొందువాఁడవో వేంకటేశ్వరా!

తావకపాదవారిరుహదాస్యవిరోధులు తల్లిదండ్రులేన్
పావనులౌ గురూత్తములు భ్రాతలు బంధువులేని త్యాజ్యులే
నూవె యటంచునున్ భరతసూరి, సురారికుమారుఁడున్ బలి
శ్రీవిలసద్విభీషణులు చేరి వచింపరె వేంకటేశ్వరా! 71

తా॥ నీ పాదకమలముల సేవకు విరోధులైన తల్లిదండ్రులైనా, పవిత్రులైన గురువులే కానీ, అన్నదమ్ములే కానీ, బంధుమిత్రులే యైనా విడువఁ దగిన వారలే యని ప్రహ్లాదుఁడు, భరతుఁడు, బలిచక్రవర్తి, శ్రీవిభీషణుఁడు మొదలగు పెద్దలే వచించినారు. అనగా ప్రహ్లాదుఁడు హరిసేవ చేసెద నన హిరణ్యకశిపుఁడు వద్దని వారించెను. అట్టి తండ్రి నా బాలుఁడు పరిత్యజించెను. ఇట్లే తక్కిన వారును శ్రీవేంకటేశ్వరా!

ధరణిజనాళిసేవ కవతార మనం బ్రథముండు పొల్చు తాఁ
బరుల స్వలాభసిద్ధికి సపర్యలఁ దేల్చు ద్వితీయుఁ డన్యులన్
జెరచి నగున్ తృతీయుఁ డొరు జెందు నసూయగుఁడై తురీయుఁడే
పరులను నొంచి నేఁ జెడెడి పంచముఁడన్ హరి! వేంకటేశ్వరా! 72

తా॥ ధరణిజనుల సేవ జేయుటకె అవతరించినాఁడన మొదటి శ్రేణి మనుష్యులు ఒప్పుచున్నారు. ఇతరులకు తన లాభము కొఱకై సేవలు చేయువాఁడు రెండవ శ్రేణి మానవుఁడుగా, అట్లే ఇతరులను చెరచి తాను సుఖించెడివాఁడు తృతీయశ్రేణి వాఁడు. తనకు లాభము లేకున్నను ఇతరులఁ జెరచి సంతోషపడువాఁడు చతుర్థశ్రేణివాఁడుగా నుందురు. నేనో ఇతరులను చెరచి నేనూ చెడిపోవు పంచముఁడను సుమా! వేంకటేశ్వరా!

భ్రాంతాపాంగవిలాసహాససుమమై భామారతస్వల్పసౌ
ఖ్యాంతాపత్యఫలాన్వితంబయి యురోజాద్రిద్వయోపేతమౌ
కాంతామోహనరూపయౌవనలతాకాంతారమధ్యంబునన్
భ్రాంతిం జెందె మనః ప్లవంగ మెటు లప్పా వేంకటాద్రిప్రభూ! 73

తా॥ వేంకటేశా! నా మనస్సనెడి కోతి, స్త్రీ యొక్క మోహింపఁ జేయు రూపయౌవనము లనెడి లతలతోఁగూడిన అరణ్యములో భ్రాంతిపడి తిరుగుచున్నది. అట్టి అడవిలో ఆ స్త్రీలచూపులు నవ్వులే పువ్వులు భామరతముతోఁ గల్గు సంతాన మనెడి అల్పఫలములతోఁ గూడినది. వక్షోజములనే రెండు కొండలు గలది. అనఁగా స్త్రీమోహములోఁ బడి నీ భక్తి లేక నా మనస్సను కోతి సంసార వనములో చిక్కుబడిపోయినది.

సకలక్రియాకలాపముల సాక్షివి నీవని కొంద ఱందురే
యొక తృణమేనియుం గదల నోపదు కర్తవు నీవుగాక యం
చొకరు వచింత్రు సాక్షివయి యొప్పెదొ కర్తవొ నీరు వార్ధి నుం
డి కదలకుండు నాపగల నిత్యము పారును వేంకటేశ్వరా! 74

తా॥ కొందఱు మే మొనర్చు సకలకర్మకలాపములకు సాక్షివి మాత్రమే నీవనుచున్నారు. మరి కొందరు నీవే కర్తవు, నీవు లేనిది ఒక గడ్డి పోచయు కదలదని యనుచున్నారు. ఇంతకు నీవు సాక్షివో లేక కర్తవో తెలియకున్నది. నీరు సముద్రములోనుండి ప్రవహించకుండును. నదులలో నిత్యము పారుచుండును. అట్లే సాక్షివి కర్తవు రెండుఁ గూడ నీవే శ్రీవేంకటేశ్వరా!

క్షీరములోని నీరమటు చేరి వసింతును నేను తావకా
కారములోన దుగ్ధములఁ గన్పడ కుండఁగఁ వెల్గు వెన్నవై
వారక మామకాత్మ నొగి వర్తిలు చుందువు నీవు నెందిటుల్
శ్రీరమణా! సమైక్యగతిఁ జేరి వసింతుము వేంకటేశ్వరా! 75

తా॥ నేను నీలో పాలలోని నీరు వలె కలసి మెలసి యుందును. నీవు పాలలో కనఁబడకుండ నుండు వెన్న వలె నా యాత్మతో కలసి వర్తించు చుందువు. ఓ శ్రీపతీ! నీవు నేను ఒకరిలో నొకరము సమైక్యమై విడనాడకుండ కలసి మెలసి యుందుము ప్రభూ, శ్రీ వేంకటేశ్వరా!

నినుఁ గనకున్న నా మనసు నిల్వదు, నా మది నిల్వకున్న నిన్
గనుట యసంభవ మ్మగును గావున బెండిలిఁ గామి పిచ్చివో
దన నిఁకఁ బిచ్చివోని దెటు లౌనది పెండిలి నా జెలంగె నీ
కనికర మిష్టహేతుకముగా వెలయింపుము వేంకటేశ్వరా! 76

తా॥ నీదర్శనము గానిది నా చంచల హృదయము స్థిరత్వమును బొందకుండును. నా మనసు నిల్వకున్నచో నీ దర్శనము అభావము. ఇది విచిత్రముగా నున్నది. పెండ్లి గానిది పిచ్చి పోదు, పిచ్చి పోనిది పెండ్లి గాదు అన్నట్లున్నది. అందుకే నీ నిర్హేతుక దయను నాపై ప్రసరింపఁ జేయు ప్రభూ! వేంకటేశ్వరా!

నన్ను దురాత్ముని న్దగ నొనర్చెడి యైహిక భోగభాగ్య వి
త్తోన్నతి తావకీన కరుణోల్లసితంబె యటంచు నెంతు నో
యన్న! త్వదీయ తత్కృప నెదం బరికించిన సస్యహానికై
విన్ను స్రవించునట్టి యతివృష్టిగ నెంతును వేంకటేశ్వరా! 77

తా॥ నన్ను దురాత్మునిగాఁ జేసెడి ఐహిక భోగ భాగ్య సంపదలను నీవు అతిగా నిచ్చుచుందువు. అది నీ కరుణయే యని భావింతును. ఇదీ ఒక విధమగు కృపారూపమగు శిక్షయే. మేఘము తాను అతివృష్టి నొనర్చిన సస్యములకు ఉపకారము కంటే హానియే కల్గును గదా! అందులకే అతి భోగ భాగ్యము లొసంగు నీ కరుణ నా కవసరము లేదు ప్రభూ! అందు నీ స్మృతి ఉండదు శ్రీ వేంకటేశ్వరా!

నిను గని పారవశ్యమున నిస్తులమోక్షసుఖానుభూతితో
మని యజరామరం బగు సమస్థితి యుండెడి యాత్మ యిట్టిలీ
తనువును గూడి తాను భవతాపము నొందిన యట్లెనొచ్చుఁదా
నినుమును గూడి యగ్ని భరియించదె ఘాతల వేంకటేశ్వరా? 78

తా॥ నిను జూచి పరవశించుచు తుల లేని మోక్షానందములో అజరామరమై యానందముతో సుఖదుఃఖాల అతీతమై యుండు ఈ యాత్మ తాను యిట్లే అస్థిరమై ఆధివ్యాధులతోఁ గూడుకొనిన శరీరముతోఁ గూడి భవతాపమును అనుభవించు చున్నట్లు భావించి బాధపడుచుండును. ఇనుమును గూడిన అగ్నికిని సమ్మెట ప్రేటులు తప్పనివే కదా!

నా తాపత్రయ మార్చు మేఘమువొ యన్నా! నాదు కందోయికిన్
శీతానీలకళాప్రకాశ మిడు సచ్చిద్రత్నదీపమ్మువో!
చేతోమోద మొసంగు దైవప్రకృతిశ్రీ మేల్కొనం జేయు, వి
స్ఫీతాగుర్వసితాభ్రధూపమవొ! దీప్తిన్ వేంకటాద్రిప్రభూ! 79

తా॥ నా తాపత్రయము నార్చెడి మేఘరూపుఁడవు కావు గదా! లేక నా కనుదోయికిఁ జల్లని నీలపు వన్నె కాంతులఁ ప్రసాదించు సచ్చిదానందప్రకాశ మిచ్చు నీలమణిదీపమువా! చేతస్సునకు ఆనందముఁ గల్గఁజేయుచు నాలో ఉండే దైవీప్రకృతిని మేల్కొల్పు విశుద్ధమైన ధూమ్రవర్ణమునఁ గనఁబడు నల్లని అగరు ధూపమువా? నీ వెవరో నాకు తెలియఁ జేయుము వేంకటేశ్వరా!

లలి సదసద్వివేకసువిలాసమతిన్ హృదయస్థభావనల్
పలుకఁగఁ బూర్ణశక్తిఁ గల వాక్కును నాత్మప్రయోజనాలినిం
బొలయఁగఁ గూర్ప నింద్రియసమున్నతి నిచ్చిననేని నిన్ను నే
దలఁప నుతింప నర్చన మొనర్పను శ్రీకర! వేంకటేశ్వరా! 80

తా॥ సదసద్వివేకమును దెలియఁజేయు సూక్ష్మబుద్ధిని ప్రసాదించినను, హృదయములోఁ గల భావముల నన్నిటిని సంపూర్ణముగాఁ దెలియఁ జేయగల వాక్కు నిచ్చినను, ఆత్మప్రయోజనముల నన్నిటి సమగ్రముగా లభింపఁజేయు ఇంద్రియసమున్నతిని గలుగఁజేసినను నేను నిను బుద్ధితో తలఁపను, వాక్కుతో వినుతింపను. ఇంద్రియములతో నర్చింపని కృతఘ్నుఁడను సుమా, వేంకటేశ్వరా!

నే నొక తప్పు చేసి క్షమియింపుమి యజ్ఞుఁడ నంచు వేఁడనౌ
దానినె తిర్గి చేసి నతిఁ దద్గతివేఁడ క్షమార్హ మౌనె? యె
ప్డో నును శైశవంబుననె పోయిన దంతము వచ్చు నొక్కటం
గాని జరాప్తిఁ బండ్లు చనఁగా మరి వచ్చునె? వేంకటేశ్వరా! 81

తా॥ అజ్ఞుఁడనైన నే నొక తప్పు చేసి క్షమించుమని వేఁడుకొన్న సముచితముగా నుండును. కాని, ఆ తప్పునే క్షమించినను తిరిగి చేసి అట్లే తిరిగి క్షమించుమని వేఁడుకొనిన క్షమార్హుఁడఁ గాను గదా! పసితనములో అనఁగా ఏమి తెలియని తనములోఁ బోయిన పలువరుస తిరిగి వచ్చును. గాని తెలిసిన ముసలి తనములో ఆ దంతములే పోయిన తిరిగి వచ్చుట పొసఁగునా ప్రభూ, వేంకటేశ్వరా!

త్రుప్పు కఠోరలోహమును రూపఱఁ జేయు విధానఁ దా నిలన్
దప్పు మనుష్యదేహమును దప్పక నాశన మొందఁజేయు నీ
ముప్పులు దప్ప నీదగు నమూల్యకృపారసవార్ధిఁ దేల్చిన
న్నెప్పుడుఁ దప్పు త్రోవలకు నేఁగఁగ నీయకు వేంకటేశ్వరా! 82

తా॥ త్రుప్పు కఠినమైన ఇనుమును నశింపఁజేసి నట్లు తప్పు మనుష్యుని దేహమును తప్పక నాశపరచును. ఈ ముప్పులు, దప్పుటకు నీ యమూల్య కృపాసముద్రములో నన్ను దేల్చి నాతో నెప్పుడు గూడ తప్పు పనులు జరుగకుండా చూడవలసినది ఓ ప్రభూ, వేంకటేశ్వరా!

వెక్కుర నన్యదైవముల వేమరు వేఁడిన లాభమేమయా?
నిక్కపు బంధముక్తి నిడు నిస్తులదైవమ వీవ యంచు నే
మ్రొక్కెద నీకె నీరు తరుమూలమునం దిడకుండ మూర్ధతన్
దక్కిన కొమ్మలం దడుప దాన ఫలమ్మెది? వేంకటేశ్వరా! 83

తా॥ అనేకుల ఇతరదైవముల వేఁడుకొన్న ఏమి లాభము? ప్రభూ! జన్మమరణబంధ విముక్తిని కటాక్షించు నిక్కమైన సాటిలేని దేవుఁడ వీవే యని నే నీకు నమస్కరించుచున్నాను. నీటిని వృక్షపు వేరు భాగమునకుఁ బోయకుండా తక్కిన కొమ్మ లేవో పండ్లు నిచ్చుచున్నవని వానిని తడిపిన దానితో ఫలిత మేముండు నయ్యా శ్రీవేంకటేశ్వరా!

అక్కఱ రాని లోభి ధన మట్టులు జ్ఞానధనమ్ము గల్గియున్
చక్కని సువ్రతాచరణ సాధనకై వినియోగపెట్టమిన్
లెక్కకు వచ్చునే? ప్రజకు నేర్పఁగఁ గాక తలల్ ధరించి పూల్
ముక్కులు సౌరభాంబునిధి మున్గి సుఖించును వేంకటేశ్వరా! 84

తా॥ అక్కఱకు రాని లోభివాని ధనము వలె నాకు జ్ఞాన ధనమున్నది ప్రభూ! ఆ జ్ఞానమును నేను మంచి వ్రతాచరణమునకు వినియోగ పెట్టఁ జాల కున్నాను. అది లెక్కలోని దెట్లు? ప్రజలకుఁ జెప్పుటకు మాత్రమే కదా! తల ధరించిన పూలు తలకుఁ గాక ముక్కుకు సువాసనల ప్రసాదించుచు దానిని మోదింపఁ జేయును గాని తలకు కాదుకదా వేంకటేశ్వరా!

గోవిందా! హరి! వడ్డికాసుల దొరా! కోట్యర్కసంకాశ! ఓ
గోవిందా! హరి! నిత్య మాపదల మ్రొక్కుల్ వొందు వెంకన్న! ఓ
గోవిందా! హరి! యేడు కొండల దొరా! కోటొక్క దండమ్ము లో
మావిందా! హరి! శ్రీనివాస! యలమేల్మంగేశ! శేషాద్రిపా! 85

తా॥ గోవిందా! ఓ వడ్డికాసులవాఁడా! కోటి సూర్యప్రకాశభాసురా! ఓ హరీ! నిత్య మాపద గలవారి మ్రొక్కులు దీర్చు వెంకన్నా! ఓ గోవిందా! ఏడు కొండలవాఁడా! నీకు నా కోటొక్క దండము లర్పింతును. ఓ మా కన్నుల విందా! శ్రీనివాస! అలమేల్మంగేశ్వరా! నీ నామము లిట్లు నోరు నొవ్వగా నుతింతు వేంకటేశ్వరా!

స్వామి! త్వదీయ దర్శనము సల్పుటకై ప్రజ లక్షలాది వి
శ్రామము లేక యాలయపు ప్రాంగణవీథుల రేఁబవళ్ళు నో
కామిత దాత! మా కనులు కాయలు కాచెను గానరావె మా
నోముల పంట! యంచు నిను నోరరుగ న్నుతి సేయు వేంకటా! 86

తా॥ ఓ స్వామీ! మీ దర్శనము చేసికొనుటకై లక్షలాది ప్రజలు విశ్రాంతి లేకుండా ఆలయపు వాకిలి ముందు రాత్రింబవళ్ళు నిల్చుచు ఓ కామిత దాత! ఈ ఎదురు చూపులతో మా కనులు కాయలు గాచినవిరా ఓ మా నోములపంట! కాన రావేమిరా? అని నోరరుగ నుతించు చున్నారు ప్రభూ, వేంకటేశా!

మేదిని వెల్గు వేల్పులకు మేరువు పూసవు నీవ యౌట, నే
నీదు బలమ్ము జూచుకొని నీచకలిన్ లయకాలునిన్ మదో
న్మాదిని దుర్విధిన్ బిలుకుడమార్పఁగ నెంచెద నీదు దాసుపై
కాదనఁ బోక సుంత యనుకంప వహింపవె; వేంకటేశ్వరా! 87

తా॥ హారములోని మేరువు పూస వలె అఖిలదేవతలలో నీవే ముఖ్యుఁడ వని యెంచి నీ బలము చూచుకొని నేనా నీచుఁడైన కలిని లయ మొనర్చు యముని, దుష్టప్రారబ్ధమును నశింపఁ జేయుటకై దీక్ష వహించినాను. కాదనఁ బోకుండా కొంచెము నాపైన నీ కరుణాదృష్టిని ప్రసరింపఁ జేయవే వేంకటేశ్వరా!

రవ్వయి నేను నా యెడఁద రాజిలుచున్న యభీప్సితార్థముల్
మవ్వపు భక్తి మీ మును సమర్పణ సేయక ముందె సర్వమున్
నెవ్వఁగ నే నెరింగితిని నీవు వచింపఁగ నేల యంచిటుల్
నవ్వుచు నున్న యట్లు వదన మ్మగుపించెడి వేంకటేశ్వరా! 88

తా॥ నా హృదయములో నున్న కోరికలు రవ్వంత నైనా నిక్కపు భక్తితో మీ ముందు తెలియఁజేయక ముందే నివేదింపక ముందే సర్వము నాకు తెలిసినదిలే నీవు వచించ వలసిన పనిలేదు అని నా మానస మ్మెరిగి నవ్వుకొను చున్నట్లు నీ నగుమొగ మగపడుచున్నది వేంకటేశ్వరా!

ఉదయమునం గ్రుధారుణత నుర్విఁ బ్రజాళిని సూర్యదృష్టులన్
గొదకొని కర్మవీరతను నూల్కొన జేయఁగఁ జూచి యట్టులే
సదమలశీతదృష్టులను జంద్రకళాక్షులఁ గాంచి నిద్దురన్
బొదవఁగ జేసి నీ ప్రజలఁ బ్రోచుచునుండెదు వేంకటేశ్వరా! 89

తా॥ బిడ్డలైన నీ ప్రజలను ప్రొద్దుట క్రోధారుణములైన సూర్యదృష్టు లతోఁ జూచి వారికి కనువిప్పుఁ గావించి కర్మవీరత్వము వారిలోఁ గలుగఁ జేయుచు, అట్లే నిర్మలములైన చంద్రకళ (శీతదృష్టుల)చల్లని చూపులఁ జూచి నిద్దుర బుచ్చుచు నీ ప్రజల (సంతానము)ను రక్షించుచు నయభయములఁ జూపు చున్నావా వేంకటేశ్వరా, తండ్రీ!

మనికి యశాశ్వతం బతి ప్రమాదకరంబులు నింద్రియమ్ములున్
మన మతి చంచలంబు మతి మాన్యవివేక విహీన మట్లె చే
తనమొ యనాదికర్మ సముదాయ నిబద్ధము స్వామి! నీ వినా
యనితరసాధ్య మీ జడజనావనకార్యము వేంకటేశ్వరా! 90

తా॥ ఈ జీవితము అశాశ్వతమైనది. ఇంద్రియములు ప్రమాదములఁ గొనితెచ్చినవి. మనస్సు మిక్కిలి చంచలమైనది. బుద్ధి మంచి చెడు వివేకము లేనిది. ఈ ఆత్మ గూడ అనాదికర్మ ప్రారబ్ధమునకు కట్టుబడి ఉండునది. ఓ స్వామీ, వేంకటేశా! నీవై అహేతుకదయతో రక్షించిననే కాని ఇతరు లెవ్వరు రక్షించలేరు.

ధర నొక కల్పమేగిన సుధారసపాన విమత్తచిత్తులౌ
సరసిజగర్భశక్రత్రిదశప్రభృతుల్ నశియింత్రుఁ గాని నీ
చరణ సరోజసేవకులు సత్యగుణాభరణుల్ ప్రపన్ను ల
ప్పరమపదంబు నం దెపుడు భద్రత నుందురు వేంకటేశ్వరా! 91

తా॥ ప్రపంచములో ఒక కల్పకాల మరిగిన అమృతము ద్రావి మత్త చిత్తులైన బ్రహ్మ ఇంద్రుఁడు మొదలగువారు నశించి తీరుదురు. కాని నీ చరణ కమలముల సేవించువారు, సత్వగుణభూషణులు, ప్రపన్నులు ఆ పరమపద ములో భద్రముగా నెప్పుడూ ఉందురుగదా శ్రీవేంకటేశ్వరా!

పరులకుఁ జెప్పి నా యుదరపాలన సేయఁగ విద్య నేర్తు నా
చరణములోనఁ బెట్టుటకుఁ జాలను తద్గత ధర్మశాస్త్రమున్
దరగల పట్టువస్త్రములు తద్గతి శాలువ లెన్నొ మూఁపునన్
ఖర మది మోసి తెచ్చినను గార్యము గల్గునె వేంకటేశ్వరా! 92

తా॥ నేను ధర్మశాస్త్రములు అన్ని చదివి ఇతరులకు చెప్పుటకే కాని స్వయముగా నడకలో నుంచఁజాలనైతిని. చాకలి రేవు నుండి విలువైన శాలు వలు, పట్టువస్త్రములు, ధోవతులు తన మూపున మోసికొని తెచ్చిన గాడిదకు లాభమేమి? తాల్చినవారి సంతృప్తి ఎన్నటికైనా కల్గునా వేంకటేశ్వరా!

"యస్య శరీర మాత్మ" యని "యస్య శరీరము పృథ్వి" యంచు శ్రు
త్యాస్యమున న్వచించిన మహా వచనమ్ము లవన్నియున్ వృథా
హాస్యము లౌనె? పృథ్వి భవదంగమె యైనను దాననే శిలా
దాస్యము సేతు నీ వని ముదావహమే కద వేంకటేశ్వరా! 93

తా॥ ''యస్యాత్మా శరీరం'' ''యస్య పృథ్వీ శరీరం'' అనే వేద వాక్యముల ప్రకారము ఈ పృథ్వి ఎల్లయును ఈ ఆత్మ లందరును నీకు శరీర భూతములే కదా! నీ శరీరమే పృథ్వియై నపుడు ఈ పృథ్విలోని ఏ శిలకు పూజ చేసినను ఈ ఆత్మలలోనే ఆత్మకు సేవ చేసినను అది నేరుగా నీకే చెంది నీ సంతోషమునకు గారణ మౌను గదా వేంకటేశ్వరా!

ముదిసి జరాముఖమ్మనను మ్రూల్గుచు నున్నను నింక నింక నా
మది పెను కామలోభముల మార్గమునే వెదకంగ సాగెఁ దా
నదయతఁ గప్ప సర్పముఖ మందున నుండియు దోమ లీఁగలన్
బొదిఁ గొని పొట్టఁ బెట్టఁ జను పోలిక నుండెను వేంకటేశ్వరా! 94

తా॥ కప్ప వెనుకటి భాగము పాము ముఖములోఁ జొచ్చి యున్నప్పటికిని ముందటి భాగములోఁ గల ముఖముతో ఇంకా తన బ్రదుకునకునై దోమ లీఁగలకై నాల్క సాచుచుండు నెట్లో అట్లే నేను గూడ ఒక ప్రక్క ముసలి తనము ముఖములోఁ బడి మ్రూల్గు చున్నను, ఇంకా ఇవన్ని నాకే కావలెనను కామము, ఎవరికి ఏమి ఇవ్వఁ గూడ దనెడి లోభముతో బాధపడు తోవలోనే నడచుచున్నాను ప్రభూ వేంకటేశ్వరా!

నే నిను గాంచి నంతటనె నీవు ననుం గృపఁ జూచి నంతనే
నేను త్వదీయ నేత్రముల నిచ్చితి నీవును నాదు నేత్రమై
కానఁగ నైతి నీ యతులకారుణికామృత మాను మత్తులో
నేనను మాటలే దగవు నీవ సమస్తము వేంకటేశ్వరా! 95

తా॥ నేను నిను చూచినంతలో నీవు నను కరుణతోఁ గాంచినంతలో నా కనులలో నీవు, నీ కనులలో నేను నిలిచిపోయినాము. అందు నేను నిరుపమాన మధుర రుచితో నున్న నీ కరుణామృత మానుచు ప్రమత్తుఁడనై పరవశుఁడనై పడియున్నపుడు నేను లేకుండ నుండి సమస్తము నీవయై కనఁబడినావు శ్రీ వేంకటేశ్వరా!

నిత్యము తావకీన పదనీరజ దాస్య ముపాస్య మంచు నే
భృత్యుఁ డొనర్చునో యతని భృత్యులభృత్యుల భృత్యభృత్యసద్
భృత్యుల శ్రేణి నంతిమపు భృత్యుఁడనేఁ, దరు మూలము న్ఫల
మ్మత్యనురాగ దృష్టి విటపాంతములం దిడు వేంకటేశ్వరా! 96

తా॥ "నీ పాదకమలముల సేవయే చేయఁ దగినది ఉపాసింపఁ దగినది" అని యే భృత్యుఁడు తా నొనర్చుచుండునో అతని దాసులకు దాసుల తిరిగి అభృత్యానుభృత్యుల కోవలో తుది సేవకుఁడనై యుండువాఁడను నేను స్వామీ! తరుమూలముఁ గూడా ఫలముల నన్నిటికన్న తుది కొమ్మలలోనే ప్రసాదించు చున్నదిఁ గదా వేంకటేశ్వరా!

ధనమున నెట్టి వస్తుసముదాయమునుం గొనవచ్చుఁ బ్రేమ సా
ధనమున సుందరీ ప్రణయధాత్రిని నేలఁగవచ్చు, గోఘృతేం
ధనముల యజ్ఞవహ్ని నొగి దన్పఁగ వచ్చును గాని భక్తి బం
ధనమున దక్క నీవు వసుధన్ వశమొందవు వేంకటేశ్వరా! 97

తా॥ ధనముతో ఎట్టి వస్తుసమూహము నైనా కొనవచ్చును. ప్రేమ ధనముతో ప్రియురాలి హృదయప్రపంచముపై రాజ్య మేలవచ్చును. నేతితోఁ దడిసిన ఇంధనముల (చిదుగుల)తో యజ్ఞాగ్నిహోత్రమును తృప్తి పరుచవచ్చును. కాని నీవు మాత్రము భక్తిధనముతోఁ దప్ప తక్కిన ధనములకు వశము గావు వేంకటేశ్వరా!

వనమున జెట్టు చెట్టొరసి వర్తిలఁ బుట్టిన దావ వహ్ని యా
త్మనిధనహేతుభూత మయి దగ్ధ మొనర్చును తద్విధమ్మె యౌ
వనమునఁ జూపు చూ పొరసి వర్తిలఁ బుట్టిన కామవహ్ని నా
తనుధన మానసాళి భసిత మ్మొనరించును వేంకటేశ్వరా! 98

తా॥ వనములో చెట్టుతో చెట్టు ఒరసిన దావాగ్ని పుట్టును. యౌవనమున నారీజనముల చూపులతోఁ జూపు లొరసినఁ గామాగ్ని బుట్టును. దావాగ్ని ఆ వనమునంత బూడిద చేసినట్లే కామాగ్ని నా తనువును ధనమును మానసమును భస్మ మొనర్చి నన్ను పతితుని జేయును శ్రీవేంకటేశ్వరా!

లలి భవదీయసత్కృపకు లక్ష్యములై రహియించు నాత్మలున్
మెలఁగునె సంసృతి న్మమత మేకొన దిర్గి భవాబ్ధి మున్గునే
వెలి యయి నట్టి వెన్న పదివేల ప్రయత్నము లాచరించినన్
గలియునె మజ్జిగన్ మునిఁగి కన్పడ కుండఁగ వేంకటేశ్వరా! 99

తా॥ నీ కృపకు పాత్రములైన ఆత్మలు బ్రహ్మానందములోఁ జేరి యాడునే కాని సంసారములో మెలఁగునా? మమతాబంధాలతో కట్టుఁబడి పాప కూపములో మున్గియుండునా? స్వామీ! పెరుగుఁ ద్రచ్చినచో వెలియైన వెన్న పది వేల ప్రయత్నము లాచరించినా చల్ల లోపల మునుఁగుట, కరఁగి లీన మగుట సంభవించునా శ్రీవేంకటేశ్వరా!

సురనరతిర్యగాదులు వసుంధరపై నిను జూడ నెంచి యో
హరి! నిజసప్తజన్మసముపార్జితపుణ్యధనమ్ము రాశిఁబో
సిరొ వరుసన్ ఫలాకృతిగ శ్రీపతి నిన్ దులదూఁచ నవ్వియే
గిరులయి నీ నివాసముగఁ గీర్తి వహించెనొ వేంకటేశ్వరా! 100

తా॥ ఓ పాపముల హరించు వేంకటేశ్వరా! నిన్ను చూచుటకై తలపోసి నరులు దేవతలు తిర్యగ్జంతుసమూహములు తమ ఏడు జన్మలలో సంపాదించు కొనిన పుణ్యముల నన్నిటిని రాసులు బోసిరేమో! దానికి ఫలితముగా నిన్ను తుల దూఁచఁ గల్గినవేమో! ఆ వారి పుణ్యరాసులే సప్తగిరులై నీకు నివాస యోగ్యమైనవేమో శ్రీ వేంకటేశ్వరా!

నిను గని నేను నా తృషితనేత్రపథమ్ముల హృన్నివేశ మం
దొనరఁగ ధ్యానపీఠమున నుంచి వరించి మదాత్మనే నమ
ర్పణ మొనరించినాఁడ నెడఁబాయఁగ న్యాయమె దూరమౌదు వీ
కనులకు, గుండె వీడి చనఁగల్గుదు వేగతి? వేంకటేశ్వరా! 101

తా॥ నిను గాంచి నేను నా దప్పిగొన్న నేత్రముల ద్వారము గుండా హృదయ మనే యింటిలో ధ్యాన మనెడి పీఠముపైన నివసింపఁ జేసి నిను వరించి నా ఆత్మనే సమర్పించుకొంటిని అటువంటి నన్ను ఎడఁబాయుట నీకు న్యాయమగునా? నా కన్నులకు దూర మౌదువేమో కాని, నా హృదయమును వీడిపోవుటలు నీకు వశము గాదు వేంకటేశ్వరా!

శర్వపితామహాద్యమరసంతతికిన్ ప్రియమౌ రసాయన
మ్మర్వి సుధారసాభమయి యుగ్రజరామయజన్మమృత్యుదు
ర్గర్వ మడంచు భేషజము గవ్వయు వెచ్చము లేక తీయనై
నిర్వృతి గూర్చు నౌషధము నీ శుభనామమే వేంకటేశ్వరా! 102

తా॥ అజహరులు మొదలుగాఁగల దేవతాకోటికిఁ బ్రియమైన అమృతము జన్మమృత్యుజరారోగములకు గర్వము నణచే ఔషధము ప్రపంచమున వెలసిన సుధారసము ఒక గవ్వఁ గూడ కర్చు చేయకుండగనే సకలభవరోగముల నణఁచు తీయనైన మందు ప్రపంచములో నీదైన మంగళకరమగు నామమే కదా వేంకటేశ్వరా!

కలువల చిన్నబుచ్చు మెరుగౌ కనుదమ్ములఁ జూడ వేల? యా
జలజములన్ హసించు ముఖచంద్రుని వాక్సుధ లొల్కవేల యా
నెల తలఁదన్ని దూకి పడు నీ పదతీర్థము నీయవేల? నా
తలఁపుల నెప్డు నీ చరణధారణ నీయవె వేంకటేశ్వరా! 103

తా॥ కలువ పూల నిరసించు నీ కన్నుఁదామరల నొకసారి దర్శించ వేలరా? ఆ కమలములను పరిహసించు నీ ముఖచంద్రుని లోని వాగమృతము నొల్కఁ జేయ వేలరా? శంకరుని తలఁదన్ని దూకు నీ పద తీర్థమును ప్రసాదించ వేలరా? నా సంకల్పములలో నెందు నీ పదముల ధరించు శక్తిని కృపఁ జేయ వేలరా వేంకటేశ్వరా!

పాపకలాపసంసరణపంకముఖమ్మునఁ బుట్టి వచ్చి పు
ణ్యాపగలో నెదింగి విమలాంబువులన్ దగ వీడి కాంతి సం
దీపితశూన్యసంగతిరతిన్ రవిఁ గాంచి హసించు తమ్మినై
పాపము పుణ్యముల్ గడిగి భక్తిఁ దరించెద వేంకటేశ్వరా! 104

తా॥ పాపపుంజములతో నిండిన సంసార పంకములోఁ బుట్టి వచ్చి, పుణ్యజలములలోఁ బెరిగి ఆ పవిత్రమైన నీటిని గూడా విడిచి శూన్యములో ఆసఁగా ఆకాశములో నిల్చి సూర్యుని జూచి నవ్వుచున్న కమలమునై పాప పుణ్యముల కడిగివేసి నీ పదదర్శనముతో ఆనందించి తరించెద వేంకటేశ్వరా!

కోపముతో వివేకమును గోల్పడ నీక భయానకమ్ములౌ
నాపదలందు నోపికను సంచితధైర్యము వీడ నీక సం
దీపితసర్వసంపదల నీ పదభక్తి తొలంగ నీక నా
ప్రాపువు నీవయై యెపుడు పాలన సేయవె వేంకటేశ్వరా! 105

తా॥ కోపము వచ్చినప్పుడు నా వివేకమును పోగొట్టుకొన నీకుము. భయంకరమైన ఆపదలలో ఓపికను ధైర్యమును విడువకుండ నిలుపుము. సంపదలలో నీ పాద భక్తిని తొలఁగ నీక నా ప్రాపువు నీవై ఎపుడును నను పాలించుము శ్రీ వేంకటేశ్వరా!

ఆరయ షడ్వికారమయమైన శరీరము నేనటంచునున్
దారసుతాప్తమిత్రవసుధాపశువర్గము నాది యంచు సం
సారము సారయుక్తమని శాశ్వతమంచు దలంచు నజ్ఞతా
భారమడంచి జ్ఞానపరిపాక మొసంగవె వేంకటేశ్వరా! 106

తా॥ షడ్వికార మయమైన శరీరమునే నేనని దార పుత్రాదులు, ఆప్త మిత్రులు, భూమి పశువర్గము నాది యనుచు ఈ సంసారము సారము గలదని, శాశ్వతమని తలంచు అజ్ఞాన భారము నణఁచి జ్ఞాన పరిణతిని నా కొసంగి కాపాడుము వేంకటేశ్వరా!

నీ కరుణార్హతన్ గనఁగ నిక్కపు టార్తియె కాక వేరే యా
వ్యాకరణాదిశాస్త్రము లవశ్యములే సుమనస్సుధారుచుల్
లేకయు నీడ నీకయు ఫలించక యత్తులసీమహీరుహ
మ్మాకులతోనె సౌరభము లర్పణ సేయదె? వేంకటేశ్వరా! 107

తా॥ నీవు కరుణించుటకు అర్హత కావలె నన్న నిజమగు ఆర్తియే కావలె కాని వేరే వ్యాకరణాది శాస్త్రము లవసరములా వేంకటేశ్వరా! పూలు పూయకుండా తేనియల స్రవించకుండా నీడ నీయకుండా ఫలించకుండా ఆ తులసి మొక్క ఆకుల సువాసనతోనే నిన్ను తూచుకొనలేదా స్వామీ, శ్రీవేంకటేశ్వరా!

వంచకుఁడైన మన్మథుని వారక పుత్రుఁడు గాఁగ నేలవే
కొంచెపు గోటికైన సరిగూడని గంగను గూతుఁ జేయవే
ఎంచఁగ నేల నా గుణము లేలుట కైనను నీ పదాల సే
వించెడి నీ సుతుండ నను విన్నపముల్ విని వేంకటేశ్వరా! 108

తా॥ మోసగాఁడైన మన్మథుని విడువక పుత్రునిగా నేలుకొనవా? కొంచెపుం గోటికి సరిరాని గంగను బిడ్డగాఁ జేపట్టవా? నన్ను నీ గుణము లేవియని విచారించనేల? నీ పాదారవిందముల సేవించెడి నీ కుమారుఁడను, నా విన్నపము విని నను గాపాడు శ్రీ వేంకటేశ్వరా!

శ్రీ వేంకటేశ్వర స్తవరాజము సంపూర్ణము

శ్రీవాగీశ్వర్యైనమః

# శ్రీ స్తవరాజ పంచశతి

## శ్రీనృసింహ స్తవరాజము

మలినజరాభరమ్మునను మాయములై చను రూపయౌవన
మ్ములఁ గని శాశ్వతమ్ములని మూర్ఖుఁడనై తలపోయుచుండెదన్
తొలఁగని మృత్యు హస్తములఁ దోచుకొనంబడు మేని నిత్యమీ
యిల మనునందు, మంచుచిను కేగతి మౌక్తికమౌ? నృకేసరీ! 1

తా॥ మలినమగు వృద్ధాప్య భారముతో మాయమై పోవు రూపమును వయస్సును గాంచి ఇవే శాశ్వతము లనుకొని మూర్ఖుఁడనై తలఁచు చుండెదను. కాని రాకతప్పని మృత్యుహస్తములతో ఇది దోఁచుకొనఁబడు ననుకొనను. ఈ శరీరమే శాశ్వతమని తలఁపోయుదును. మంచు చినుకు మంచి ముత్తె మెన్నడైన కాగలుగునా శ్రీనారసింహప్రభూ!

శ్రీధయితా! శరీరమును స్వీయము కాదని తేలిపోయెరా
నాదను నొక్క వస్తువును నాకిఁక లేదది యెట్టులన్నచో
నాదను వస్తువెందు నవినాశియె నాకొకటుండె నేని య
మ్మేదిని దానిఁ గొంచు నెలమిం జనకుందు నెటుల్? నృకేసరీ! 2

తా॥ ఓ లక్ష్మీనాథా! నా శరీరము కూడా నాది కాదని తేలిపోయినది. నాదను వస్తు వీ ప్రపంచమున నాకొకటియు లేదు. నాకొకటి నశించని నాదను వస్తు వున్నచో నేను దానిని నావెంట కొనిపోకుండ నుందునెట్లు? కావున ఈశ్వరుఁడవైన నీదే యీ ఐశ్వర్యమంతయు నని తెలిసికొన్నాను.

తన పతి యంత మొందినను దాపము నొందక యాడు బాలికన్
దనయనుఁ గాంచి యేడ్చు తలిదండ్రుల వోలె గురూత్తముల్ సదా
మునుగతి గాంచలేక యతిమూర్ఖుఁడనై నిను వీడి సంసృతిన్
మునిఁగెడి నన్ను గాంచి యెద పొక్కఁ దపింతురు శ్రీనృకేసరీ! 3

తా॥ తన మగఁడు చనిపోయినను తాపపడక సాటి పిల్లలతో నాడుకొను బాలికను గాంచి యేడ్చెడి తలిదండ్రుల వలె అజ్ఞానినై నా భర్తవగు నిన్ను వీడి సంసారమందు నడయాడు నను గాంచి నా గురువులు హృదయములోఁ జాల పరితపించుచుందురు. వీని జన్మ వృథా యయ్యెఁ గదా! అనునదే ఆ తాపము శ్రీ నారసింహప్రభూ!

విమలాశ్వత్థము కాకి రెట్ట వడి యావిర్భూత మైనట్లు వా
సి మధువ్రాతము నీచమక్షికముఖోచ్ఛిష్టోద్భవం బైనటుల్
తమి ముక్తావళి యల్పశక్తి కృతి రత్న ప్రక్రియం బొందిన
ట్లు మదీయంబగు స్వల్పవాక్కు కవితారూపమ్ము గాదా! హరీ! 4

తా॥ కాకి రావిపండ్లు దిని రెట్ట రాల్చినచో దానినుండి పవిత్రమైన రావి చెట్టు ఉద్భవించినట్లు మరియు తేనె సోనలు అల్పమైన ఈఁగ యొక్క ఎంగిలి నుండి జనించినట్లు, అటులే ముత్తెములు సాధారణపు ముత్తెపు చిప్పనుండి బయల్పడినట్లు నా వగు ఈ చిన్నమాటలు నీ కరుణచే కవిత్వరూపము ధరింప కుండునా శ్రీహరీ!

ఎన్నగ విశ్వరూపి వయి యేగతిఁ జిన్నని నా యెడందఁ బ్ర
చ్ఛన్నత దాఁగినాడవుర స్వామి! యభేద్యము నీదు మాయ తా
జిన్నని బీజరూపకవిచిత్రసుపేటికలోన నీవహో!
మిన్నుల నంట వృక్షముల మెప్పుగ దాఁచవె శ్రీనృకేసరీ! 5

తా॥ విరాట్‌స్వరూపుఁడవై విశ్వమంత వ్యాపించియున్న నీవు విచారించి చూడఁగా నత్యంతము చిన్నదగు నా మనసులో ఎట్లు దాఁగియున్నావు? నీ మాయ యభేద్యము గదా చిన్నదైన బీజరూపములో నున్న విచిత్రమగు పెట్టెలో ఒక్కొక్క మహా వృక్షమును అవలీలగా దాచియుంచుచులేవా శ్రీహరీ!

నా మేధస్సును జక్రరాజమునుగా నా వాక్కు శంఖమ్ముగా
స్వామీ! పెన్గదఁగా శరీరమును నా స్వాంతమ్మె పద్మమ్ము గా
నీ మేనన్ భవదాయుధమ్ములుగ నే నేవేళ నర్పించెదన్
సామీప్యమ్మును జేర్చి చేకొనఁ గదే! శౌరీ! నృసింహప్రభూ! 6

తా॥ నా మేధస్సును చక్రరాజముగా మరియు నా వచస్సును శంఖముగా మరియు నా వపుస్సును అనగా నా శరీరమును గదగా అట్లే నా మనస్సును పద్మముగా నీకు నే నేవేళ అర్పించుకొనుచున్నాను. దీని నీ ఆయుధములుగా స్వీకంచి నన్ను నీ సన్నిధి నుంచుకొనుము ఓ శ్రీహరీ!

ఎందును లేవు నీవనుచు నెప్పుడు పల్కు హిరణ్యకశ్యపుం
డంధుని వోలె విశ్వమున నంతట నిండి వెలుంగు నిన్ గనం
డెందును జూడ నందె కల వీవని పల్కెను దైత్యబాలుఁడో
సుందరరూప భక్తి నిను జూచు కనుల్ దొరుకున్ నృకేసరీ! 7

తా॥ నీ వెక్కడను లేవని అంధుని వలె హిరణ్య కశిపువు పల్కు చుండెను. విశ్వము నందంతట నిండి వెల్గు నిన్ను వాఁడు చూడలేఁడు. ఎందుఁ గావించిన నందే కలవని రాక్షస బాలుఁడైన ప్రహ్లాదుడు పల్కినాఁడు. దీన్నిబట్టి చూచిన భక్తి గలవానికే నిను జూచు కన్నులు దొరకును గదా యనిపించును స్వామీ శ్రీహరీ!

పాతర బిందె లోహపుట భాసుర పేటిక పుట్టలై మనన్,
గోతపు కూసముల్ దొడిగి కోటికినిం బడగెత్తు విత్త వి
ఖ్యాత సరీసృప మ్మది యహమ్మమతల్ వడి కోరలై చనన్
వాత మదాఖ్య దుర్విషము వాంతి యొనర్చెడి శ్రీనృకేసరీ! 8

తా॥ పాతరబిందె ఇనుపపెట్టె (ధనమును పెట్టి దాచుకొను వస్తువులు) మొదలగునవి పుట్ట రూపు దాల్చఁగా రూకల నింపు గోతములే తాల్చి విడుచు కుబుసములు గాఁగా కోటికి పడగెత్తు ధన మనెడి సర్పము, అహంకార మమకారములు తనకు కోరలై రూపొందఁగా మద మనెడి దుర్విషమును నోటఁ గక్కుచున్నది. ఈ ధన మొక సర్పము కదా నరసింహా!

నిరతము పాపభావనమునే పురికొల్పు పరాంగనాకృతిన్
సరసతఁ గాంచఁ గోరు భవసంహరణ మ్మొనరించు నీదు సుం
దరతనుదర్శనమ్మనకుఁ దానటుఁ గోరఁడు పాపి రూకలన్
మరి మరి లెక్కవెట్టు తమ నామజప మ్మొడుగున్, నృకేసరీ! 9

తా॥ నిరంతరము పాపములనే పురికొల్పు పరస్త్రీ స్వరూపమును సదా భావన సేయుచుండును. సంసార ఘోర బంధములను విడఁగొట్టు నీ దివ్య మంగళ విగ్రహ దర్శనమునుఁ జేయఁ గోరదు. పెట్టెలో నున్న రూపాయలను మరీ మరీ లెక్కఁబెట్టుకొనుచుండును. కాని మీ నామమును ఒక తేపయును **జపించలేడు కదా శ్రీహరీ!**

దినమును రాత్రియున్ సమతఁ దీర్చిన యట్టులు మానవాళికిన్
గనుగొనఁ గష్టసౌఖ్యములు కావడి కుండలటంచుఁ బల్కరే
మనమున నెంచరేల సగమాత్రము వెన్నెలసేయు రేల నో
యనుపమ! నీ దయాజలధి కంతము గల్గునె? శ్రీనృకేసరీ! 10

తా॥ రాత్రియును దినము సమానముగా నున్నట్లు మానవులకు కష్ట **సుఖములు** కావడికుండల వలె సమానముగా నుండు నందురు. మరి ఆ రాత్రులలో గూడా సగభాగము చీఁకటిని పోనడఁచి వెన్నెలలు చల్లని వెల్గులు ప్రసా**దించుట** మనస్సులో దలఁపరేల? ఓ నిరుపమాన దయాసముద్రా! దీనిఁ బట్టి **చూడ మాపై** నీ కరుణ యెంత గలదో ఊహింపగలమా నృకేసరీ!

నరములె దారముల్ మరియు నాణ్యములైన శరీరకాంతులం
బరఁగెడు యౌవన మ్మొకట వస్త్రము నంటు మనోజ్ఞవర్ణ మీ
నెరసిన వెంద్రుకల్ క్రమవినిర్గతదంతముఖంబునున్ వళీ
పరివృతవార్ధకాంగము విపాటిత జీర్ణవసానమో హరీ! 11

తా॥ ఈ నరములే దారములు. సొంపగు ఈ శరీర కాంతులతో శోభించు యౌవనమే ఈ శరీర మనెడి వస్త్రము నంటి యుండు మనోజ్ఞమైన రంగు. ఈ నెరసిన వెంద్రుకలు క్రమముగా విడి పోవు దంతములు ముడుతలు పడు చర్మమును గాంచఁగా రంగు వెలిసిపోయి చినిగిపోయి క్రమక్రమముగా విడిచి పారవేయఁ దగిన ప్రాత చింపుల పేలిక గాదా శ్రీహరీ!

అనవసర ప్రసంగపరిహాసవిలాసవినోద సంగతిన్
దినముల బుచ్చుచుండెదరు దీననరుల్ భవబద్ధబుద్ధులై
మనమున నీదు ధ్యానమును మంజులవాగ్గతి నీదు నామమున్
క్షణము భజించలేరొ? యవకాశముఁ జిక్కిన శ్రీనృకేసరీ! 12

తా॥ అవసరములేని ప్రసంగములతోఁ బరిహాసములవంటి వినోదభాషణములతో సంసారబద్ధులు దినములఁ బుచ్చుచుండెదరు. ఎంత దీనులైన మానవులు వీరు! అదే మనస్సులో నీకు ధ్యానమును మనోజ్ఞధ్వని గల వాక్కులలో అవకాశము గలిగి కూడ నీ నామము నొక క్షణమాత్రము భజింపలేరుకదా. శ్రీహరీ!

అరయ శతాధికాబ్దములు నాయువుఁ గల్గిన యట్లు భావమం
దరయుదు రంతలోనె తన యంకెకు వచ్చును మృత్యువో! వనిన్
దిరుగు వృషమ్ముపైఁ బడి వధించెడి బెబ్బులి వోలె నప్పుడో
మరియొక దిక్కుఁగాంచకయె మ్రందుచు నేడ్తురు శ్రీనృకేసరీ! 13

తా॥ నూరు సంవత్సరములకు మించి ఆయుర్దాయము తమకున్నట్లు ముందెప్పుడో హరిని భజించవచ్చునను కొందు రీ మూఢమానవులు. కాని, అంతలోనే వనములో మేయుచున్న ఎద్దుపైఁ బడి వధించెడి బెబ్బులివలె మృత్యువేమో పైన వచ్చి పడుచున్నది. అపుడు వేరే దిక్కుఁగాంచక వారై ఏడ్చుచు చనిపోవుదురు కాని జననమరణముక్తికై నిన్ను భజించలేరు శ్రీహరీ!

గాలముఁ గొంచు చేప కొరకై యెఱ నాసగఁ జూపు జాలరిం
బోలి సతమ్ము ప్రాణిఁ గొనిపోవఁగఁ గాలముఖమ్మునన్ భ్రమం
దేలగఁ జేయు వైషయిక దేహ సుఖామిష మాసఁజూపి యా
కాలుఁడు నిల్చు జీవన వికార సరస్వతి శ్రీనృకేసరీ! 14

తా॥ గాలమును దీసికొని చేపను బట్టుటకై ఎఱను ఆస చూపు జాలరివలె ఎప్పుడును ఈ ప్రాణిని గొనిపోవుటకై కాలమను గాలము కేలఁబూని దానికి విషయసుఖము లను మాంసమును చేపకు వలె ఆసఁజూపి, ఆ యముఁడు జీవన మనెడి ఒక నది యొడ్డున నిల్చియున్నాడు. ఈ జీవుడు భ్రమఁగొని ఆ యముని కాలముఖములోఁ బడి యీల్గుచున్నాడు, శ్రీహరీ!

గగనమునుండి స్రవాలి యొడికమ్ముగ నొక్క ప్రవాహమై సదా
సుగతికినై మహార్ణవము జొచ్చెడి హెచ్చెడి కౌతుకమ్ముతో
నెగడుచు నాగకుండఁ జను నీరము, జీవన మట్లె యెప్పుడున్
తగ లయకూటముం గలియ దా నరుగుం గదె శ్రీ నృకేసరీ! 15

తా॥ ఆకాశమునుండి అందముగా భూమిపై స్రవాలి ఒక ప్రవాహరూపమై ఎంతో ఉత్సాహముతో తన సుగతికై ఆగకుండా సముద్రములోఁ జొచ్చెడి నీరువలెనే జీవనముగూడా ఎల్లప్పుడును విలయ మొందుటకు తానై పోవుచుండును గదా నరహరీ!

నను బయికెత్త నీవొకట నాలుగు హస్తము లొప్పి యుందు వే
నును గ్రిందు లాగ నెయ్యెడల నాలుగు కాళులతోఁ బ్రయత్నముం
బొనరుచుచుంటి మేల్పశువు పోలిక నుంటిని ఎట్లు లేను నీ
ఘనతరసత్కృపాలవముఁ గాంచి తరింతునొ శ్రీనృకేసరీ! 16

తా॥ నన్ను పయికెత్తుటకై నీవు నాల్గు చేతులుఁ గల్గియున్నావు. నేను అధఃపాతముఁ జెందుటకై నాల్గు కాళ్ళతోఁ బశువునై ప్రబలప్రయత్నముఁ జేయుచున్నాను. నే నెట్లు నీ కృపాలేశమును బొంది తరింతునో తెలియకున్నాను, నరహరీ!

పొత్తిళులందునుండియెది బొత్తుగఁ దెల్యని చంటి బిడ్డ యా
పత్తులు సంభవించిన నివారణ సేసెడి మాతృహస్తమున్
ఎత్తెఱఁ గింతయున్ మదిని నేమియు దెల్యఁగఁజాల దట్లె నే
చిత్తమునందు నీ కరుణఁ జెందెడి మేలెఱుఁగన్ నృకేసరీ! 17

తా॥ పొత్తిళ్ళలోఁ బడుకొనియున్న ఏమి తెలియని చంటి పాప తనకు అపాయము సంభవించి నపుడు తనను ఆదుకొని వాటిని నివారించే తల్లి హస్తమును అది చేయు ఉపచారములను ఎట్లు రవంతయును దెలియఁజాలదో అట్లే నేను పరోక్షముగా నుండి నీవొనర్చెడి మేలును తెలియఁజాల నరహరీ!

శ్రీసింహాద్రి వసించి నీ విటువలెన్ సింహాఖ్యతో నెయ్యెడన్
భాసించం గతమేమి? స్వామి! యితరుల్ బ్రహ్మేంద్రరుద్రామరుల్
నీ సాన్నిధ్యము నందుఁ గేసరి సరి న్నిల్వంగ లేనట్టి స
త్రాసాశేషసృగాలజాలమని యీ దాసాళి తెల్యన్ హరీ! 18

తా॥ నీవు సింహాద్రిలో వసించి నృసింహస్వామి యను పేరుతో ప్రకాశించుటకు కారణమేమి? స్వామీ! నీ కంటె ఇతరులైన బ్రహ్మ ఇంద్రుఁడు రుద్రుడు మున్నగు దేవతలు నీ సాన్నిధ్యములో సింహము వద్ద భయముతో నిలువలేని నక్కలు మొదలుగాఁ గల జంతు జాలము వలె నుందురని యీ దాసులకుఁ దెలియఁ జేయుటకా స్వామీ శ్రీహరీ!

నీవు వరాహరూపుఁడవౌ? నీరజనాభ! నృసింహ మూర్తివై
సేవనభాగ్య మందుఁ గృప చేసెదవౌ? తెలియంగ రాదు సు
శ్రీవిధి నీ వరాహనరసింహసమైక్యత కేమి యర్థమో
భూవనితారమాధిపతఁ బొందుట కర్తుఁడ నందువా హరీ! 19

తా॥ సింహాచలములో నీవు వరాహనారసింహ స్వామి అవతారముఁ దాల్చి సేవనభాగ్యమిచ్చుచున్నావు. ఇచ్చట నీ వరాహరూపముతో భూదేవికి, మరియు సింహ రూపముతో లక్ష్మిదేవికిని భర్తవైన శ్రీమన్నారాయణుఁడ నేనే యని తెల్పుచుంటివా శ్రీహరీ!

చందనచర్చదాగి యిటు సంతతసేవ నొసంగెఁ దేల? క
న్విందిడు నీ స్వరూపమును వీక్షణముం బొనరింప నీవు మ
ధ్యందినభాస్కరోజ్వల మహాకృతిఁ గాంచఁగ సాధ్యమౌనొకో?
సుందరనీల నీరదసుశోభల దాఁగక యున్న శ్రీహరీ! 20

తా॥ సింహాచలములో నీవు సర్వ కాలములు చందన చర్చలలోఁ దాఁగి ఎందులకు దర్శన మొసంగెదవు? నీ నిజరూపము నేల చూపింపవు? ఎందుకని మా కనుపిం దొనర్పవు? పట్టపగలు ప్రజ్వలించు సూర్య భగవానుఁడు నీ మేఘాల చాటుకు దాఁగి యున్ననే కన్నులతో సేవించుట కర్తుఁడు కదా స్వామీ శ్రీహరీ!

ఈవు వరాహరూపత మహీసతి నత్రపతిరాగవేగ సం
భావితఁ జేయ శ్రీసతి సపత్నిసుఖస్థితి కీర్ష్యఁ జెంద వీ
క్షావిధి నారసింహతను దీపితరూపత సత్కరింప శ్రీ
దేవి యొనర్చు లాలనలఁ దేలి ప్రసన్నుడవైతి శ్రీహరీ! 21

తా॥ నీవు వరాహరూపముతో భూదేవిని ప్రేమాతిశయముతో సంభావింప లక్ష్మీదేవి భర్త అనుగ్రహమునకు పాత్రయగు భూదేవిని చూచి అసూయపడ నీవు అదే రూపములో నారసింహతను దర్శింపఁ జేసి ఆమెను సత్కారము చేసితివి. నీ నారసింహత్వములోని ఉగ్రతను శమింపఁ జేయుటకు లాలించు శ్రీదేవితోఁ గూడి ప్రసన్నుఁడ వైతివి నృసింహ ప్రభూ!

చిత్రముగా వరాహనరసింహసమైక్యతఁ బూని శ్రీసతిన్
ధాత్రిని నేకకాలమున దాపున జేర్చితి వౌర! ప్రేమకున్
బాత్రము లిద్దరంచు ధృతభాసురకేసరిచందనమ్ములై
సత్రవపుర్వర మ్మలమ స్వామి! సమర్థుఁడవో నృకేసరీ! 22

తా॥ వరాహనరసింహత్వములను ఒకే రూపులోఁ జిత్రముగాఁ జూపి శ్రీసతిని భూసతిని ఏకకాలములో దరికిఁ జేర్చి ఇద్దరును ప్రేమపాత్రము లనుచుఁ జూపితివి. అందులో శ్రీదేవి నిను కేసరిగా నలముకొన భూదేవి చందన రూపముతో సంశ్లేషించెను. ఎంతటి మాయవేషములఁ దాల్చనైన నీవు సమర్థుఁడవు స్వామీ!

విజ్ఞానాంబరభాస్కరాయితవపుర్విశ్లిష్టపాటీరమృత్
సంజ్ఞాలేశము ఫాలపట్టికల దాసవ్రాతముల్ దాల్పఁగాఁ
బ్రజ్ఞాచక్షువు విప్ప దుఃఖభయదప్రారబ్ధముల్ దప్పఁగా
అజ్ఞానాంధతమిస్రవారకవరాహశ్రీలు మీరే హరీ! 23

తా॥ విజ్ఞాన మనెడి యాకాశములో వెల్గు భాస్కరుని దలఁపించు నీ తనువు నుండి విడివడిన కేసరిమిశ్రితచందనమును రవంత తీసికొని నీ దాసులు ఫాలభాగమందు తిలకాకృతిలో ధరింప వారి ప్రజ్ఞాచక్షువు విచ్చుటే కాక వారి భయంకరములైన దుఃఖప్రారబ్ధములుఁ గూడ తప్పుచున్నవి ఇట్లు అజ్ఞాన మనెడి అంధకారమును వారించు వర + అహస్ + శ్రీలు శ్రేష్ఠమగు - దినమునకు - కాంతిరూపులు మీరే కదా శ్రీహరీ!

ఏగెడివారిఁ గాంచియును నేఁగినవారి కథల్ దలంచియున్
బో గలవారి నెంచియును బోదును మేదిని వీడి నేను నం
చే గడియం దలంప డిది యెంతయు వింతగఁ దోచు మానవుం
డీ గతిఁ గన్ను లుండియును నేటికి నంధుడగున్ నృకేసరీ! 24

తా॥ ప్రపంచము వీడిపోవు వారిని చూచుచుండియు పోయినవారి కథలను వినుచుండియు ఇంక ముందు పోనున్న వారే వీరందరని ఎఱింగియును నేనునిట్లే ఈ ప్రపంచమును విడిపో నుంటినని ఒకసారి యైన హృదయమున నీ మానవుఁడు తలంపడు. ఇదెంత వింత! ఇతడిట్లు కన్ను లున్న గ్రుడ్డివాఁడుగా ఎందుల కగు చున్నాడు స్వామి, శ్రీహరీ!

తా మశ్వత్థమహీరుహప్రథితశీతచ్ఛాయలం దెందరో
స్వామ్యుల్ కాననమార్గగాములయి విశ్రాంతిం గొనన్ వచ్చినా
రా ముందే యట నున్న వారలు ప్రయాణాయాసముం బుచ్చి యా
ధామ మ్మాప్రజ కిచ్చి పోయిరి జగతత్త్వ మ్మిదే శ్రీహరీ! 25

తా॥ ఈ ప్రపంచమనెడి ప్రసిద్ధమైన రావిచెట్టు చల్లని నీడలతో ఎందరో మానవులు విశ్రాంతిఁ గొనుటకు వచ్చినారు. అంతకు ముందే అచ్చట నున్నవారు తమ ప్రయాణశ్రమముఁ దీర్చుకొని తాము నివసించు ఆ చోటులను క్రొత్తగా వచ్చిన వారికిచ్చి వెడలిపోవుచున్నారు. జగత్తు యొక్క తత్త్వమే యిట్లున్నది కదా స్వామీ, నరహరీ!

వసుధ నొసంగ నెంచి బలి వామను పాణిని దానవారి వో
యు సమయమందు నడ్డు పడుచున్న సురారిగురుప్రబోధ, వాగ్
రసము లనిత్యలౌకికసుఖప్రదముల్ మిము వీడు విజ్ఞు లి
వ్వసుమతి నొంటి కంట మను వాయసరూపులు కాదె? శ్రీహరీ! 26

తా॥ వామనుఁ డడిగిన భూభాగము నతని కీయఁగా నెంచి బలిచక్రవర్తి ఆ వామనుని చేతిలో దానోదకము పోయు కాలమునం దా కార్యమునకు అడ్డువచ్చి అనేకవిధముల తన శిష్యుఁడైన బలికి రాక్షసగురువగు శుక్రాచార్యులు చెప్పు బోధలు అస్థిరమగు ఈ లోకసుఖములిచ్చునవే కదా! ఇట్లు చెప్పు [illegible] ఒక్క కన్ను గల కాకి రూపులగుదురే కాని పరమహంసల రూపులు కాలేరు కదా స్వామీ, శ్రీహరీ!

ఎందును గాంచ నందె కల వీవని తెల్పెను నీ చరిత్ర మో
హిందు వితండు ముస్లి మితఁ డీతఁడు క్రైస్త్రవుఁ డంచు భేదమున్
బొందుదురే నరుల్ చెవిని బోసిన వేద ఖురాను బైబిలుల్
సందియ మేలరా? బధిరసన్నిధి సంకు రొదల్ నృకేసరీ! 27

తా॥ నృసింహావతారముఁ దాల్చి ప్రహ్లాదుని రక్షించిన నీ చరిత్రము నీ వెందు జూచిన నందులో నుంటివని తెల్పినది. కాని దాని చదివిన మానవులు ఇతఁడు హిందువు ఇతఁడు ముసల్మాను ఇతఁడు క్రైస్తవుఁడని భేదభావమును ప్రకటించి ద్వేషింతురు. నీవు వారి చెవిలో నూరి పోసిన వేద ఖురాను బైబిలు గ్రంథాలు చెవిటి ముందు శంఖము నూది నట్లే కదా స్వామీ, నారసింహప్రభూ!

పొల్చును జన్మజన్మలకుఁ బుత్రకళత్రచయమ్ము దానె మున్
నిల్చు దరిద్రతా భరము నిత్యజరామయమృత్యుదుఃఖముల్
ప్రీల్చు నెడందఁ గావుమని వేడెదఁ గొల్చిన దానినే సదా
కొల్చుచుఁ గ్రుమ్మరింప నొనగూడునె లాభము శ్రీనృకేసరీ! 28

తా॥ జన్మజన్మలలో దారపుత్రాదులు కలుగఁ గలరు. ఎన్నడు దరిద్ర బాధ సమసిపోదు. ఎప్పుడూ ముసలితనము రోగములు మరణబాధ మనస్సును బాధించుచునే ఉండును. ఎపుడు వీని నుండి కాపాడు మని నిను వేడు కొనుచునే యుందును. ఇట్లు కొలిచిన ధాన్యమునే మరల మరల కొలిచిన దాన నేమి లాభము చేకూరునో స్వామీ, నారసింహా!

అనృతము లాత్మబంధువుల యట్టులు తప్పులు కప్పి పుచ్చు నం
చనయము వాని ప్రేమమెయి నాశ్రయణ మ్మొనరించుఁగాని తా
ననలము నార్పనెంచి పయి నాజ్యము వోయుట లంచు నెంచఁడీ
మనసు జయింపఁగా సులభమార్గము మీపదభక్తి శ్రీహరీ! 29

తా॥ కల్లలు ఆత్మబంధువుల వలె నాతప్పులఁ గప్పి పుచ్చ గలవని నమ్మికొని దాని నాశ్రయించి తిరుగుచుంటిని. కాని అది అగ్గిని చల్లార్ప నెంచి నెయ్యిని బోసినట్లు బాధలను పెంచుకొనుటయే కాని తగ్గించుకొనుట కాదు కదా! ఇట్టి మనస్సును జయించుటకు మీ పాదభక్తియే సులభమార్గము కదా, నారసింహా!

ఒక్కరి మంచి మంచి యన నోపదు నాలుక ముల్లుఁ గ్రుచ్చు తా
నొక్కరి మేలుఁ గాంచి యెపు డోర్వఁగఁ జాలదు, నిప్పుఁ ద్రొక్కిన
ట్లొక్కెడ బాధఁజెందు నొరుఁ డున్నతిఁ జెందిన నిద్రపోవ దీ
టక్కరి స్వాంతమున్ గెలుచుటల్ తమ సేవనలన్ నృకేసరీ! 30

తా॥ ఈ నాలుక ఒకరి మంచిని మంచి అని చెప్పుటకు ముల్లు గ్రుచ్చుకొని నట్లు బాధపడును. ఒకరి మేలును జూచి ఈ మనస్సు ఓర్వలేకుండును. నిప్పుఁ ద్రొక్కినట్లు కష్టపడును. ఒకఁడు ఉన్నతస్థితిలో నున్నచో నిద్ర పోక వగచు చుండును. ఈ టక్కరి హృదయమును గెల్చుటకు ఉపాయము మీ పదభక్తియే కదా స్వామీ!

మహిఁగల ప్రాణు లందరిని మానవు నుత్తమ బుద్ధిశాలిగా
విహితగతిన్ సృజించితివి వీఁడు ప్రపంచము నుద్ధరించు నం
చహి కిడు క్షీరమయ్యె భవదార్ద్రి దయామృతవర్ష మాతఁడో
సహనము మాలి చంపి తినసాగె నమాయిక ప్రాణులన్ హరీ! 31

తా॥ ప్రపంచమునఁ గల ప్రాణులలో కెల్ల మనుష్యుని నుత్తమబుద్ధి మంతునిగాఁ బుట్టించితివి. వీఁడు ప్రపంచము నుద్ధరింపఁగలఁ డని తలంచితివి. కాని, అది పాముకు పాలు బోసినట్లైనది. మీ దయామృతవృష్టి వ్యర్థ మైనది. ఆ మానవుఁడే సహింపులేక అమాయికప్రాణులఁ జంపి తినుచున్నాఁడు నార సింహ ప్రభూ!

సముఁడవు నీ వమాయికుల సత్వవిహీనుల నొక్కవర్గ, మెం
దమిత బలాఢ్యులన్ దగ మహాచతురాత్ముల నొక్కవర్గమే
క్రమమని సృష్టి చేసితివి కాలగతిం జతురాత్ము లజ్ఞులన్
నమలి తినం దొడంగి రిది న్యాయమె నీవెటు లోర్తు? శ్రీహరీ! 32

తా॥ నీవు "సమోహం సర్వభూతేషు" అనిన సమభావము గల దయా శాలివి. బలహీనుల నొక్కవర్గముగా బలవంతులను తెలివి గలవారిని మరొక వర్గముగా ఏ క్రమమని పుట్టించితివి? కాలక్రమముగా ఈ తెలివిగలవారు తెలివి మాలిన అమాయికులను నమలి తినుచున్నారు. ఇది యేమి న్యాయము? దీనిఁగని నీవెట్లు ఓర్చుకొనుచున్నావు స్వామీ, నరహరీ!

ఇల బలవంతుఁడా బలవిహీనుని గాంచి ఘృణావిహీనుఁడై
తల నదుమం దొడంగెను నతండు హరీ! యని యేడ్వసాగె నీ
సలలితసామగానపరిషద్విలసద్ఘనమర్దలోన్నమత్
కలకలమందు నెందు చిలుకల్ పలుకన్ వినవచ్చునే? హరీ! 33

తా॥ ప్రపంచములో బలవంతుఁడు బలహీనుని తల నదిమి బాధ పెట్టు చున్నాడు. ఆ బలహీనుఁడు "హరీ!" అని యేడ్చుచున్నాడు. చిలుక పల్కుల వంటి ఆ యేడ్పు నీయొక్క మనోజ్ఞమైన సామగానసభలో మిక్కిలి మ్రోగుచున్న మృదంగధ్వనులలో వినవచ్చునా, నారసింహప్రభూ!

గుడిసెల యందు నస్థికల గూఁడులఁ గూడును గుడ్డలేని యా
బడుగు శరీరముల్ మిడుక బంగరుశాటిని దాల్చి కుల్కుచున్
కుడిచెడు భోగభాగ్యములు కూడునె? పుత్రులఁబస్తు లుంచి తాఁ
గడుపును నింపుకొంచు మనగల్గునెటుల్ జనకుండు? శ్రీహరీ! 34

తా॥ గుడిసెలలోఁ గూడు గుడ్డ లేక ఎముకల గూఁడులై బీదల శరీరములు మిడుకుచున్నవి. నీవో-పీతాంబరములఁ దాల్చి కులుకుచు భోగభాగ్యము లనుభవించఁ దగునా? స్వామీ! తండ్రి యైనవాడు కొడుకు లుపవాసముతో నుండఁగాఁ గడుపు నిండుగా భోజనమొనర్పఁ గల్గునా, స్వామీ శ్రీహరీ!

కఱవులు కాటకాలు పడి కర్షకుఁడేమొ "దివాల" తీసె యా
దరు వొక యింత లేక జను లందరునున్ గుమిగూడి రేఁబవల్
హరి! దయఁ జూడవే యనుచు నార్తిని వేఁడిరి, నీవు లక్ష్మి నే
యురమిడి పట్టిలేని యటు లూరక చూచుచునుందు శ్రీహరీ! 35

తా॥ కఱవు కాటకాలు పడి రైతు దివాలా తీసినాడు. ఆధార మేమియు లేక ప్రజలు అందరును ఒక్కచోటఁ జేరి అహోరాత్రములు "హరీ!" యని ఆర్తితో మొరలిడుచున్నారు. నీవు లక్ష్మిని వక్షస్థలములో నిడుకొని ఏమియు పట్టి లేనట్టులే చూచుచుఁ గూర్చొనెదవా స్వామీ, శ్రీహరీ!

దురితాచారహిరణ్యదానవుఁ బ్రజాద్రోహిన్ విదారింపఁగా
వరప్రహ్లాదకుమారరక్షణకు నీవై వైళమే వచ్చి యీ
ధరణిన్ ధర్మపథానువర్తనులుగా దాసావళిం దిద్ది నీ
వరుగం దీక్ష వహించినాఁడ విపుడేమై పోయెనో! శ్రీహరీ! 36

తా॥ చెడ్డ నడక గల హిరణ్యకశిపువు ప్రజాద్రోహి. వానిని చంపుటకు ఉత్తముఁడైన ప్రహ్లాదకుమారుని రక్షించుటకునై వేగిరముగా వచ్చి ధరణిలో నీ ప్రజల ధర్మమార్గములో నడచుకొను నట్లుగా చేసి పోవుటకై దీక్ష వహించితివి. ఆ దీక్ష నిప్పు డేల వహించ వైతివి ప్రభూ, నరహరీ!

అరయ నరుండె యాత్మకృతమైన స్వకర్మల సౌఖ్యదుఃఖముల్
నిరతము వొందుఁ గాని యట నేనొనరించిన దోషమేమి? యం
చురవుగఁ దప్పుకొందువిది యొప్పునె? రైతు కృషిం బొనర్చినన్
గురియదు వాన నీ కరుణకున్ సరి పాత్ర మికేది? శ్రీహరీ! 37

తా॥ ఈ మానవుఁడే తాను చేసిన తప్పులకు ఒప్పులకు తగిన దుఃఖ సుఖ రూపాలలో ఫలము లనుభవించు చున్నాఁడని ఉపాయముగా నా దోష మిందేమి లేదని తప్పుకొందువు కాని రైతు అన్ని తీరుల కృషి కర్మ చేసి వాన నిమ్మని యడిగి నప్పుడు ఇవ్వవేల? ఇఁక నీ కరుణకుఁ బాత్ర మింకే ముందును స్వామీ, నారసింహా!

సిద్ధముగా లభించు నెఱ చిక్కిన మెక్కుచు వేళ గల్గియున్
బుద్ధివిహీనపక్షిమృగపుంజము పూజ్యునిఁ గొల్వలేవు ని
న్నిద్ధరఁ బొట్ట కూటికయియే దినమెల్ల శ్రమించు మానవుల్
బుద్ధిఁ జెలంగియేని నిను బూర్ణు స్మరించుట లెప్డు? శ్రీహరీ! 38

తా॥ సిద్ధముగా మేఁత చిక్కిన మెక్కుచు వేళ జిక్కియు బుద్ధిలేని పక్షులు మృగాలు పూజ్యుఁడవగు నిను భజింప లేకున్నవి. ఇక నీ మానవుఁడు తాను తన పొట్టకూటి కొఱకే దినమెల్ల కష్టపడుచు బుద్ధిఁగలవాఁడై కూడా పూర్ణుడఁ వైన నిన్ను స్మరించ లేకుండ నున్నవాఁడు. ఎప్పుడు పొట్టకూటికే చింతపడుచు శ్రమపడుచు ఎప్పుడు నిన్ను స్మరించవలెనో తోఁచక యున్న వాఁడు స్వామీ, నారసింహా!

నీరజనాభ! ప్రాణులకు నీవన మోక్షమిడం దలంతు వా
సారసగర్భుడన్ మరుఁడు స్వామి! భవత్ సుతులయ్యు ముక్తిసం
స్కారవిరోధులై సకల సత్వములం దగ సృష్టికార్య సం
చారులుగా నొనరుత్తు రిది చాల విచిత్రము శ్రీనృకేసరీ! 39

తా॥ ఓ కమలనాభా! నీవేమో ప్రాణులకు మోక్షమిత్తఁ దలఁచెదవు. నీ కుమారులైన బ్రహ్మదేవుఁడు మన్మథుఁడు ముక్తికి విరోధులా యనునట్లు సకల ప్రాణులను సృష్టికార్యముల కభిముఖులఁ గావించెదరు. ఇది చాలా విచిత్రముగా నున్నది స్వామీ, నృకేసరీ!

ధనధాన్యమ్ముల నాసఁ జూపుదురు శ్రీధాత్రీ సతుల్ నిత్యమున్
వనితాలోకము వంక కీడ్చు మము దేవా! నీ సుతుం డంగజుం
డును నీవో మరి వారి నేమి యన వెప్డున్ మమ్ము శిక్షింతు మా
ఘన పంకమ్ముల నూడ్చు నీ దుహిత శ్రీగంగమ్మయే శ్రీహరీ! 40

తా॥ శ్రీదేవియు భూదేవియు నీకు భార్యలై కూడా మాకు ధనము నొకరు, ధాన్యము నొకరు ఆస చూపించుచున్నారు. ఓ దేవా, నీ కుమారుఁడైన మన్మథుఁ డున్నాడే-యతఁడు మమ్ముల స్త్రీవ్యామోహము వంక కీడ్చుచున్నాడు. నీవు వీరి నందరిని యేమనవు. మమ్ము శిక్షించెదవు. నీ సుత గంగమ్మయే మా పాపములఁ బాపుచున్నది స్వామీ, నరహరీ!

నన్నుం బోలెడి యజ్ఞు చెంతఁ గదె యన్నా! నీ ప్రభావంబు తా
వన్నె న్వాసిని బొంది వెల్గునది శ్రీవామామనోనాయకా!
కన్నుల్ గానని చీఁకటింటనెకదా! కన్విందుగా సర్వదా
చెన్నారం గలదెందు దీపశిఖయున్ శ్రీనారసింహ ప్రభూ! 41

తా॥ నన్ను బోలు అజ్ఞాని వద్దనే కదా నీ ప్రభావము, పేరు, ప్రతిష్ఠల కెక్కి ప్రకాశించుచున్నది, ఓ లక్ష్మీనాథా! నిజముగా కన్నులు చూడఁజాలని చీకటింటిలోనే కదా! దీపపు జ్యోతి కనులపండువుగా వెలుఁగులీని యొప్పారఁగలదు, శ్రీనారసింహప్రభూ!

పతితులమైన మావలనఁ బ్రజ్వరిలున్ భవదీయ వైభవం
బతులితమై యదెట్లనిన సస్మదఘప్రచయాఖ్యకాష్ఠసం
పతనముతోనె మీదగు ప్రభావమహానల మంతకంతకున్
కుతుకముతో జ్వలించి వెలుఁగుల్ ప్రసరింపఁగఁ జేయుఁ శ్రీహరీ! 42

తా॥ పాపాత్ములమైన మా వద్దనే కదా దేవర వైభవ మంతయు సాటి లేనిదై ప్రకాశించును! అదెట్లందువా, స్వామీ! మా పాపము లనెడి కట్టెలు పడు చున్ననే కదా తమరిదగు ప్రభావ మనెడి యగ్నిహోత్రము ఉత్సాహముతో ఇంక నంతకంతకు మంట మండి వెలుఁగుల విరజిమ్మఁ గలదు స్వామీ, శ్రీహరీ

చిల్లర దైవముల్ వసుధఁ జిన్నని దీపములట్టు లొక్కఁడే
ఇల్లు వెలుంగఁ జేయు నిల నెంత మహోజ్వల దీపమైననున్
బెల్లుగ వాడ వెల్గిడును విశ్వమునే వెలిఁగించు సూర్యు న
ట్లెల్ల ప్రపంచముల్ సతత మీవు వెలుంగఁగ జేతు శ్రీహరీ! 43

తా॥ చిల్లర దైవములు చిన్నని దీపముల వలె ఒక్కొక్క యింటి నొక్కొక్కటి ప్రకాశింపఁ జేయఁగలదు. ఎంతటి ఉజ్వలమైన దీపమైన ఒక వాడను వెల్గించఁ గలదేమో కాని నీవో-సూర్యునివలె విశ్వము నంతటిని లోపల వెలుపల ప్రకాశింపఁ జేయఁగలవు స్వామీ, నరహరీ!

గురువులఁ గాంచి భక్తిని నకుంఠితసేవ నొనర్చు వారికే
మరి మరి హెచ్చు జ్ఞాననిధి మక్కువ తోడుత నిత్యశ్రద్ధయై
సురభికి మేఁత నెక్కువగఁ జొప్పడ వేసిన గోపునింటనే
పెరుగుఁను పాఁడి ధేను విది పెట్టుము నా కనునే? నృకేసరీ! 44

తా॥ గురువులఁ గని అమోఘమైన భక్తితో సేవ జేసెడి వారికే మరి మరీ జ్ఞానధనము హెచ్చగుచుండును. ప్రేమ శ్రద్ధలతో నిత్యము ఆవుకు మేఁత నిడుచో ఆ గొల్ల నింటిలో పాలు పెరుగు వృద్ధియగును. మెండైన మేఁత వేసిననే కాని గోవు తాను నాకిది పెట్టుమని యడుగునా? అట్లే ఆచార్యు లనుచు నెరుఁగ వలయును గదా నృకేసరీ!

శివుఁడవు నీవె తద్విధిని జిన్మయబ్రహ్మము నీవె, యట్లె మా
ధవుఁడవు నీవెకావె యవతారము లన్నియు నీవె యెట్లనన్
వివిధ ప్రభుత్వ శాఖలకు వేరుగ నుంద్రధికారు లెల్లరున్
దవిలి ప్రధానిదౌ దొరతనమ్మది సర్వము తానెయౌ హరీ! 45

తా॥ శివుఁడవును అట్లే చిద్వికారరూపివగుబ్రహ్మవు మరియు మాధవుఁడు నగు విష్ణువు నీవే. అవతారము లన్నియు నీవే. అదెట్లందువా స్వామీ!. వేరు వేరు ప్రభుత్వశాఖలకు వేరువేరుగా అధికారులు చిన్న పెద్దయని యున్నను సర్వప్రభుత్వమునకుండు అధికారము దొరతనము అంతయు ప్రధానిదే కదా స్వామీ, నారసింహా!

అన్నియు నావి నావి యను నాతనికిం గదె దాని వీడఁగాఁ
దెన్నగు సాంప్రదాయికయతిత్వము కావలెఁ గానఁ బోవలెన్
ఎన్నగ విశ్వమంతయును నీ భువి వెల్గెడి సర్వవస్తువుల్
వెన్నిధు లెల్ల నీవ యను పేదకు దాసునకేల? శ్రీహరీ! 46

తా॥ అన్ని వస్తువాహనాదికములు నావే యను అతనికి కదా వాని నన్నిటిని విడనాడుటకు సంప్రదాయపూర్వకముగా సన్న్యాసము దీసికొను నవసరము గలదు కానలలో నుండుటకు పోవలెను. కాని ఈ ప్రపంచములో నున్న సకల వస్తువులు ధనము లెల్లయు నీవే అనుకొను పేదవాఁడగు ఈ దాసునకు సన్న్యాసము స్వీకరించు పనియేల స్వామీ, శ్రీహరీ!

అరయఁగ నర్థకామముల నైహిక భోగసుఖానుభూతి, న
స్థిరగతిఁ జూరఁగొంటకయి తీరిక లేక శ్రమింతుఁ గాని నే
నిరుపమధర్మమోక్షరతి నీ పదసేవన సౌఖ్యసంపదల్
చిరగతి నొందు నం చెరిగి చేకొన నే కుమతిన్, నృకేసరీ! 47

తా॥ నిజమును విచారించి చూచినచో అర్థకామము లను పురుషార్థములు ఈ లోకముననే భోగము లిచ్చునవి కావున అస్థిరములైనను వానినే భోగించుటకు తీరికలేకుండా కష్టపడుచుందురు. కాని సాటిలేని ధర్మమోక్షపురుషార్థములచే శాశ్వతమగు నీ పాదసేవానందము లభించునం చెరిఁగియు నా వంటి కుమతులు గ్రహించి లభింపఁజేసికొనరు కదా స్వామీ, నృకేసరీ!

భయదభవార్ణవోదితవిపత్కర మోహ మహోర్మిఁ దాఁటి నిం
ద్రియ విషయోపభోగముల దీనత నాశ్రయణ మ్మొనర్చితిన్
నయచరితా! వృకమ్ముఁ గని నన్నిది చంపు నటంచు వ్యాధునా
శ్రయణ మొనర్చు మేషమటుల న్మరులొందితి శ్రీనృకేసరి! 48

తా॥ భయంకర మైనదియు, ఆపదలకు నిలయమైనదియు నైన మోహ మనెడి అలలఁ గూడు నదిని దాఁటుటకునై ఇంద్రియములకు విషయములగు శబ్దము-స్పర్శము-రూపము-రసము-గంధములను భోగములను దైన్యముతో నాశ్రయించితిని. నీతికరమైన చరితముఁ గలవాఁడా! మేఁక తోడేలును గని భయపడి కటికవాని శరణుఁగొని ఆశ్రయించి నట్లు మోహము నందితిని నృకేసరీ!

నిగమములేని ని న్నుడువ నేరము మేమని చెప్ప నింక నో
గగనశరీర! యల్పమగు జ్ఞానముతో నిను గాంచ నేర్తునే
సుగమముగా నటంచు మది శోకిలనేటికి? మిన్కు లీను న
ధ్వగు నికరస్థదీపశిఖ తా పథ మంతయు జూపదే! హరీ! 49

తా॥ వేదములు కూడ నిన్ను చెప్పలేమని ఘోషింపఁగా ఓ మేఘశరీరా! స్వల్పజ్ఞానముతో నిన్ను జూచుటకు నైనా చేతనగునా? యని నేను శోకించ వలసిన పనియేమి? నా స్వల్పజ్ఞానము దారి నడచువాని మినుకులీను దీపము సన్ననిదైనను గూడా గమ్యముఁ జేర్చు వరకు వెంటనుండి దారిఁ జూపలేదా, శ్రీహరీ!

అమరిక జ్ఞానకర్మములు నట్టిటు పక్షములై తనర్పఁగన్
గ్రమగతి శాస్త్రషట్క మది కాళ్ళునై వెలుఁగొంద పక్షసం
భ్రమణసుజాతనాద మది భవ్యచతుశ్శ్రుతివాదమై చనన్
రమణ మొనర్చు భక్తభ్రమరమ్ము త్వదంఘ్రిసుమమ్ములన్ హరీ! 50

తా॥ జ్ఞానకర్మములు రెండు రెక్కలు గాఁగా, క్రమముగా ఆరు శాస్త్రములు ఆరు కాళులు కాఁగా, పక్షముల కదలిక వలన బుట్టు నాదము నాలుగు శ్రుతుల వాదము కాఁగా, భక్తుఁడను (షట్పదము) తుమ్మెద నీ దివ్య పాదారవిందములపై వ్రాలి మకరందమును గ్రోలుచు నాడుచుండును గదా శ్రీహరీ!

అరయ పరస్వరూప మది యంబుదసంభృతనీరమై మనున్,
పరవిని "వ్యూహ"రూప మది సంద్రమున న్దుండుఁ జెలంగు పాది, యు
వ్వరుస నదీజలంబువలె "వైభవ"రూపము కూపనీరమం
తరుదితమూర్తి, యర్చనగతమ్మగు రూపు కరాంబువుల్ హరీ! 51

తా॥ పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారము లనెడి మీ స్వరూపములలో పరస్వరూప మనగా వైకుంఠములోని రూపము మేఘములోని నీరువలె నుందనిది. వ్యూహ మనఁగా పాలసముద్రములో పడుకొనియున్న మీ రూపము సముద్రములోని నీరువంటిది. విభవావతారము లనఁగా రామకృష్ణావతారాది రూపములు బావినీరు వంటివి. దేవాలయములలోని అర్చాగత రూపము చేతిలో నున్న నీరు వలె సులభముకదా స్వామీ, నరసింహా!

ఘనమోహాంధతమస్సమావృతి, వివేకం బీగు నా స్వాంత మం
దున జృంభించి కలంచు దుస్సహమహాదోషాకృతిక్షాళనం
బొనరింపం బగటాను మిత్రనిభులై పోరాడువారౌటచే
నను నిందించెడివారె నాకు హితులేనాడున్ నృసింహప్రభూ! 52

తా॥ గొప్ప మోహాంధకారము నన్ను చుట్టుకొనుటవలన వివేకము నశించి నా హృదయములో విజృంభించి నన్ను కలఁత పెట్టుచు సహించరాని ఏ దోషము (రాత్రి) గలదో దాని స్వరూపమును కడిగి వేయుటకు పగలు (దినము) బూని మిత్ర (సూర్య) సదృశులై పోరాడువారౌట నా శత్రురూప మిత్రులే నాకు హితులు స్వామీ, శ్రీహరీ!

ఈ మెయి పానపాత్ర వివిధేంద్రియ సంగతసౌఖ్యజాలమో
స్వామి! మనోజ్ఞమౌ మధురసమ్ము వినశ్వరపుత్రమిత్రులున్
కామిని కాంచనమ్ములనఁగా భ్రమఁ గొల్పు వివేకహీన మి
థ్యామమతల్ "నిషా" యయి వృధా పతితున్ననుఁ జేసె శ్రీహరీ! 53

తా॥ ఈ శరీరమే పానపాత్ర. ఇంద్రియసుఖములే మనోజ్ఞమైన మదిర (కల్లు). నశించునట్టి పుత్రమిత్రాదులు, కాసులు కాంతలు అంటె భ్రమఁగొల్పే వ్యర్థమైన మమతలే ''నిషా'' స్వరూపములు. ఇట్టి మదిరతో వచ్చు ఈ మైకము నన్ను పట్టి అధఃపతితుని అనఁగా క్రిందఁబడినవానిగాఁ జేసినది ప్రభూ, నారసింహా!

ఈ మదిరా ప్రమత్తతల నేర్పడు స్వల్పసుఖానుభూతినే
యీ మహి శాశ్వతం బనుచు నెంతును దెల్వఁగ లేను నన్ను నే
నా మనికిన్ భ్రమించుచును నవ్వుదు నేడ్తును నాకు నేనె నా
స్వామివి యైన నిన్దెలియఁ జాలుదు నెట్టులు శ్రీనృకేసరీ! 54

తా॥ ఈ"కల్లు" "నిషా"చే ఏర్పడు స్వల్పసుఖముల అనుభవమునే ఈ ప్రపంచములో శాశ్వతమని నమ్ముకొనుచు ఆ మత్తతలో నన్ను నేనే అనఁగా స్వస్వరూపమునే తెలిసికొనలేక భ్రమగొని నాలో నేనే నవ్వుకొనుచు అట్లే ఏడ్చుచుందును. ఇంక నా స్వామివైన నిన్నెట్లు తెలిసికొనఁగలను, నరహరీ!

కల్లల కిల్లు మోసముల గంప దురాశల పుట్టి ఈర్ష్యకుం
దల్లి ప్రలోభమోహమదదంభగుణాదుల కాలవాలమున్
క్షుల్లకభావదుర్వ్యసనకోటికి నంగడి సంత పాపపున్
ముల్లియయైన నాకలుషపున్ మది నెట్లు వసింతొ శ్రీహరీ! 55

తా॥ నా మనస్సు అబద్ధములకు ఇల్లు, మోసముల గంప, దురాశలకు పుట్ట, ఓర్వలేనితనాలకు తల్లి, లోభమోహమదదంభగుణాలకు పాదు, అల్ప భావములకు దుష్టవ్యసనములకు అంగడి సంత, పాపములకు ముల్లె యైనది. ఈ పాప హృదయములో నీ వెట్లు వసించుచున్నావో నా స్వామీ, శ్రీహరీ!

నాదగు కోడి కూయని వినా తెలవారు నెటంచు వీతమ
ర్యాద యొకర్తు గ్రుడ్డి ముసలవ్వ రవిం బెదరించినట్టు లీ
మేదిని నేను లేమి నిజమిత్రకళత్రసుపుత్రపౌత్రభృ
త్యాదుల సాక దిక్కెవరయా? యని యేడ్చు నరుం డిలన్ హరీ? 56

తా॥ ఒక కోడిని పోగొట్టుకొనిన ముసలవ్వ సూర్యునిపై అలిగి ప్రతి దినము నా కోడి కూయుట చేతనే తెల్లవారు చున్నది. ఈనాడు నా కోడి కూయని దెట్లు తెలవారునో చూతునంచు సూర్యుని బెదరించినట్లు ఈ ప్రపంచ ముపై నేను లేనిది నా మిత్రులకు భార్యకు పుత్రులకు మనుమలకు సేవకులకు దిక్కెవరు గలరు, వీరి నెవరు సాక గలరని యేడ్చెడి నా అహంకారమును పోఁగొట్టు తండ్రీ, నారసింహా!

మాయాసూనకళత్రమిత్రసుఖసంపన్మందిరారామముల్
కాయాఖ్యాయికపంజరాంగణవిహంగంబైన యీ హంస ము
క్ష్మోయంచున్ దివి లేచి పోవు వరకే చూపట్టు స్వప్నాలు నన్
బాయం జాలవు నీవ దేవ! నిరతాపద్బాంధవా! శ్రీహరీ! 57

తా॥ మాయచే ఏర్పడు కుమారుఁడు భార్య స్నేహితుఁడు సుఖసంపదలు ఇండ్లు ఉద్యానవనములు మొదలగునవి దేహమనెడి ఈ పంజరము మధ్యలో నున్న పక్షి యగు ఈ హంస (శ్వాస) ఉశ్మోయని ఆకాశమార్గములో ఎగిరిపోవు వరకే కనఁబడెడి కలలు. ఇవన్ని నన్ను విడుచునవే. నన్ను ఎడఁబాయక ఉండువాఁడవు నీవే ఆపద్బాంధవా, ఓ శ్రీపతీ, శ్రీహరీ!

కాకపికస్వనాంతరముఁ గావలెనే బధిరాగ్రగణ్యు క
స్తోకమణిప్రకాశమున క్షుల్లకకాచములోని భేదముల్
చీఁకున కేల? ఘోరభవసింధుముఖాంతరవర్తి కెయ్యెడన్
లౌకికపారమార్థిక విలక్షణలక్ష్యములేల? శ్రీహరీ! 58

తా॥ కాకి, కోకిలల కూఁతలలోఁ గల భేదముల, మంచిచెడ్డల తారతమ్యము చెవిటివానికేల? అట్లే గొప్ప రత్నమునకు మరియు గాజు పెంకునకు మధ్యఁగల విలువల భేదము, ప్రకాశముల భేదము గ్రుడ్డివాని కెందులకు? భయంకరమగు సంసార సముద్రములో మునిఁగియుండువానికి ఇహలోక - పరలోకములకుఁ గల తారతమ్యములు, వాటి లక్ష్యము లెందులకు శ్రీ నృసింహా!

కదనార్థమ్ము కరమ్ము నెత్తికొని చక్కన్ వచ్చు విధ్వంసకృ
న్మదమాతంగబలాన్వితుం డొకఁడు యుష్మత్పాదపంకేరుహో
ద్యదితస్వాదుమరందమంజురసపీయూషమ్ములం గ్రోలు ష
ట్పద మొక్కండనిఁ జంపఁ బెంప నిటురూపం బొందితే శ్రీహరీ! 59

తా॥ యుద్ధము కొఱకై చేతులెత్తుకొని పైకి వచ్చు మదించిన ఏనుఁగు ఒకఁడు, మీయొక్క పాదకమలములలోని మరందరసములను గ్రోలుచున్న తుమ్మెద ఒక్కఁడని పైకివచ్చు మదగజమును జంప సింహాకారమును, క్రింద పాదతీర్థముఁ గ్రోలువాఁడు ఉత్తముఁడైన నరుఁడని క్రిందిరూపము నరుని ఆకారములోనుంచి ప్రహ్లాదుని రక్షించుట ఒకేసారి జరుగవలెనని ఈ నరసింహాకారములను ఒకే రూపములో పొదిఁగివచ్చితివా ప్రభూ, శ్రీహరీ!

గురుతతికిన్ బరాత్పరునకున్ దలవంచి నమస్కరించుచో
సరియగు దారిఁ గానఁబడు శౌరిపదద్వయి చిక్కునెందు ని
న్నరున కటంచునున్ దనుజనందను వృత్తము చాటు నేత్రముల్
శిరమున కెక్కినం బడి నశించుననుం బితృవృత్తి శ్రీహరీ! 60

తా॥ గురువులకు పరమాత్మునకు తలవంచి నమస్కారము చేయు చున్నపుడు సరియైన మార్గము కనఁబడును. మరియు హరి పాదయుగము చిక్కఁగలదని కుమారుని నడక చెప్పుచున్నది. కనులు తలకెక్కి పైకిఁ జూచువాడు బాట గనఁబడక తాను పడి నశించఁగలడని తండ్రి యగు హిరణ్యకశిపు నడక చెప్పును హరీ!

మేను పసిండి గిండి స్తనమేచక చూచుకముల్ మసారముల్
మానితమందహాసములు మౌక్తికముల్ తరళేక్షణమ్ములో
సానలఁ దీరు వజ్రములు చక్కని మోవియె కెంపుదీవియై
కానఁగ నొటఁ గాంచనమృగం బిలఁ గాంతయె కాదె? శ్రీహరీ! 61

తా॥ శరీరము బంగారు కలశము. చను మొనలు ఇంద్ర నీలములు. చక్కని చిఱునవ్వులు ముత్తెములు, చంచలమైన చూపులవి సాన బట్టిన వజ్రములు, చక్కని క్రింది పెదవి కెంపులై కనబడుచుండుటచే బంగారు లేడి మఱెవ్వరో కాక పై లక్షణములు గల యువతి యగు స్త్రీయే యని తేలిపోయినది శ్రీహరీ!

హరిణచలేక్షణమ్ములను నారసి మోహము నంది, యా నిశా
చర వశమయ్యెనాఁడు దగు జానకియే యిఁక నే సువర్ణ సుం
దరి హరిణేక్షణమ్ములకు దాసుఁడ నౌచు దశేంద్రియాసురీ
పరవశ సంసృతిన్ బ్రకృతి బద్ధుఁడనై మనుటెంత? శ్రీహరీ! 62

తా॥ ఇట్టి బంగారు లేడి చంచలములైన చూపులకు అడదైనట్టి జానకియే కరఁగి ఆసురీప్రకృతి వశమైనది. ఇఁక నావంటి పురుషుఁడు బంగారు వంటి సుందరి చంచలములైన చూపులకు దాసుఁడై దశేంద్రియము లనెడు దశ వదనుం డను రాక్షసు వశమై సంసార మనెడి లంకలో బద్ధుఁడనై యుంట ఎంతపని, శ్రీహరీ!

మాయాసూనకళత్రమిత్రసుఖసంపన్మందిరారామముల్
కాయాఖ్యాయికపంజరాంగణవిహంగంబైన యీ హంస ము
శ్శోయించున్ దివి లేచి పోవు వరకే చూపట్టు స్వప్నాలు నన్
బాయం జాలవు నీవ దేవ! నిరతాపద్బాంధవా! శ్రీహరీ! 57

తా॥ మాయచే ఏర్పడు కుమారుఁడు భార్య స్నేహితుఁడు సుఖసంపదలు ఇండ్లు ఉద్యానవనములు మొదలగునవి దేహమనెడి ఈ పంజరము మధ్యలో నున్న పక్షి యగు ఈ హంస (శ్వాస) ఉశ్శోయని ఆకాశమార్గములో ఎగిరిపోవు వరకే కనఁబడెడి కలలు. ఇవన్ని నన్ను విడుచునవే. నన్ను ఎడఁబాయక ఉండువాఁడవు నీవే ఆపద్బాంధవా, ఓ శ్రీపతీ, శ్రీహరీ!

కాకపికస్వనాంతరముఁ గావలెనే బధిరాగ్రగణ్యు క
స్తోకమణిప్రకాశమున క్షుల్లకకాచములోని భేదముల్
చీఁకున కేల? ఘోరభవసింధుముఖాంతరవర్తి కెయ్యెడన్
లౌకికపారమార్థిక విలక్షణలక్ష్యములేల? శ్రీహరీ! 58

తా॥ కాకి, కోకిలల కూఁతలలోఁ గల భేదముల, మంచిచెడ్డల తారతమ్యము చెవిటివానికేల? అట్లే గొప్ప రత్నమునకు మరియు గాజుపెంకునకు మధ్యఁగల విలువల భేదము, ప్రకాశముల భేదము గ్రుడ్డివాని కెందులకు? భయంకరమగు సంసార సముద్రములో మునిఁగియుండువానికి ఇహలోక - పరలోకములకుఁ గల తారతమ్యములు, వాటి లక్ష్యము లెందులకు శ్రీ నృసింహా!

కదనార్థమ్ము కరమ్ము నెత్తికొని చక్కన్ వచ్చు విధ్వంసకృ
న్మదమాతంగబలాన్వితుం డొకఁడు యుష్మత్పాదపంకేరుహో
ద్భ్యదితస్వాదుమరందమంజురసపీయూషమ్ములం గ్రోలు ష
ట్పద మొక్కం డనిఁ జంపఁ బెంప నిటురూపం బొందితే శ్రీహరీ! 59

తా॥ యుద్ధము కొఱకై చేతులెత్తుకొని పైకి వచ్చు మదించిన ఏనుఁగు ఒకఁడు, మీయొక్క పాదకమలములలోని మరందరసములను గ్రోలుచున్న తుమ్మెద ఒక్కఁడని పైకివచ్చు మదగజమును జంప సింహాకారమును, క్రింద పాదతీర్థముఁ గ్రోలువాఁడు ఉత్తముఁడైన నరుఁడని క్రిందిరూపము నరుని ఆకారములోనుంచి ప్రహ్లాదుని రక్షించుట ఒకేసారి జరుగవలెనని ఈ నరసింహాకారములను ఒకే రూపములో పొదిఁగివచ్చితివా ప్రభూ, శ్రీహరీ!

గురుతతికిన్ బరాత్పరునకున్ దలవంచి నమస్కరించుచో
సరియగు దారిఁ గానఁబడు శౌరిపదద్వయి చిక్కునెందు ని
న్నరున కటంచునున్ దనుజనందను వృత్తము చాటు నేత్రముల్
శిరమున కెక్కినం బడి నశించుననుం బితృవృత్తి శ్రీహరీ! 60

తా॥ గురువులకు పరమాత్మునకు తలవంచి నమస్కారము చేయు చున్నపుడు సరియైన మార్గము కనఁబడును. మరియు హరి పాదయుగము చిక్కఁగలదని కుమారుని నడక చెప్పుచున్నది. కనులు తలకెక్కి పైకిఁ జూచు వాడు బాట గనఁబడక తాను పడి నశించఁగలడని తండ్రి యగు హిరణ్యకశిపు నడక చెప్పును హరీ!

మేను పసిండి గిండి స్తనమేచక చూచుకముల్ మసారముల్
మానితమందహాసములు మౌక్తికముల్ తరళేక్షణమ్ములో
సానలఁ దీరు వజ్రములు చక్కని మోవియె కెంపుదీవియై
కానఁగ నౌటఁ గాంచనమృగం బిలఁ గాంతయె కాదె? శ్రీహరీ! 61

తా॥ శరీరము బంగారు కలశము. చనుమొనలు ఇంద్రనీలములు. చక్కని చిరునవ్వులు ముత్తెములు, చంచలమైన చూపులవి సాన బట్టిన వజ్ర ములు, చక్కని క్రింది పెదవి కెంపులై కనబడుచుండుటచే బంగారు లేడి మరెవ్వరో కాక పై లక్షణములు గల యువతి యగు స్త్రీయే యని తెలిపోయినది శ్రీహరీ!

హరిణచలేక్షణమ్ములను నారసి మోహము నంది, యా నిశా
చర వశమయ్యెనాఁడు దగు జానకియే యిఁక నే సువర్ణ సుం
దరి హరిణేక్షణమ్ములకు దాసుఁడ నౌచు దశేంద్రియాసురీ
పరవశ సంసృతిన్ ప్రకృతి బద్ధుఁడనై మనుటెంత? శ్రీహరీ! 62

తా॥ ఇట్టి బంగారు లేడి చంచలములైన చూపులకు ఆదర్శనట్టి జానకియే కరఁగి ఆసురీప్రకృతి వశమైనది. ఇఁక నావంటి పురుషుఁడు బంగారు వంటి సుందరి చంచలములైన చూపులకు దాసుఁడై దశేంద్రియము లనెడు దశ వదనుం డను రాక్షసు వశమై సంసార మనెడి లంకలో బద్ధుఁడనై యుంట ఎంతపని, శ్రీహరీ!

సముచితభావనమ్ము గల సత్యవిచారము సాధుచేష్టిత
క్రమమును బాసి నా బ్రదుకు గందరగోళము గాఁగ మ్రోగుచున్
సమశ్రుతి లేని వీణ లయసంగతి వీడు మృదంగవైఖరిన్
శ్రమఁ గలిగించు నీ చెవికి సామసునాదవినోద! శ్రీహరీ! 63

తా॥ తగిన భావములు గల సత్యమైన విచారములు గల మంచి నడవడిని పాసి నా బ్రదుకు గందరగోళముగా అనగా సరియైన శ్రుతి (వేద విధి)కి చెందక యుండు వీణ వలె లయగతి లేని మృదంగ నాదమై నీ చెవికి బాధ గలిగించు చుండెను. నీవో- చక్కని సామగాన నాదములో రమించువాఁడవు శ్రీహరీ!

స్తంభము నీవ యంటి విఁక సర్వము నీద యటంచుఁ దెల్పుచున్
స్తంభము నీవ యీ భువనసౌధము నంతటికిన్ బరాత్పరా!
స్తంభితసద్విచారుఁడయి సత్వరకోపతమోంధకారుఁడై
స్తంభము దన్నె స్వీయగృహసర్వము నాశము నొంద శ్రీహరీ! 64

తా॥ స్తంభమును నేనే, ఈ సర్వమును నేనే యని ప్రహ్లాద ముఖము నుండి బలికించితివి. నిజముగా నీ విశ్వ మను గృహమునకు ఆధారమగు స్తంభ మవు నీవే. హిరణ్య కశిపువు ఆగిపోయిన సద్విచారము గలవాఁడై తీవ్రమగు కోప మనెడి చీఁకటిలో నున్నవాఁడై స్తంభమును తన్ని తన యింటిని నాశము చేసికొనినాఁడు శ్రీహరీ!

చరణము లాశ్రయించి తనుజాతుఁడు తాను దరించె నజ్ఞుఁడై
చరణహతిన్ ద్రిలోకగృహశంకునిభంబగు నీ మహాకృతిన్
మరిమరి తన్నె తత్పిత యమాంతము కూలితి వానిపైననే
సరసిజనేత్ర! యా ఖలుఁడు సత్వరనాశము నొంద శ్రీహరీ! 65

తా॥ మీ పాదము లాశ్రయించి కుమారుఁడగు ప్రహ్లాదుఁడు తాను తరించి నాడు ముల్లోకము లనే ఇంటికి శంకువుగుంజవై మూలాధారముగా నున్న నీ మహాకారమును తన చరణముతో తండ్రియగు హిరణ్య కశిపుఁడు మరిమరి తన్నినాఁడు. తన్నుచున్న వానిపైనే స్తంభముతోఁబాటు ఇల్లువై కూలిపడి వానిని వేగముగా నశింపఁజేసితివి ఓ శ్రీహరీ!

త్వరగఁ గవోష్ణరక్తములఁ దానము లాడఁగఁజేసి తన్మహో
దరలసదంత్రజాలముల దండలుగా నిడి, కంఠసీమ భా
స్వర గతిఁ బ్రాణవాయువులఁ జామరపాళిగ వీచి యాత్మనే
పరమనివేదనం బిడిన భక్తుని ముక్తుని జేతు శ్రీహరీ! 66

తా॥ వెచ్చని నెత్తుటితో స్నాన మాడించి, ఉదరములోని ప్రేవుల దండలుగా మెడలో వేసి, ప్రాణవాయువుల నన్నింటిని చామరములుగాఁ జేసి విసరి, ఆత్మనే నైవేద్యముగా నిడిన వైరభక్తితో నిన్నర్చించిన భక్తుని గూడ ముక్తుని జేతువు గదా శ్రీహరీ!

భూమియె బొంగరమ్ముగను పొల్పెసలారెడి వాయుసంగతుల్
స్వామిరొ! జాలెత్రాడుగ నెసంగను ద్రిప్పుచు నాడుచుందువే
వ్యోమగతిం జరించెడి మహోడుగణంబులు గోలికాయలై
భ్రామితమై చెలంగఁగను బాలుని లీలలఁదేలుదే హరీ! 67

తా॥ ఈ భూగోళము నొక బొంగరముగా దాని చుట్టును ఒప్పారెడి వాయువుల జాలెత్రాడుగాఁ కట్టి త్రిప్పుచు నాడుకొందువా స్వామీ! ఆకాశములో చరించు చుక్కల నన్నింటిని గోలికాయలుగాఁ జేసి చంటి పిల్లవాని వలె ఆడుకొనుచుంటివా శ్రీహరీ!

రాగము లెందునున్ లయపరమ్ముగుచున్ క్షణ ముండి యేగు నీ
త్యాగమె సృష్టిసంస్థితిలయమ్ముల నుండి విముక్తిఁ గూర్చునం
చేగతి మానసమ్మునకు నెన్నడు బోధపడంగ నోపునో!
స్వాగత మెన్నడిచ్చెదమొ శాశ్వతసత్యపదంబు కోహరీ! 68

తా॥ రాగము లయతోఁ గూడి (సంగీతములో) నట్లు రాగములు ప్రేమలు గూడా క్షణముండి యేగునవికదా! కావున ఆ రాగము కంటె ఈ త్యాగమే నీ సృష్టిస్థితిలయములనుండి మమ్ము విడిపించి ముక్తి నిచ్చును. ఇట్టి పరిస్థితి నాకెప్పుడు బోధపడుతుంది? ఆ పరిస్థితికి ఆ సత్యపదమగు వైకుంఠమునకు ఎన్నడు స్వాగతమివ్వ గలమో శ్రీహరీ!

జ్ఞానాజ్ఞానములే యహర్నిశలుగా క్ష్మాఖండమే నాట్యమున్
బూనం జాలెడి రంగభూమి యగుచున్ బొల్వారఁగా నాకసం
బే నిద్దమ్మగు మేలుకట్టుగను దీపించంగ చెల్వొ ఋతు
స్థానంబుల్ తెర లొప్ప జీవులిలఁ బాత్రల్ గాదె! నీకో హరీ! 69

తా॥ ఓ శ్రీహరీ! ఈ నీ ప్రపంచ మను నాటకమునకు మా జ్ఞానము మా అజ్ఞానము అనునవే దినము రాత్రి కాఁగా భూమియే నాట్యరంగభూమి కాఁగా ఆకాశమే మీఁదఁ గట్టు మేల్కట్టు కాఁగా ఆరు ఋతువులు తెరలుకాఁగా ఈ జీవు లందు నటించు పాత్రలై యొప్పుచుందురు గాదా శ్రీహరీ!

గీతాజ్ఞానము వేదసారమగుచున్ గీపెట్టఁగా నీ శ్రుతుల్
స్ఫీతంబౌ మురళీవినోద మది తీవిన్ సామవేదంబుగాఁ
జేతోదీపకకర్మ మార్గమయి భాసింపన్ యజుర్వేదతన్
బ్రాతిన్ ఋక్కులు భక్తిమార్గ మగుచున్ భాసింపవే శ్రీహరీ! 70

తా॥ నీవు వేదసారముగా గీతాజ్ఞానమును జేయఁగా నీయందు మూడు వేదంబులుఁ గన్పట్టుచున్నవి. చక్కని నీ మురళీనాదమే సామవేదముగా నొప్పారినది. నీ గీత యందలి కర్మషట్కమే యజుర్వేదమైనది. ఆ గీత యందలిదే భక్తి షట్కము ఋగ్వేదమై భాసిలుచున్నది శ్రీహరీ!

సరస కళాత్రయం బనిన స్వామి! భవద్గురురూపమే కదే!
మురళిని గొంచు గానకళమోహనలీల ప్రమోదడోలగన్
'దరికిట తద్ది' యంచు నిజతాండవనృత్యము నాట్యకేళిగన్
పరమపవిత్ర కావ్యకళ పావన "గీత"గ వెల్గు శ్రీహరీ! 71

తా॥ ఓ శ్రీహరీ! సరసములగు కవితాగాననాట్యము లను మూడు కళలు కూడా నీ రూపములే కదా! మురళిని గైకొని జగన్మోహనముగాఁ బాడినావే-అది గానకళగా రూపొందినది. అట్లే 'తరికిట తద్ది'యను తాండవకేళీనృత్యమే నాట్యకళగా రూపొందినది. అట్లే నీ పరమ పవిత్రమైన గీతారచనమే బ్రహ్మాండమైన కావ్యకళగా రూపు రేఖలు దిద్దుకొన్నది.

మెప్పగు నగ్నికీలలవి మిన్నెగఁ బ్రాకుచు నూర్ధ్వగాములై
కప్పిన చిమ్మ చీఁకటులఁ గాల్చి వెలుంగిడు భూతకోటికిన్
అప్పగిదిన్ మహోన్నతమహాధ్వములం బయనించి, జ్ఞానమే
చప్పున సంశయాంధ్యమును సాంగము రూపరఁజేయు శ్రీహరీ! 72

తా॥ మెప్పైన అగ్గిమంటలు మింటిపై కెగఁబ్రాకుచు పైకేగుచున్నవియై అంతటఁ గ్రమ్మిన చిమ్మ చీఁకట్లఁ గాల్చివైచుచు భూతకోటికి వెలుగులిడుచున్నట్లే ఉన్నతమైన మార్గములఁ చరించు జ్ఞానమే సంశయమనే చీకట్ల సత్వరముగా సమూలముగా నశింపఁజేయునుగదా శ్రీహరీ!

నీ పద మాశ్రయించిన మనీషి యతం డెవఁడైన నేమి? యో
శ్రీపతి! నీవయై బుధులచే వినుతిం గొని పూజ్యుఁ డౌను, గం
గాపగలోన వచ్చిపడు కాల్వలవెక్కడివేని, నేవియేన్
బాపవిదారకంబులయి పావనగాంగము లౌను శ్రీహరీ! 73

తా॥ నీ పాదము ల నాశ్రయించిన బుద్ధిమంతుఁ డతఁ డెవ్వడైనను ఓ శ్రీనాథా, నీవేయై పూజ్యుఁడై విజ్ఞులచే వినుతింపఁ బడును. గంగానదిలో వచ్చి పడు కాల్వ లెక్కడివైనను ఏమియైనను పాపములను ఛేదించుచు పావనగంగోదకములే యౌను గదా!

వివిధసుమమ్ములం బొదిగి విందిడు హారములోని దారమై
మివుల నుతింపఁగాఁ బడుచు మేదిని జ్ఞానము సర్వభూతముల్,
భువి పరమాత్మరూపులని బోధ నొనర్చును, దాని వీడ గౌ
రదహతిదుర్గతిన్ ధరణి రాలు సుమంబయి వ్రీలు శ్రీహరీ! 74

తా॥ జ్ఞానము తాను అనేక పుష్పములతో నల్లుకొని యున్న హారములోని దారమువలె సర్వభూతములలో నొకే పరమాత్మరూపుఁడున్నాడని అన్నియు పరమాత్మస్వరూపములే యని బోధ నొనర్చుచున్నాఁడు. ఆ జ్ఞానమును విడిచిన హారములోనుండి రాలిన పుష్పము వలె గౌరవ హీనమై కాళులచే త్రొక్కఁబడి నశించును గదా! శ్రీహరీ!

చేతఁ గలట్టి కాసు చనఁ జేడ్పడి యద్ది లభించుఁ దాఁకనున్
చేతమునందు బాధపడు చిత్తము కొందలమంద, కోట్లకున్
గోతములందుఁ గూర్చు ధనకోటులకున్ భువిఁ బాసి యేగుచో
నే తెఱఁ గాత్మ బాధపడు నేమని చెప్పఁగ వచ్చు శ్రీహరీ! 75

తా॥ చేతిలో నుండి ఒక కాసు జారిపడి పోయిన అది లభించుదాఁక వెదకుచు హృదయము బాధపడిపోవునే! ఇఁక కోట్లధనమును గోతములందు నింపి పెట్టికొని దానిని విడిచి తాను పోవుచున్నప్పుడు ఆ యాత్మ పడు బాధ నేమని చెప్పవచ్చును, శ్రీహరీ!

అన్నము లేదటంచు రుజ లాత్మను నొంచు నటంచు, లేమితో
నెన్నియొ కష్టముల్ పడుచు నెంతయు నాశల వంత నొందుచున్
అన్నిటికన్న కష్ట మరయన్ మరణంబని కుందు మూల వి
చ్ఛిన్నముఁగాఁగ "జన్మ" యను చేటు నడంచడు దేహి శ్రీహరీ! 76

తా॥ అన్నము లేదని రోగము లాత్మను బాధపెట్టు చున్నవనియు, దారిద్ర్యభారముతో ఎన్నో కష్టాళి నెదుర్కొనుచు ఆశలు పూర్తి కాకపోవుట వలన వెతపడుచును, ఇన్నిటి కన్న చావు చాలా కష్టమని వాపోవుచు, ఈ దేహి అన్నిటిని మూలము నణఁచు "జన్మ" యనెడి దానిని పోఁగొట్టుకొన లేకున్నాడు శ్రీహరీ!

తను వెట నున్న బాంధవులు దాపున నెందరు నుందురేని యా
మన సెట నుండునో యచట మానవుఁ డుండును గాదె! యట్లె యో
సనకసనందనాదిముని సన్నుత! నా హృదయమ్ము గూడ నీ
ఘన పద సంగతిన్ మనుటఁ గ్రాలనె నీ పదసన్నిధిన్ హరీ! 77

తా॥ తనువు తానెచ్చట నున్నా, దాపున నెందరు బాంధవు లున్నను, మన సెచ్చట నుండునో ఆ మానవుఁడు గూడా తానచ్చటనే యుండును కదా! ఓ సనకసనందనాదిసన్నుతా! అట్లే నా మనస్సు నీ పాదసన్నిధి నున్నపుడు నేనును నీ సన్నిధినే యున్నవాఁడ నగుదును కాదా శ్రీహరీ!

తన మెయి చుట్టు తానయి ప్రదక్షిణముం బొనరించి తిర్గుచున్
తన యెదఁ గోరు గ్రామవరధామముఁ జేరు నదెట్టు? లవ్విధిన్
వనరుహనేత్ర! స్వార్థగతి వందురు మానవుడున్ బరార్థవ
ర్తనమునఁ జిక్కి నీ విమలధామము నేగతి బొందు? శ్రీహరీ! 78

తా॥ తన శరీరము చుట్టు తానే ప్రదక్షిణము చేసికొనుచు తిరుగుచు, తన హృదయములో బోవఁ దలంచిన గ్రామమునకు చేరుకొనునా? అదేరీతిగా, ఓ కమలదళాక్ష! స్వార్థముతోఁ గష్టపడు మానవుఁడు పరార్థపరతతోఁ జిక్కి నీ వైకుంఠధామము జేరునెట్లు శ్రీహరీ!

ఒక్కఁడె యయ్యు సూర్యుఁడు మహోన్నతసత్పథచక్రగామియై
ఎక్కడ జూడ నక్కడనె యిబ్బువిఁ గాంచఁగ నైనయట్లు నీ
వొక్కఁడ వయ్యు నెల్లెడల నుందువు దానవసూను, జ్ఞానస
ద్దృక్కులకున్ మదాంధుఁడయి త్రెళ్ళు సురారి గనండు నిన్ హరీ! 79

తా॥ శ్రీహరీ! సూర్యుఁ డొక్కఁడే యయ్యు మహోన్నత పథములలో సంచరించు చుండినట్లు, నీ వొక్కఁడ వయ్యు ఎక్కడఁ జూడ అక్కడనే దర్శనమును జ్ఞానియగు శ్రీప్రహ్లాదునికి నొసంగితివి. మదాంధుఁడైన హిరణ్యకశిపువు నిన్నుఁ గాంచలేకుండెను.

కౌశికుఁడున్ బరాశరుఁడు కామగులై వచియింత్రు నీతులన్
చేసెడివాఁడె ధర్మములఁ జెప్పుట కర్హుఁ డటంద్రుఁ బాలిశున్
వాసి గలట్టి వైద్యుఁ డొక వ్యాధిని బాధితుఁడైన మాత్రతా
నౌషధమున్ బొనర్చఁగ ననర్హుఁ డితండనఁజెల్లునే? హరీ! 80

తా॥ కౌశికుఁడు (విశ్వామిత్రుఁడు) మరియు పరాశరుడు వీరిద్దరును కామమునకు వశులై గూడ ప్రపంచమునకు నీతుల నుపదేశించెదరు. ఆ నీతుల నాచరించుఁవాడే వానిని ఉపదేశించుట కర్హుడు కదా యని తెలివిమాలినవారు వచింతురు. ప్రఖ్యాతుఁడైన వైద్యు డొక వ్యాధిచే బీడితుడై మరల ఆరోగ్యవంతుడైన పిదప మరొకరికి ఆ వ్యాధి సంక్రమించిన ఆ వ్యాధి కతడు చికిత్స నొనర్ప ననర్హుఁడగునా ఏమి?

అరయ నహమ్మమత్వములె యౌదల వెల్గెడి కుంభయుగ్మమై
వరల మదోరువాసనల వ్యాప్తి యొనర్చుచు ఘోరసంసృతిన్
బరఁగెడి పాపపంకమును బల్మరు నౌదల మోదుకొంచు సం
బరపడు నా యవిద్య యను మత్తగజ మ్మెటు ద్రుంతు? శ్రీహరీ! 81

తా॥ అహంకార మమకారములే కుంభ స్థలములుగా, మదమే మదజల ధారగా ఘోరమైన సంసారమున నొనర్పబడు పాపములు తల మోదుకొనఁబడు చుండగా నుండే నా అజ్ఞాన మనఁబడు మదపుటేనుఁగు నెట్లు సంహరింతువో శ్రీహరీ!

వరప్రహ్లాదముఖాబ్జతుష్టికి దయావర్షంబవై, యద్దె భీ
కరదైత్యోరుగిరీంద్రసంహతిఁ దటిద్ఘాతంబవై యొప్పు సత్
కరుణాక్షీణఘనాకృతిన్ వెలయు నో కంజాయతాక్షా! రమా
వర! నీ డెందము పూలపంజరమొ మేల్ వజ్రాయుధంబో హరీ! 82

తా॥ శ్రేష్ఠుఁడగు ప్రహ్లాదుని ముఖకమలము వికాసము నొందగా దయా వర్షము వైనాఁడవు. అదే సమయములో భయంకరుడైన హిరణ్యకశిపువు అను గొప్ప పర్వత శిఖరమును పడఁగూల్చుటకై పిడుగు పాటువై యొప్పు నశించని కరుణామేఘము వలె నున్న నీ హృదయము పూల పంజరమా? వజ్రమా శ్రీహరీ!

వనవృక్షంబులతోనె సింహమునకున్ వాసస్థలం బేర్పడున్
ఘనహర్యక్షము వృక్షరాజములకున్ గావించు సంరక్షణల్
కన భక్తాళిహృదంతరాళములు వీక న్నీకు నావాసమౌ
ననఘా! భక్తజనావనమ్మటులె నీ కౌన్నత్యదంబౌ హరీ! 83

తా॥ వనములో నుండు వృక్షములతోనే సింహమునకు నివాసము చేకూరును. ఆ సింహమే తాను వసించుట కేర్పడిన వన వృక్షములకు రక్షణ గావించును. అట్లే భక్తుల హృదయములే నీకు నివాసముగా నుండును, ఆ భక్తుల రక్షించుటే నీకు గొప్పదనమును చేకూర్చును శ్రీహరీ!

నిజమగు లోకపాలకుఁడ నేనని మీసము దువ్వు జేఁడు ది
గ్గజముల నే నొకండ నిల గండర గండఁడ నంచు బల్కుచున్
భుజముల నప్పళించు, దన పుట్టుకకున్ మును జచ్చు వెన్కకున్
బ్రజ నెపు డెవ్వఁడోము నని భావన సేయఁడు మూఢుఁడో! హరీ! 84

తా॥ నిజమైన లోకరక్షకుఁడను నేనేనని మీసము దువ్వుచు దిగ్గజాలలో నేనొకఁడనని నేను వీరులలో వీరుఁడ నని జబ్బఁ జరచుచు గర్వించును కాని, తన పుట్టుకకు ముందు తాను చచ్చిన వెన్క ఈ ప్రజలను ఎప్పుడూ ఎవ్వఁడు రక్షించుచున్నాఁడో అని భావించఁ జాలఁడు కదా! ఎంతటి మూఢుఁ డతఁడు శ్రీహరీ!

యాగములం బొనర్చి సుకృతాన్వితులై విలసిల్లు పాండవుల్
భోగము లొందు స్వర్గమును బొందిరి సీమితసౌఖ్యధామమున్
భాగవతప్రదీప్తహరిభవ్యగుణశ్రుతి నా "పరీక్షితుం"
దేఁగె వికుంఠధామమున కేర్పడ బంధవిముక్తి శ్రీహరీ! 85

తా॥ యజ్ఞములు చేసి పుణ్యముల సంపాదించి కీర్తిఁ జెందిన పాండవులు బరిమితసుఖములు గల భోగముల నొసంగు స్వర్గమును మాత్రమే పొందఁగల్గిరి. కాని శ్రీహరిగుణకీర్తన గల భాగవతమును విని పాండవులకు మనుమఁడైన పరీక్షిత్తు బంధవిముక్తి శాశ్వతముగా నిడు వైకుంఠ మేగెను శ్రీహరీ!

జీవన లక్ష్యసిద్ధిఁ గన స్వీయశరీరము సాధనంబుగా
భావమునం దలంచియును బాలిశుఁ డింద్రియ నిగ్రహంబు తా
నేవిధి సేయఁజాలఁ డిది యెట్లు పొసంగును నాశ్వికుండు గ
మ్యావధి యశ్వమున్ స్వవశ మందిడ కూరెటుఁ జేరు? శ్రీహరీ! 86

తా॥ జీవనలక్ష్యము సిద్ధించుటకై తనకు శరీర మొక సాధనమని (పనిముట్టు) తెలిసికొనియు దానిని స్వాధీనములో నుంచుటకు ఇంద్రియనిగ్రహము చేయలేనివాఁడై మూఢుఁడై యీ మానవుఁడు చెడుచున్నాఁడు. గుఱ్ఱము నెక్కిన వాఁడు గుఱ్ఱమును తన స్వాధీనములో నుంచుకొనకున్న తన గమ్యస్థానము నెట్లు చేరుకొనగలఁడు శ్రీహరీ!

కమ్మరివానిదౌ కొలిమిఁ గ్రాలెడి యగ్ని నదెట్లు లోహముల్
నెమ్మదిగాఁ గరంగు నటు నేనును నీదు వియోగవహ్నిలో
నెమ్మి కరంగి పోదు, నను నీ వపుడో భవదీయసేవ కి
ష్టమ్మగు సాధనాకృతి వెసం బొనరించి కొనం దగున్ హరీ! 87

తా॥ కమ్మరివాని కొలిమిలో నున్న యగ్నిలోఁ బడి లోహము లెట్లు నెమ్మదిగా కరఁగునో అట్లే నేను గూడా నీ వియోగాగ్నిలోఁ బడి కరఁగిపోవు చున్నాను. అపుడు నన్ను నీవు నీ యిష్టమగు సాధనముగాఁ చేసికొనఁదగునో శ్రీహరీ!

నీదు మహోగ్రకోపమును నీరజ పద్మరమాలలామ ప్ర
హ్లాదువిలాసలీల వలె నంత్య మొనర్చెను గాదె? శీత గం
గోదక మగ్నికీలలను నోసరిఁ జేసిన యట్లు నట్లె నిం
పొదిగ మా తమ స్సడుప మాతృకటాక్షము చాలదా? హరీ! 88

తా॥ కమలము నందున్న లక్ష్మిదేవి నీ ఉగ్రమగు కోపమును ప్రహ్లాదుని కొక ఆట వలె తన కొక ఆటఁ గాఁగఁ జల్లార్చెను. ఎంతటి అగ్ని మంటల నైనను గంగోదకము చల్లార్చును గదా! అట్లే మా అజ్ఞానాంధకారము నశింపఁ జేయుటకు తల్లి యగు లక్ష్మిదేవి కటాక్షము చాలదా శ్రీహరీ?

కరుణా సాగరుఁ డీవ యంచుఁ గడు విఖ్యాతిప్రభల్ వెల్గె, నా
సురసంహారక శౌర్యవహ్ని యెటు సంశోభించు నంచేల యే
మరయంగా వలె బాడబానలము నా యబ్ధిన్ విరాజిల్లదే
సురసంరక్షణదైత్యశిక్షణ మొనర్చు న్నీ కృతుల్ శ్రీహరీ! 89

తా॥ కరుణాసముద్రుఁడవు నీవే యని చాల ప్రఖ్యాతి వచ్చినది. మరి అసురులఁ చంపివేయు శౌర్యాగ్ని నీలో ఎక్కడిదని మేము విచారించ వలసిన పనిలేదు. సముద్రములో మాత్రము కాల్చునట్టి బడబాగ్ని యుండదా? దుష్టుల శిక్షించుట శిష్టులరక్షించుటలే నీ కార్యములు శ్రీహరీ!

నీ చక్ర ప్రభలంపు నా దరికి నే నిన్ జూడఁగా వెల్గుకై
యాచింతున్ పడి శంఖ నిస్వనములే పంపించు మా నిస్వన
ప్రాచుర్యంబుల నాలకించుచును నీ పజ్జం బ్రవేశింపఁగా
నై చేతున్ గృషి లేమి మాదు గతి నీ యర్చాకృతే శ్రీహరీ! 90

తా॥ నా వద్దకు నీ చక్రపు కాంతుల పంపుమి దేవా! ఆ వెల్గులో వచ్చి నిన్ను సేవించుకొనెదము. నీ శంఖ ధ్వనుల నైనను పంపించు, ఆ ధ్వని విశేషములం బట్టి నీ దగ్గరకు రాగలనేమో! కృషి చేసెదను, అటు కాకున్న నీవే మాకు గతి యని నిర్భరుఁడనై యుండెదను హరీ!

జ్ఞానముతోఁ దరింతు నన శాస్త్రముఁ దెల్యఁగ లేదు మేధ, స
మ్మానిత భక్తి నిన్ గనెద మన్నను చంచలమౌ మనమ్ము తాఁ
బూని ప్రపత్తిఁ జేతు ననఁ బోవ దహంకృతి యెట్లుఁ జేతువో?
దీనుల నుద్ధరింప భవదీయ కటాక్షమె దిక్కు శ్రీహరీ! 91

తా॥ జ్ఞానముతోఁదరించెద ననుకొన్న నాకు శాస్త్రజ్ఞానము లేదు. భక్తితో నిన్ను సేవింత మనుకొన్న నా మనస్సు చంచలమైనది భక్తి నిలువదు. ప్రపత్తి చేసి నీ దయాపాత్రుఁడ నగుదు ననుకొన్న అహంకారము చావదు. ఇఁక మావంటి దీనుల నుద్ధరించుటకు మీ నిర్హేతుక కటాక్షమే దిక్కు సుమా! శ్రీహరీ!

కనులకు నీ స్వరూపములె కానఁబడన్ వలె, కర్ణవీధి నీ
గుణకథ లెందునున్ వినుటకున్ లభియించఁగ నొప్పు, జిహ్వకున్
నిను వినుతించు కీర్తనమె నిత్య జపమ్మయి యుండఁగా వలెన్
మనమున నీదు ధ్యానమె సమంచితరీతిఁ జెలంగనౌ హరీ! 92

తా॥ కనులకు నీ రూపమే కనఁబడవలెను. చెవులకు నీ గుణ కథలే వినఁబడ వలెను. నాలుకకు నీ కీర్తనమే నిత్య జపమై యుండవలెను. మనస్సులో నీ ధ్యానమే యెప్పుడు నిలిచి యుండవలెను శ్రీహరీ!

జను వొక బందెకాన తొలిజన్మలఁ జేసిన పుణ్యపాపముల్
ఘనసుఖదుఃఖముల్ నిగళకల్పపదప్రతిరోధకాకృతుల్
ధనవనితానుభూతులకు ధర్మముఁ దప్పి చరించి శిక్షలన్
గొని యిటు క్రమ్గుచుంటి నను గూర్మి విముక్తు నొనర్పవే హరీ! 93

తా॥ జన్మమే ఒక బందెకాన. పూర్వజన్మలలోఁ జేసిన పుణ్యపాపములతోఁ గల్గిన సుఖదుఃఖములు కాళ్ళను అడ్డుపెట్టు బేడీల వంటివి. ధనము కోసము వనితకొఱకు ధర్మాన్ని అతిక్రమించి పైన నుడివిన శిక్షలకుఁ బాత్రుఁడనై ఇట్లు నశించుచున్నాను. నను బంధముక్తునిఁ జేయవే శ్రీహరీ!

వైకుంఠంబును వీడి వత్తు వని నే వాఛించి మిన్ గాంచెదన్
వీకన్ దుగ్ధసముద్రమున్ విడిచి నీవే వత్తు వంచున్ దిశల్
సాకల్యంబుగఁ గాంతు నా బలిని నిద్రం బుచ్చి పాతాళస
ల్లోకంబున్ విడి వత్తు వంచు భువి నాలోకింతురా శ్రీహరీ! 94

తా॥ నన్ను రక్షించుటకు నీవు వైకుంఠము విడిచి వత్తు వని ఆకాశము వైపుఁ గనుచుంటిని. పాలసముద్రము నుండి వత్తువేమో! యని ప్రక్కల నన్నింటిని జూచుచుంటిని. లేక బలిని నిద్రఁ బుచ్చి పాతాళలోకము వీడి వత్తు వని కాంక్షతో భూమి వైపుఁ గాంచుచుంటిరా శ్రీహరీ!

తాను స్తనంధయుం డొకట తల్లి దరిం జనలేక యుండినన్
మానుగ నమ్మ యేడ్చు శిశు మంచము పజ్జకె వేగ నేగి యెం
తో నును జెక్కిళుల్ నిమిరి తోరపుఁ గూరిమి నూరడించు న
ట్లే నినుఁ జేరలేమిఁ దమి నీవును నా దరి రావె శ్రీహరీ! 95

తా॥ చంటి బిడ్డ తాను తల్లి దగ్గరకుఁ బోలేక యుండినను తల్లి తాను పాప యేడ్చు తొట్టె వద్దకే వేగ పోయి యెంతో ప్రేమతో చెక్కిళ్ళు నిమిరి యూరడించుఁ గదా! అట్లే నేను నిను జేరలేకున్నను నీవే నా దరిఁజేరి నన్ను రక్షించ లేవా? ప్రభూ శ్రీనారసింహా!

తనయుఁడు చెడ్డ వర్తనలఁ దా నడయాడుచు నేడిపించినన్
జననియె వాని వీడి మనఁ జాలునె? నా దరిరాకు పొమ్మటం
చును వడి గెంటివైచునొకొ? చొక్కపుఁ బ్రేమల బుద్ధిఁ జెప్పి వ
ర్తనములఁజక్కదిద్దఁ దెటు తద్విధి నన్ గనవేల? శ్రీహరీ! 96

తా॥ కుమారుడు చెడ్డ నడకల నడచి తా నేడిపించినను తల్లి వాని వీడి యుండఁ జాలునా? నా దగ్గరకు రాకు పొమ్మని గెంటివైచునా? మీదు మిక్కిలి చొక్కమైన ప్రేమతోఁ జక్కని బుద్ధి గఱపి బాలుని నడవడి సరిదిద్దకుండునా? అట్లే నన్ను నీ వేలుకొనవేల శ్రీహరీ!

ఈ సంసారముకన్న నా నరకమే యెంతో నయబందు నీ
దాసుం డొందు స్వదుఃఖ మొక్కటియెకాదా యింక నీ సంసృతిన్
నా సొంతమ్మగు దుఃఖమేచు నన కాంతాపుత్ర మిత్రాప్త బా
ధాసంతానము నాకె దుఃఖము లిడున్ దాసావనా! శ్రీహరీ! 97

తా॥ ఈ సంసారముకన్న నరకమే యెంతో మేలు. ఆ నరకములో నా దేహమున కిడు బాధలే నే ననుభవింతును కాని యీ సంసారమందు నా సొంత దుఃఖములే కాక నా భార్యాపుత్రమిత్రాదుల దుఃఖసమూహము లన్నియుఁ గూడా నాకు దుఃఖము నిచ్చెడివే కదా దాసుల రక్షించు ప్రభూ, శ్రీహరీ!

ఈ సంసారములో స్వకర్మఫలమే నేవేళ భోగించుచున్
దోసమ్ముల్ బొనరించి భావిజనికై దుఃఖాల నార్జించెదన్
ఈ సంసారము కన్న నా నరకమే యెంతో నయం బందు నీ
దాసుండాత్మకృతాపరాధములె యేదన్ శిక్షఁ బొందున్ హరీ! 98

తా॥ ఇంకను ఈ సంసారములో పూర్వజన్మలలోఁ జేసిన నా కర్మ ఫలముల ననుభవించుచును ముందు జన్మలకై ఈ జన్మలోఁ బాపము లనేకము లొనర్చి క్రొత్త దుఃఖముల సంపాదించి పెట్టుకొనుచుంటిని. నరకములో వెనుక జన్మల పాపాల శిక్షలే అనుభవింతుఁగాని, ముందు జన్మల దుఃఖములకై పాపాలు చేయుట లుండవు. అందులకే ఈ సంసారము కన్నను ఆ నరకమే మేలు స్వామీ శ్రీహరీ!

ఒగి స్వర్గమ్మున దేవతల్ మధుర పీయూషంబులం గ్రోలుచున్
పొగరుం బొందుచు మత్తులై విషయ సమ్మోహాత్ములై యుండి నిన్
ఖగరాడ్వాహను విస్మరించెదరు, దుఃఖంబంద కానీ స్మృతుల్
తగ మాకీ భువివాసమే మెఱుఁగు మీ ధ్యానార్హ మౌటన్ హరీ! 99

తా॥ స్వర్గములోని దేవతలు తియ్యని అమృతము ద్రావుచుపొగరుఁబోతులై మత్తులై విషయాదులలో మున్గి నిన్ను - గరుఁడవాహనుని మరచియుండెదరు. నీవు మాకు భువిలో దుఃఖము సంభవించి నపుడైనా జ్ఞాపకమునకు వత్తువు కదా! కావున మాకా నరకముకన్న భూలోకనివాసమే మేలు శ్రీహరీ!

అరయ దయాళువుల్ కరుణ నందెద రాపద నందువారి దు
ర్భర దురవస్థలం గనుచు ప్రార్థన వారొనరింపకున్ననున్
మొరలిడనేని నీవొకట మోమును జూపవు ప్రోవరా వహో!
కరివరు గాఁచినట్టి కథ కల్లయెయౌ నటరా? నృకేసరీ! 100

తా॥ దయగలవారు ఆపదలో నున్నవారు కనబడిన, వారు తమను రక్షించుమని ప్రార్థించకున్నను వారి భరింపరాని దుస్థితి గాంచి దయతో రక్షించుటకు ప్రయత్నింతురు. కాని నీవు మేము మొరలిడినను గూడా నీ ముఖము జూపవు. రక్షించవు రావు. ఆ గజేంద్రుని రక్షించిన కథ కల్లయేనా శ్రీహరీ!

అరయన్ మీపదదాసుఁ డెప్డు తమ శుద్ధాంతస్థితిద్వారపున్
బరదా తీయుచు లోనికేఁగ సులభంబై యుండుఁగాదా! యటుల్
సరసీజోద్భవ శక్ర నిర్జరులకున్ సాధ్యంబెటుల్ మాయనుం
దరియింపం దమ దాసు లొక్కరికె సిద్ధంబై మనున్ శ్రీహరీ! 101

తా॥ నిజ మరయ మీ పాదదాసులు మీ సన్నిధిలో నుండువారు ఎప్పుడు మీ ఆజ్ఞల నడుఁగ కుండనే మీరుండు గది పరదా తీసికొని వచ్చి సేవ లొనరించుచుందురు. వారికి పరదా తీయుట సులభకార్యము కాని బ్రహ్మ ఇంద్రుఁడు దేవతలు మొదలగు వారికి మీ ఆజ్ఞలేక మీ దరికి పరదా తీసికొని వచ్చుట సాధ్య పడునా? దీనిబట్టి చూడ మాయ అను నిన్ను గాంచుటకు అడ్డముగా నున్న పరదాను సులభముగా తీసి నీ వద్దకు వచ్చుటకు నీ దాసులకు మాత్రమే సులభము గదా శ్రీహరీ!

కమలము నందు తేనియలు గల్గు విధానము తేటి తెల్యుఁ దా
నమలతఁ దన్మరందరస మాను విధాన మెఱుంగు నద్దియే
విమలచరిత్ర! నీ వఖిలవిశ్వమునందున నున్న యా రహ
స్యము నల జ్ఞాని తా నెఱిఁగి స్వానుభవమ్మును బొందు శ్రీహరీ! 102

తా॥ కమలమునందు తేనె ఎక్కడ నుండునో దాని విధానము తుమ్మెదకు మాత్రమే తెలియును. పవిత్రమైన ఆ తేనెలఁ గ్రోలు విధానముఁ గూడా దానికే తెలియును. ఓ పవిత్ర చరిత్రా! నీవు సమస్త విశ్వమునం దున్నవను విధాన మట్లే జ్ఞానికి మాత్రమే తెలియును. మీ గుణానుభవ విధానము కూడ ఆ జ్ఞానికే తెలియును శ్రీహరీ!

జనసంఘంబున నవ్వుఁబాటగు నటుల్ స్వాత్మాభిమానంబునున్
జన రాజాజ్ఞను ద్రోయు భృత్యుజనమై సర్వేంద్రియంబుల్ మనం
బును నా యాజ్ఞల ధిక్కరించు నిటు లెప్డున్ నీ సహాయంబు లే
మిని నే వీని జయించఁ జాలనిఁక స్వామీ! శ్రీనృసింహప్రభూ! 103

తా॥ జన సమూహములో నవ్వుఁబాటుగా నుండునట్లు నా ఆత్మాభిమానము దెబ్బఁ దినునట్లు రాజాజ్ఞను ధిక్కరించు భటులవలె నా సకలేంద్రియములు మనస్సు నా యధీనము దప్పి నడచుకొనుచున్నవి. ఎటులైనా నీ సహాయము లేక వీటిని నే జయించుట చాలా కష్టమైన కార్యము స్వామీ శ్రీహరీ!

పయనములోని జీవితము బాట సమంబయినన్ సుఖాఢ్యమౌ
ద్వయగతి నెత్తు వంపయిన దారి శ్రమప్రదమౌ నెటేని యా
శ్రమమది చేరుదాఁక నయిచన్ దగు కష్టసుఖాల నిత్యమౌ
నయనముఁ జేరు వెన్క శ్రమ లన్నవ వెక్కడ నుండు? శ్రీహరీ! 104

తా॥ ప్రయాణములోని జీవితము బాట సమానముగా నున్న నే సుఖముగాఁ జరిగి పోవును. ఎత్తు వంపులై బాట యున్నచో ప్రయాణము శ్రమలతోఁ కూడు కొనినది. ఎట్లైనా ఇల్లుఁజేరుకొనేదాఁక ఈ ఎత్తు వంపులఁ జనుచుండఁగాఁ గష్ట సుఖములనెడి ద్వంద్వములు తప్పవు. అట్లే నిత్యధామమైన నీ దరిఁ జేరిన వెనుక మాకు శ్రమలెక్కడివి? స్వామీ! అంతవర కీ కష్టసుఖాల నెట్లో సైచవలెను గదా! శ్రీహరీ!

ఈ గురురాజ్య సంపదలు నీ పదవుల్ విభుతల్ విలాసముల్
భాగవతంపు టాటలని బాగుగ గుర్తెఱిఁగెన్ మనమ్ము తా
వేఁగిన వీఁగిపోని పదవిం గన మీ పదదాస్యమే కదే!
మేఘజలాల పాటు ధర మీఁది జలాల కెటుండు? శ్రీహరీ! 105

తా॥ ఈ గొప్పవగు రాజ్యములు, సంపదలు, పదవులు, ప్రభుత్వములు వాని విలాసవినోదములు వీధి నాటకములోని ఆటలే కదా యని నా మనస్సు గుర్తెఱిఁగినది. రాత్రి మాత్రమే ఉండి తెల్లవారిన మాయమై చనునవి. అట్లు పోనిది మీ పాదదాస్యమే. మేఘములోని నీరు పతన మగునుగాని భూమిపై జలాలు పతన మందునా హరీ!

చెప్పిన యట్లు వంగుచును జెల్వగు నాభరణ మ్మొనర్పఁగా
నొప్పి యటంచు నెంచకయె నూల్కొని యగ్నిపరీక్ష గ్రాగుచున్
దెప్పర మైన సుత్తియల దెబ్బల కాగుచు మారకుంటచే
మెప్పయి యప్పసిండి తమ మేని కలంకృతి యయ్యె శ్రీహరీ! 106

తా॥ ఎట్లు వంచిన నట్లు వంగుచు సొంపగు నగఁ జేయు నపుడు కొట్టు సుత్తె దెబ్బలకు నొప్పి యగుచున్నదని యనక అగ్ని పరీక్షలకైనా ఆగుచు మార్పు లేకుండ నుండుటచేతనే కదా బంగారము తమ మేనఁ దాల్చఁ బడు గౌరవమును బొందు ఆభరణరూపముగా నుండినది శ్రీహరీ!

స్థల మది యేదియైన నిలఁ దాము వసించిన దివ్యదేశమౌ
జల మది యేదియైనఁ దమ సన్నిధిఁ గాంచిన పుణ్యతీర్థమౌ
కుల మది యేదియైనఁ దమకుం బరిచర్య లొనర్ప ముక్తుఁడౌఁ
గల మది యేదియైనఁ దమ గాథల నల్లిన వేదమౌ హరీ! 107

తా॥ స్థల మది ఏదైనను మీరుంటే చాలు అది దివ్యదేశమగును. జల మది ఏదియైనా మీ సన్నిధి దాని ప్రక్కన నున్నచో అది తాను పుణ్యతీర్థముగా మారును. కుల మది ఏదైనా మీ పాద సేవచేసినఁ జాలు ముక్తుఁడై తీరును. అట్లే కల మది ఏదియైనా మీ పుణ్యకథలు వ్రాసిన నది వేదతుల్యగౌరవమును పొందును గదా శ్రీహరీ!

జన్మము ముక్తి దారి జన సాగఁగ నీయని కాలి ముల్లు తా
జన్మల ముండ్లునుం బెరుకు సాధనమై మను నింక నొక్క మేల్
జన్మ మనం బరంగు ములు, సమ్మతి దానిని దీన నూడ్చి, యీ
జన్మల ముండ్ల రెంటిని విసర్జన సేయుటె ముక్తి శ్రీహరీ! 108

తా॥ పుట్టుక అనునది ముక్తి త్రోవలో నడిచి పోనీయని కాలి ముల్లు. ఈ జన్మము లనెడి ముండ్ల నూడఁ బెరుకుటకు సాదనము ఇంకొక మంచి జన్మము. మొదట విరిగిన ముల్లును మరొక ముల్లు ఊఁడ దీసిన పిదఁప దీసిన ముల్లును, తీయఁబడిన ముల్లును - ఈ రెంటిని పారవైచుటే ముక్తి యనఁబడు శ్రీహరీ!

శ్రీ నృసింహ స్తవరాజము సంపూర్ణము

# గద్యము

శ్రీ వారణాసీ విశ్వవిద్యాలయ ప్రదత్తాత్యంతగౌరవ
"విద్యావాచస్పతీ" తి బిరుద ప్రదాన,
ఆంధ్రప్రదేశ ముఖ్యామాత్య పి.వి. నరసింహరాయ
బహూకృత "నవరత్న ఖచిత సువర్ణ గండ పెండేర"
ఘన సన్మాన
ఉస్మానియా విశ్వవిద్యాల యాంధ్రశాఖా చార్యాలంకృత
"సువర్ణ ఘంటా కంకణ బహుమాన"
కరీంనగర మండలాధికారి ప్రదత్తామూల్యా రత్నాంబరవితాన
మహాపండితాఖండల సభామండపాస్థాన కృతానేక "కనకాభిషేకస్నాన'
రాష్ట్రపాల మహా సచివాది ప్రముఖ బహూకృత బహు సువర్ణపతక
మండన మండనాయమాన
ఉభయ భాషాకవి సంప్రదాయానువర్తి, ఉత్ప్రేక్షాకవి చక్రవర్తి,
మధుర కవికోకిల, మహాకవి శిరోమణి,
అభినవ పోతన, అభినవ కాళిదాస,
విద్యా వాచస్పతి, మహాకవి
డాక్టర్ వానమామలై వరదాచార్య కృత
శ్రీ స్తవరాజ పంచశతి

—: సమాప్తము :—

